# పండితాభిప్రాయములు

---

నెల్లూరు,

తే 12—10—1931 ది.

శ్రీయుత వరిగొండ సత్యనారాయణమూర్తిచే రచింపఁబడిన 'యవనదత్త' యను నవల నవధానముతోఁ జదివితిని. సత్యనారాయణ మూర్తిగారు నాకుఁ గొన్నియేండ్లుగఁ బరిచితులు. కాని యాయనకడ నిట్టి యనల్పకల్పనాకౌశల మొండె, రచనాచమత్కారమొండెఁ గల దని నే నెఱుంగను. కావున 'యవనదత్త'ను జూచిన వెంటనే నాకుఁగల్గిన సంతోషాద్భుతములకు మేర లేకుండెను. ఈ నవలయందలి సంవిధాన మేమి, సురుచిరమైన శైలియేమి నా డెందమున కమందమైన యానందముం గూర్చినవి. కథంగొనుట యందేగాక కథను సాగించిన తెఱఁగునందుం గూడ, గ్రంథకర్తయొక్క దేశాభిమానము సువ్యక్తమగుచున్నది. ఈ గ్రంథ మాంధ్రవిద్యార్థులు—అందును పై ఫారములయందుఁ జదువు వారు—పలుమారు పఠింపఁదగినదని నా యభిప్రాయము.

'అభినవతిక్కన'
దుర్భా సుబ్రహ్మణ్యశర్మ,
Senior Telugu Pandit, V. R. College,
Member, Board of Studies in Telugu;
Andhra University, Waltair.

ఆర్యా!

మీ నవలయందు స్థాలీపులాకన్యాయంబుగాఁ గొన్నిపట్టులు చదివితి. అందలి శైలి రమ్యంబుగాను, మృదుసందర్భకలితంబుగాను నున్నయది. మనుజుల స్వభావగుణంబులను బ్రకృతి స్వభావంబులను నందందు తెన్నగా వర్ణింపఁ బడినవి. ఇందలి వాక్యములు కొన్ని యధునాతనగద్య గ్రంథము లందువలె నతి దీర్ఘములును క్లిష్టాన్వయోపేతంబులునుగాక చిన్నవియును సరళాన్వయసుందరములును నై చదువరులకు ముదం బాపాదించుచునికి యిందలి యొకసుగుణం బని నేఁ దలంచెద.

ఇయ్యది యున్నతపాఠశాలలలోను గళాశాలలలోను బాఠ్యగ్రంథముగా నిర్ణయింపఁ దగినదని భావించుచున్నాను.

ఇట్లు, సుధీవిధేయుఁడు,
నాగపూడి కుప్పుస్వామయ్య.

---

మహారాజశ్రీ వరిగొండ సత్యనారాయణమూర్తి గారు రచించిన 'యవనదత్త' యను నవలను స్థాలీపులాకన్యాయమునఁ జదివితిని. కవిగారి కవితారీతి మృదుమధురమై, నిర్దుష్టమై పాఠకానందదాయకమ చున్నది. చాణక్యుని నీతికౌశలము కవిగారికల్పనమహిమచే నెంతయుఁ జమత్కృతమై యొప్పుచున్నది.

ఇయ్యది విద్యార్థులకు మిక్కిలి యుపకారము కాఁగలదని నా యభిప్రాయము.

ఇట్లు,
విద్వజ్జన విధేయుఁడు
వఝుల చిన సీతారామశాస్త్రి

చెన్నపురి,
తే 7-11-31 ది

'యవనపుత్రి' చక్కని చారిత్రకనవల. చాణక్యుడు, చంద్రగుప్తుడు, సెల్యూకసు, హెలెను మొదలగువా రందలి పాత్రలు. చరిత్రము హిందూదేశీయు లెల్లరు నెరిగినదే. పెక్కు హిందీ బెంగాలీ గ్రంథములనుండి యిదివరకే ఇతివృత్త మాంధ్రభాషలోనికి దిగుమతియైయున్నది. అయినను యిందలి సన్నివేశము (Plot) అంతయు స్వకల్పితము. అదియును అపూర్వకల్పనము మంచి అద్భుతములతో కూడినది. ఇట్టి సన్నివేశమును, కల్పనలను, అద్భుతరసమును గూర్చి పాఠకులదృష్టిని నా మూలాగ్రమును బిగపట్టియుంచిన గ్రంథకర్తయొక్క శేముషీవిశేష మెంతయు కొనియాడ తగినది. శైలిగంభీరము; శృంగారవీర కరుణ శాంతాది రసము లాయా పట్ల మూర్తీభవించినట్లు అలరారును. గ్రంథము దేశాభిమానపూరితము; ఉన్నతాశయ ప్రేరకము. ప్రాతచరిత్రమునైనను క్రొత్తకల్పనలతో రససంఘటనముగ రచించినచో, కాలానుగుణమై, ప్రత్యక్షమై క్రొంగ్రొత్తగ వలరారునట్లు చేయనగునని గ్రంథమును పఠించినవారికి తెలియును. అందమగు శైలినిజూచి డెందమానం దానందించుచు మని యువ్విళ్లూరు భాషాభిలాషులకుగూడ నిది యవశ్యపఠనీయము. ఇట్టి నవలను రచించి, నవలాప్రపంచమున కొక సౌందర్యమునుగూర్చిన గ్రంథకర్తయొక్క పరిశ్రమ మెంతయు కొనియాడ తగియున్నది.

"భారతి" మదాసు.

It was with great pleasure that I went through some portions of the book written by Mr. Varigonda Satyanarayana Murthi, It is written in chaste classical style; the plot is well-conceived and the reader's interest in the story is kept sustained remarkably well. The language is idiomatic and vigorous. It is a book fit to be placed in the hands of young men and women in our schools and colleges.

Vizagapatam,
Dated 24-7-1933.

M. VENKATARANGAIYA,
of Andhra University.

# విషయసూచిక

# యవనదత్త

## మొదటి ప్రకరణము

### దైవచిత్రము

శ్రీవాణీకాంతుని కమండలూదకమునఁ బ్రభవ మొంది, శ్రీరమానాథుని పాదరాజీవస్పర్శచేఁ బవిత్రితమై, శ్రీపార్వతీపతి జటాజూటమున వ్రాలి భువికి నిర్గమించిన భాగీరథి, ఆర్యావర్తమును బవిత్ర మొనర్చుచు సరిత్పతితో సమాగమ మొందును ఆ నదీమతల్లికి నుభయకూలములఁ గల క్షేత్రములు పావనంతములు, సర్వసస్యశ్యామలములు నై యనంతకోటిజీవరాశికి జీవనాధారంబులై యుండును.

మన కథాకాలమున మౌర్యరాజేంద్రుఁ డగు చంద్రగుప్త ధారుణీశ్వరుం డాసేతుహిమాచలము ధారుణీమండలము నవక్రవిక్రమలీల రామరాజ్య మనఁ బాలించుటం జేసి ధర్మము నాలుగుపాదముల నడువసాగెను. చాతుర్వర్ణ్యములు తమతమ వర్ణాశ్రమధర్మానుష్ఠానపరము లై యుండుట యతిశయోక్తి కానేరదు. ఆ ఱేని రాజ్యమునందు పేదసాదలకు దారిద్ర్యభయము గలుగదు. దుష్టులకు నిలువ నీడ దొరకదు. శిష్టులకు నెట్టి యాటంకములు గలుగవు.

ఐహికసుఖంబుల నిరసించి నిష్కామాచరణంబున నాత్మశుద్ధిఁబడసిన పెద్దలు పెక్కురు ముముక్షువులై ప్రశాంతాశ్రమంబులఁ దన్నదీతీరంబున నిర్మించుకొని యథాశక్తి తురీయాదిభూమికల సాధించుచుండిరి.

వైశాఖమాసమునఁ గొండొకనాఁడు ప్రభాకరుఁడు వినువీథిని ముక్కాలు దాటి చరమగిరిని జేరు నాతురంబున హుటాహుటిఁ జనుచున్నాఁడో యనఁ గాన్పించుచుండెను. ఎండవేడిమి క్రమక్రమంబున సుకఁగఁబాఱెను; జీవకోటి నీడపట్లనుండి వెలికి రాసాగెను. గంగాతీరమందలి యాశ్రమప్రదేశంబులు వివిధచ్ఛాయాతరువులతోడ, నానాఫలభారవినమ్రపాదపంబులతోడ, విరియఁబూచి నెత్తావులు వెదఁజల్లుచున్న లేదీవె పూఁజొంపంబులతోడ నిండి చూడఁజూడ మనోహరముగ నుండెను. మలయానిలుఁడు పుష్పామోదమును గ్రహించువాఁడై వనమునందు తారాడుచుండెను. కురంగశాబకములు భయముదక్కి, ఆశ్రమద్వారములఁ బరుండి, నెమరువేయుచు నప్పుడప్పుడు తమ నయనతారళ్యమును బ్రదర్శించుచుండెను. అట్టి యాశ్రమంబులలో నొండొకదాని వెలుపల వ్యాఘ్రాజినమును బఱచి దానిమ్రోల తాటియాకు గ్రంథములు గొన్ని చెల్లాచెదరుఁగా బరువఁబడి యుండెను.

ఇంతలో నచ్చోటికి పురుషుండొకఁ డరుదెంచి 'ఎవరు లోపల?' యని బిగ్గఱగా నఱచెను. ఆ భీకరారావమునకు హరిణి మదరిపడి చంగున లోపలికి గంతువైచెను.

కొంతసేపటికి నాశ్రమమునుండి వ్యక్తియొకండు బయటి కరుదెంచెను. ఆతనిరూప మలౌకికము; తేజమపారము. వేయేల! ఆ మహాత్ముండు ధరణీతలమున కరుదెంచిన సాక్షాచ్ఛివుం డనుటకంటె వేఱుగా వర్ణింప మాశేషునికి శక్తి చాలదు. జానువులపర్యంతము ధరించియుండు కాషాయాంబరములును, కంఠసీమ నలంకరించియుండు రుద్రాక్ష నక్షత్ర మాలికలును, వెడదనుదురుపైం దీర్చియుండు విభూతిరేఖలును నా మహామహుని కపూర్వశోభాప్రదములై తనరారుచుండెను. విశాలఫాల మాతని యఖండప్రతిభావిశేషమును జాటుచు, నాతని వదనేందుమండలమునకుం బెట్టనిభూషణమై యుండెను. సాధుసందర్శనము సకలపాపసంహారకము. సాధుసేవ సర్వపుణ్యప్రదము. మహాత్ముల కసాధ్య మేమి కలదు?

మనయోగివరేణ్యుం డట్లు వెలికివచ్చి యందు నిలిచి యున్న పురుషుని గాంచి, వాని నుడులంబట్టి యతండు మ్లేచ్ఛుం డని గ్రహించి వానిమోము తేఱిచూచెను. చూపుతోడ వాని యంతరంగము యోగికి విశద మయ్యెను. పరేంగితజ్ఞులకు గోచరింపనివి యుండవుకదా! కాని యాగ్రీకు వీరునకు యోగిప్రభావవిశేషాదు లేమియుం దెలియవు. మార్జాలదుగ్ధపానన్యాయము ననుసరించి, తనమాయోపాయముల నాతండు గ్రహింపలే దని యతండు తలంచెను.

యోగి:— ఓయీ! రమ్ము! సర్వేశ్వరుండు నిన్నను గ్రహించుం గాక! మాన్యరాజేంద్ర పరాక్రమ రక్షిత

మగు నీ దేశమునం దదీయవిరోధిజాతివానికి నీకుం బ్రవే శమున కెట్లు వీలుకలిగెను? నీధైర్య మప్రతిమానము సుమా!

యవ:— (సగర్వముగా) మాగ్రీకువీరుల కిట్టిసాహస కార్యములు సహజములు. ఇప్పటి కే మైనది? రాఁగల యవనహైందవసమరమున మాశౌర్యపరాక్రమము లింకను వైరిభూమిశ్రితములు కాఁగలవు.

యోగి:— ఓయీ! నిజము పల్కితివి. ఈ విషయము నా కింతకుముందే తెలియును. వీరప్రసవ యగు భరతమాత వీరవరేణ్యులచేతనే పాలింపఁబడవలయును. అందులకేసుమా రాజ్యములు వీరభోజ్యము లనియెదరు. ఈ విషయమై నాకును మౌర్యపతిపాతి యగు మా చాణక్యాచార్యులకును వాదోపవాదము లెడతెగవు.

యవ:— చాణక్యుఁ డిప్పు డాశ్రమమున లేఁడా?

యోగి:— ప్రస్తుతము వా రిందులేరు. కార్యార్థులై ప్రభుదర్శనమున కేగియున్నారు.

యవ:— ఎప్పుడు వచ్చును?

యోగి:— రేపు ప్రాతఃకాలముననే రాఁగలరు; పోయి యొక ఘడియయే యైనది.

యవ:— నే నిచటికి వచ్చునపు డొకయతి నా కెదు రయ్యెను. ఆతఁడేనా? పొడుగరి. ఫాలభాగమున నొకమచ్చ కలదు. ముఖము తేజోవంతముగా నుండెను... ఆతఁడేనా?

యోగి:— చాణక్యోపాధ్యాయు లటు లుందురా ? వారి దర్శనమాత్రముననే ఎట్టి వీరాధివీరుని గుండెలైనను బ్రద్దలు కాకమానవు. చతురుపాయములకు నతఁడే మొదటి యాచార్యుఁడు. వారికి సమాను లుండ రనుట యతిశయోక్తి కాదు. సామర్థ్యంబున నగస్త్యునికి జోడనవచ్చును. నీ యదృష్ట మే మనవచ్చును? సమయముజూచి వచ్చితివి. లేకున్న నీగతి యేమై యుండునో నీకే యీపాటికిఁ దెలిసి యుండును.

యవ:— ఇంతకును జాణక్యుఁ డీనాఁటి కదృష్టవంతుఁడు. సరియే పోనిమ్ము. మగధసామ్రాజ్యమంత్రి రాక్షసుఁ డున్నాఁడుగదా! అతఁడును జాణక్యున కే విషయమునఁ దీసిపోవువాఁడుకాఁ డను ప్రతీతి కలదు. నిజమేనా?

యోగి:—అవును. సర్వవిషయముల నా పురుషరత్నద్వయము సమానమని చెప్పవలయును. అయినను జయాపజయములు కాలాధీనములు గదా! కావుననే, మౌర్యరాజ్యస్థాపనసమయమున రాక్షసామాత్యునకుఁ గాల మనుకూలింప లేదు. చాణక్యునకుఁ గాలము కట్టివచ్చినది. అతఁడు పట్టిన దంతయు బంగార మగుచుండెను. అట్టుండియు, రాక్షసుఁ డాతని కెత్తుకెత్తు వేయుచుండెను. దైవము ప్రతికూల మగు నప్పుడు పురుషకారము ఫలింపదుగదా! మాయలమారి యగు చాణక్యునిముం దెవరును నిలువఁజాలరు. ఓయీ! గ్రీకుక్షేమకాంక్షి నగు న న్నన్యథా తలంపకుము. చెప్పవలయు నన్న, నాకును జాణక్యునకును వైరమునకుఁ గారణములు

లెక్కకు మిక్కిలిగాఁ గలవు. 'నందపక్షపాతి' యను మిషచే నీ చంద్రగుప్తుఁడు మాతండ్రిని నిట్టనిలువున బ్రాణములు దీసెను. ఇది జరిగి యిప్పటికి దాదాపు ముప్పదివత్సరము లైనను, నాకుమాత్రము నిన్ననో మొన్ననో జరిగినట్లులున్నది. తలంచినంతనే నా హృదయము ప్రేలెడు; పుండు మాయదు. ఏమి చేయవచ్చును? నూర్గాంతరము దోఁపదు. కాన జాణక్యశిష్య వేషమును దాల్చితిని. కాలమునకుఁ గట్టు వడనివా రుండరుగదా! అయ్యా! రహస్య మొండు గలదు, వినుము. పితృహంత యగు నమౌర్యుని మాపు మాపి, యీ భరతవర్షమున మౌర్యరాజ్యమును నామా వశిష్టమొనర్చుటకుగా నాప్రాణములనైనఁ ద్యజింప సంసిద్ధుఁ డను. ఇదే త్రిశుద్ధికి బాస యొనరించుచున్నాఁడ.

యోగిచంద్రుని పలుకు లా గ్రీకువీరుని విన్వాఱపాటు గొల్పెను. వాని చెప్పలు ప్రాలవు. 'గ్రీకుక్షేమకాంక్షి' యనుమాట వాని కమృతోపమయ్యెను. అతనికి సంతోషాతి శయమున మైమఱచిన ట్లుండెను. అప్రయత్నముగ, ననా యాసముగ వానికి 'గ్రీకుక్షేమకాంక్షి' యగు స్నేహితుఁడు లభించుట, నిఱుపేదకు ముల్లెదొరికినచంద మయ్యెను. వాని యానందము వెల్లివిరిసెను. "యోగీశ్వరా! యవనరాజ్య రమానాయకుఁడు మా శెల్యూకేశ్వర చక్రవర్తి, నాముఖాల మున మీకుఁ గృతజ్ఞతాభివందనము లర్పించుచున్నాఁడు." అని యాతఁడు బడలికచేఁగాఁబోలు ప్రక్కనుండు సైకత వేదికపైఁ జతికిలఁబడెను.

యోగివరేణ్యుఁ డాతని సానుకూలముగ నాలకించి "అయ్యా! పానీయము వలయునా? ఆతిథ్యాలంబనమునకు క్షమింపుఁడు!" అనియెను.

యవనుఁడు వల్లె యనెను. యోగి లోనికిఁబోయి మంచినీరు దెచ్చియిచ్చెను. అతఁడు జలముఁగ్రోలి దప్పిదీర్చికొని యోగీశ్వరుని సుస్వభావము నెంతయు శ్లాఘించెను. యోగి యంతులకుఁ జిఱునవ్వునవ్వి "కృతార్థుఁడను. అతిథి సత్కారము గృహస్థులకే గాక యాశ్రమవాసులకు నయితము విధివిధానము, శాస్త్రసమ్మతము. మీరు మిక్కిలి చాణక్య గుర్వాజ్ఞ" అని పలికెను.

యవ — చాణక్యుఁ డంతటి ధర్మాత్ముఁడా? వాని చేఁతలు క్రూరము లని విందుముగదా!

యోగి — చాణక్యాచార్యులు సర్వతంత్రస్వతంత్రులు; సర్వగుణసంపన్నులు. క్రూరులకుఁ గ్రూరుఁడు. దయాళురకు దయాళువు. మానవసేవయే మాధవసేవగా నతఁడు భావించును. నక్రగతిని జక్కఁజేయుటయే తనవిధిగా వర్తించును. చాణక్యుఁ డేతన్మాత్రుఁడు గాఁడు సుమా! ఆవులించినఁ బ్రేవు లెంచును. కణకణలాడు నగ్నినైనను మ్రింగఁ గలంత సాహసుఁడు. మన మంతనముల నతఁడు పొంచి వినుచున్నాఁడా యని నాకు భయమయ్యెడు. అయిన నాతని గడతేర్పవలయు ననియేనా నీతలంపు?

యవ — నీమ్రోల దాపఱిక మేల? చాణక్యవధోద్యోగము న న్నిటకుఁ దెచ్చెను. ఆతనిని ముగించిన, రాక్షసామాత్యుని కుడిభుజము విరిగిన ట్లగును. రాక్షసునిగూడ

మట్టుపెట్టినఁ జంద్రగుప్తుఁడు ఱెక్కలుదీసిన పక్షి కాఁగలఁడు. అనంతరము హైందవ పరాజయము, గ్రీకు విజయము స్వతస్సిద్ధములు.

యోగి—ఓయీ! సంకల్పసోపానముల నెక్కి గగన సౌధనిర్మాణమునకుఁ బూనితివి సుమా! పెదవికిఁ బాత్రకు నడుమ నంతరాయము లెన్ని యోగదా! మన యుపాయ ములకుఁ బ్రత్యుపాయముల నీవలెనే చాణక్యుఁడు కావించు కొనియుండును. నందరాజ్యపతనమునకై యా మహామహుఁ డొనర్చిన యమానుషకార్యములు విన్న నీహృదయము వ్రక్కలుగాక మానదు.

యవ—గోరంతలను గొండంతలు సేయకు. యవన విరోధిమనికి మాకుఁ బ్రక్కబల్లెముకదా! ఈ నా ప్రయత్నము ఫలించిన నా విధి నొనర్చినవాఁడ నగుదు.

యోగి—చంద్రగుప్తసార్వభౌముఁ డంత యనద గాఁడు. భారతీయు లన్ననో గొదమసింగములు. చేతులకు గాజులుతొడిగి యుండలేదు.

యవ—(హేళనము) ఔనౌను! తల్లిపుట్టింటిని మేనమామయొద్దనే పొగడవలయును. పరవీరభయంకరుం డైన మాఅలకసుందరునిదాడికి నోడి భారతీయులుపంచలు దాకి తల్లడిల్లరా? లోకైకవీరుం డగు నాతఁడు మిమ్ము గడగడ నాడింపలేదా?

యోగి—కాల మెల్లప్పు డొకేతీరున నుండదు. "ఓడల బండ్లు బండ్ల నోడలు." అలకసుందరుఁ డీ

దేశముపై దాడివెడలినతఱి హైందవోర్వీపతు లైకమత్యము మాని, స్వపరహితవివేకశూన్యులై, యాతనికి సాయమొనరించి, భరతమాతను పరున కప్పగించి, కడలేని యిడుమలఁ గుడిచిరి. ఒద్దికలేమి యిన్ని కడగండ్లకుఁ గారణ మయ్యెను. రాజు లన్యోన్యకువోఁ బ్రజలగతి చెప్పవలయునా? పాపము, వారు అనాథులై పరితాపకుండములఁ గ్రాఁగవలసి వచ్చినది. ఇప్పు డన్నను కాలము మాఱినది. తమ్ముఁ దా మెఱిఁగి తా మొనర్చిన చెనటిచేఁతలకు లజ్జించిరి. దేశభక్తి భవించి వారియెదుట నిలిచెను. రాజులెల్లరు దే యమే ఆత్మాభ్యుదయముగా నిశ్చయించి, నడుము కట్టి యున్నారు. మాతృసేవకన్న మించిన ధర్మము లేదుగదా! నేఁడు లోకత్రయ మెత్తివచ్చినను, తగరు కొండనుబోలె, భారతదేశమును ఢీకొనుట యగును ......కాని, ఇట్లనుట వలన నన్ను భారతహితైషినిగా నెంచకుము. కలరూపు వచించితిని. ఇది హెచ్చరిక యగుఁగాక! చిన్నపాము నైనను బెదకఱ్ఱతోఁ గొట్టవలయును. జయాభిలాషి యాత్మీయ బలమునకన్న నెదిరిబలము మిన్న యని యెన్నుచు, విజయోపాయము నెమకుచుండవలయును.

యవ.— నిజము వచించితివి. ఈమాటలు మాయత్నములు ప్రబలతరములు .జయము మాకు సిద్ధము. సందియము వలదు. భారతరాజ్యలక్ష్మిని ముల్లెమూటగాఁ గొనిపోవుదుము. ముమ్మాటికి నిజము.

ఇప్పటికే భానుఁ డస్తమించెను. మునుఁజీఁకటులు పర్వసాగెను. యోగి యాతనితో 'ఓ మా! అనుమరలులేక

రాజ్యరహస్యముల నా కెఱింగించితివి. కృతజ్ఞుఁడను. ప్రొద్దు పోవుచున్నది. ఇవిగో యీ కదళీఫలముల నారగించి యీ తిన్నెపైఁ బవళింపుము. ఎల్లి చాణక్యుఁడు వచ్చును. మన మిద్దఱము గలిసి యాతనిమద మణఁగింతము' అని లోనికిఁ జని నాల్గు కదళీఫలములఁ దెచ్చి వాని కిచ్చెను.

యవనుఁడు 'వల్లె' యని యా పండ్లు దిని పరుండెను. మార్గాయాసము త్వరింప, నిద్రాదేవియుఁ బెద్దమ్మవలె వచ్చి యాతని నంతలో నావేశించెను.

'పరమేశ్వరా! రమారమణా! నారాయణా! అవాఙ్మానసగోచరుండవగు నీ చర్యలు దురూహ్యములు గదా!' యని యోగి యనుకొనుచుఁ గర్తవ్యము నాలోచించుకొనుచు లోనికిఁ బోయెను.



# రెండవ ప్రకరణము

అరుణుఁ డుదయించెను. పక్షిజాలములు పలుకసాగెను. బాలభానుఁడు సహస్రకిరణముల విసరుచు లోకమును ప్రబోధించి తన లోకబాంధవనామమును సార్థకముఁ జేసి కొనెను. ఇనునిరాకను తెలుపుటకో యన వనశకుంతసంతానము వినువీథి నెక్కి కలకలారావములఁ బాడసాగెను. గంగాతరంగడోలికల నూఁగియూఁగి, సద్యోవికసితసరోజాతాది కుసుమసౌరభములఁ దోఁగిదోఁగి, పిల్లవాయువులు ప్రాణికోటిని సుఖపరవశముచేయుచు మెల్లమెల్లఁగ వీవసాగెను.

సకలలోకసమాహ్లాదకరం బగు నట్టి ప్రాతఃకాలంబునఁ జాణక్యాచార్యుం డొంటరిగఁ గూర్చుండి యోచనాశీలుం డై యుండెను. ఆయనకన్నులు నిప్పుకలు గురియుచుండెను. ముఖము జేవురించి బాలభాస్కరుని బురుడింపసాగెను. ఆతనిసమీపమున నొకలేఖ పడియుండెను. అందలి సంగతులే యాతని కింత యాలోచనీయాంశము లైనవి. యోచనాపరంపర లాతనిమెదఁ బరువులిడ సాగెను. చిత్తము త్తలపాటు చెందెను. ఆతఁ డా జాబును మఱలఁ జేకొని చదువ మొదలిడెను.

పార్వతీయనాయకశిఖామణి యగు భైరవనాయకునకు

యవనరాజ్యరమాధురంధరుం డగు సెల్యూకేశ్వరసార్వభౌముఁ డంపు లేఖార్థములు :

మిత్రసత్తమా!

నీవు వ్రాసిన యుత్తరము చేరినది. సంగతులు విశదము లైనవి. నీవాత్సల్యాతిశయమునకు మా కృతజ్ఞతాభివందనములు.

చాణక్యుఁ డనువాఁ డున్నంతవఱకు గ్రీకువిజయము సందేహాస్పద మని నీవు వ్రాసినది నిజము. దండము తప్ప నొండు వానియెడ పొసఁగదు. కావున నీవు బాసతప్పవలదు. చాణక్యస్వర్గారోహణమును, మౌర్యరాజ్యవినాశనమును, గ్రీకువిజయోత్సవమును గూర్పుము. భైరవనాయకునకుఁ గలుగు వైభవాతిశయమునఁ బూర్వాపరతారతమ్యము నీవే చూతువుగాక!

ఇట్లు,
భవన్మిత్రుఁడు,
సెల్యూకేశ్వర చక్రవర్తి.

చాణక్యుఁ డా లేఖ నా మూలాగ్రముగఁ జదివెను. వాని నేత్రములు నిప్పుకలు వర్షించెను. ఆతని ముఖమండలము మధ్యందినదినకరు ననుకరించెను. భైరవనాయకుని సాహసకౌటిల్యము లా దేశబంధుని మహాశోకక్రోధవివశు నొనర్చెను.

'ఔరా! మ్లేచ్ఛాధమా! ఏమి నీతుచ్ఛపాటు! ఏమి నీ కండకావరము! ఐశ్వర్యమదోన్మత్తా! గ్రీకురాజ

హతకా! జగదేకవీరుని జంద్రగుప్తునిపైననా నీవు కత్తిఁ గట్టుట! నిప్పు నొడిఁగట్టుదువుగాక! చుక్కల లెక్కించుదువుగాక! మౌర్యసార్వభౌముని జయించఁగలవా? ఇది నీచేత కాదుగదా, శైతలఁ దన్నినవానికైన సాధ్యము గాదు!”

“ఓరీ! భైరవనాయకా! ఈ నీచలాభతృష్ణ నీ కేటికిఁ గలిగె? తిన్నయింటివాసమ...

రించినదా? పాలుద్రావి...

కితవా! గోముఖవ్యాఘ్రమా. ...ములు ...ట్టి పొట్టఁ బోసికొనుపంద కింతటి సాహసమా? ఇట్టిద్రోహుఁడ వని తెలిసియుండిన నింతకాలము మనియుండవుగదా”

“భారతీయులయశఃకీర్తులు ముల్లోకముల వ్యాపించు తఱి వచ్చినది. ‘వినాశకాలే విపరీతబుద్ధిః’ యను సామెత తప్పదు. సింగమునోటికబళమునకై యుఱికిన గోమాయువు దక్కునా? భారతవీరకృపాణసంఘట్టనోద్భూతదావానలము మ్లేచ్ఛసైన్యాటవుల భస్మీభూత మొనర్చును. రాక్షసాది మహామాత్యప్రతిభాప్రభంజనసముద్ధూతము లై వైరిదళమేఘపటలంబులు పటాపంచ లగును.”

“ఓతల్లీ! భారతజననీ! దిగు లొందకు. త్రిభువనవిజయైకదక్షుం డగు చంద్రగుప్తసార్వభౌముఁడు నీకుఁ బుత్త్రరత్నమైయుండ సెల్యూకేశ్వరులు కోటానుకోట్లయినను నీ వంక తేఱిచూడ నోడుదురు. నీసుతులు అవక్రవిక్రమసంపన్నులు; నిన్నుఁ గంటిని ఱెప్పవోలెఁ గాఁతురు. భయపడకు.”

అని యూతఁ డనుకొనుచుండ నింతలో నచటికి భానుప్రభాభాసమాననూర్తియు, మహారాజోచితాలంకార విలసితగాత్రుండు నగు నొక పురుషశ్రేష్ఠుఁ డరుదెంచెను. ఆతని జూచిన తోడనే చాణక్యాచార్యుఁ డనిర్వచనీయానందతుందిలుఁ డయ్యెను. అయ్యభినవాగతుఁడాచార్యునకు నమస్కరించెను. ఆచార్యుఁ డాతని నాశీర్వదించి యెదుట నుండు పవిత్రాసనముపైఁ గూర్చుండఁజేసి "వత్సా! వృషలా! నిన్నుఁ బిలువనంపిన కారణము తెలియునా?" యని లేని చిఱునగవు దోఁపఁ బల్కెను. చంద్రగుప్త సార్వభౌముని వృషలుఁ డని చాణక్యుఁడు మాఱుపేరునఁ బిల్చుచుండును.

చంద్ర:—గురూత్తమా! మీమోముతీరు చెప్పకయే కారణమును జెప్పుచున్నది. గ్రీకులదండగయే యిందులకుఁ గారణ మని తలంచెద. ఏ మ్లేచ్ఛకురంగ మీ నృగరాజగుహాంతరాళమును మఱలఁ జొచ్చినది? అహో! మీ వదనము సస్మిత మయ్యు క్రోధానలఁపుగప్పు దాల్చియున్నది. కారణ మేమి?

చాణ:—చాణక్యరుధిరపానప్రతిజ్ఞాబంధురుఁడై జంకు గొంకు మాని కొండొకయవనుఁడు నిన్న మునుమాపటి వేళ యిచటి కరుదెంచెను. కాని, యా వెఱ్ఱి చాణక్యుని ప్రతిభ నెఱుఁగఁడు. నేను చణకనందనశిష్యవేషముదాల్చి వేషమునకుఁ దగినట్లు బాసలాడితిని. ఈపాటి కాతఁడు గృధ్రగోమాయువులకు విందయి యుండును. అది యో

టుండ నిమ్ము. భావిని ద్రవ్యంబోగా భూతము బయలం బడినట్టుల నిన్నటి యీ గ్రీకువీరునివలన విశేషోదంత మొకటి వెలువడెను.

అని చాణక్యుఁడు కమ్మను సార్వభౌమున కొసఁగెను.

చంద్రగుప్తుఁడు దానిని సాంతముగాఁ జదివికొనెను. లేఖాపఠనమాత్రముననే యాతని కను లెఱ్ఱఁ బాఱెను. బొమలు ముడిపడెను, అధర మదర సాగెను. సార్వభౌముని కోపమున కంతము లేకపోయెను.

“[illegible]హా! కాలవైపరీత్యము! పిల్లికూన పులి [illegible]! [illegible]చాణక్య స్వర్గారోహణపు[illegible] మౌర్య [illegible]డవలయునా?” అని [illegible]కరివ[illegible] తీవ్రకోపకలుషిత[illegible]

చాణ:— [illegible] [illegible]యులను [illegible] [illegible]యును. మోసము వ[illegible] రాదు. విషమును విషముచేతనే హరింపవలయు[illegible] [illegible]పమును మోసముచేతనే జయింప వలయు. నా[illegible] [illegible] మెల్లెడలఁ గూడదు. ఇది నానీతి.

చం: [illegible] చేటుకాలమునఁ [illegible]జెట్టు కుక్కముట్టి పిందెలు [illegible] [illegible]ల ఆభైరవున కీ పెడబుద్ధి జనించెను. సర్వలోకపూజ్య యగు భారతావనిపైఁ గన్నువేయుట మంచికిఁ గాదు. మ్లేచ్ఛదండయాత్రను గర్ణాకర్ణిగా విని, భారతీయు లాబాలవృద్ధము, తదీయప్రాణహరణసంధాబంధురులై యున్నారు.

చాణ:—అవును. మానవహాని క్రౌర్యపాశి యుండదు గదా! అలకసుందరుం డీ దేశముపై దాడివెడలినప్పు డెంద ఱనాథ లైరి. ఎంద ఱ 'అన్నమో రామచంద్రా' యని యల్లాడిరి! ధనము పోయి కొందఱును, ధాన్యము పోయి కొందఱును, దారలఁ గోల్పోయి కొందఱును ఇట్లె యెంద ఱెందఱో కడలేని యిడుమలఁ గుడిచిరి. ఇంత యేల? అప్పుడు నారీమణులు మానమునకై ప్రాణము లుంకువ లిడిరి; గోగణంబు కఱుకుకత్తివ్రేటులకుఁ బలియొగ్గి నశించెను. నాఁడు భారతమాతకుఁ గలిగినసంతాపము నేఁడును దీఱదు. దుశ్శాసనకంఠలుంఠనంబున ద్రౌపదీశోకభారము వదలె, యవనభటకంఠలుంఠనంబునఁ గాక భారతదేవి శోకము చల్లారదు. మాతృశోకము దీర్చి కీర్తిపడయు భాగ్యము గల్గుఁగాక!

చంద్ర:—ఆచార్యా! దురాశ యెంతటికైనను జాలును. అది న్యాయాన్యాయములు గణింపదు. దురాశాపిశాచగ్రస్తుఁడు దేశద్రోహి యగుట యాశ్చర్యమా?

చాణ:— మానవుల గుణావగుణములు పురాకృతపుణ్యపాపానుగుణములు. పురాకృతము దాటరాదు. అంతయును గాలచోదితము. ధనమువలన మదము జనించును; మదము దుర్గుణములకు మూలము. దుర్గుణబంధితులు విపత్సాగరమునఁ బడక మానరు. సద్వంశోత్పన్నులమని గర్వపడు మానవులకుఁగూడ న్యాయమార్గమునఁ బొమ్మని యెన్నిమార్లు జెప్పినను తెలివి రాదు.

# రెండవ ప్రకరణము

చంద్ర:—మాతృద్రోహి భైరవనాయకుఁ డిట్టివాఁడు. పరస్పరాసూయ వలన జనించిన, భారతావనీశుల వైషమ్యము నూఁతగొని అలకసుందరుఁడు మున్నీ దేశమునఁ గాలూనఁ గారణ మయ్యెను. మాతృదేశపరాజయపరాభవము సైరింపలేక, విమోచనప్రతిజ్ఞాదక్షుఁడై మగఁటిమి నెఱపి, పురుషోత్తముఁ డయ్యలకసుందరుని రణాంగణమున డీకొని పరాజితు నొనర్చి, కీర్తికాంతాపాణిగ్రహణ మొనర్చి మమ్ముఁబోంట్ల యభినతు లందెను.

చాణ:—అవును. వీరవరేణ్యులు సర్వత్రసంపూజ్యులు. లోకోత్తరచారిత్రుల యశశ్శరీరములకు మరణము గలుగదు. అట్టి సుపుత్త్రరత్నములు నేఁడు నుండఁగా మాతృభూమి కేమి కొదువ?

చంద్ర:— ఆచార్యోత్తమా! మీ యాశీర్వచన మమోఘము. గురువరేణ్యుల తపఃప్రభావమే మాకుఁ బెట్టని రక్ష; మాతృదేశమునకుఁ గట్టనికోట. నిగ్రహానుగ్రహదక్షు లగు మీ యట్టి సుపుత్త్రరత్నములఁ గన్నతల్లి కేమిలో టుండును?

చాణ:—దైవ మిందులకుఁ దోడ్పడుఁగాక! సరియే గ్రీకులదండయాత్రలకుఁ గల నిజ మగు కారణమును దెలిసి కొంటివా?

చంద్ర:—గ్రీకుల పాంచాలరాజ్యమును మన మాక్రమించుకొంటిమి. అదియే మొదటికారణము. రెండవది విజిగీష. హైందవులు పాంచాలమున నిలిపిన దమపతాక

మును దించి గ్రీకులు విధించు కష్టములఁ జెల్లించి, యవన పాదాక్రాంతు లగుట యొండె, యుద్ధము సలుపుట యొండె గాని వేఱుమార్గము లేదఁట!

చాణ:—ఇందుల కిటు సూర్యుఁ డటుఁ బొడువవలయును. నక్కకు నాక మబ్బిననాఁడు, యవనులకు నార్యావర్తము వశ మగును. ఇది మ్లేచ్ఛులకు క్షేమంకరము కానేరదు — కాదు. దారిఁబోవుమృత్యువు నింటి కాహ్వానించు గ్రీకులకుఁ మంచికాలమా? స్వయంకృతాపరాధ ఫలము తప్పదు. వృషలా! సర్వజ్ఞుఁ డగు రాక్షసుఁడు, బాబిలాను నగరమున నల్లకల్లోలములఁ గావించుచున్నాఁడు. అచటి పరిస్థితులన్నియును, మన కనుకూలముగ నతని లేఖలు తెలుపుచున్నవి. నీ విచట జాగరూకుఁడవై యుండుము. చందనదాసు మాతృపాదపంకేరుహములఁ దన పంచప్రాణప్రసూనములతోఁ బూజింప నిశ్చయించి గూఢవేషధారియై యున్నాఁడు. భారతకుమారవీరులకుఁ గల రాజభక్తియు మాతృభక్తియుఁ దులఁదూఁగెడు. భారతీయుల కిది పరీక్షాసమయము. కష్టసమయములఁ గాని మానవుని గుణావగుణములు తేటపడవు. భారత జయాపజయము లిప్పుడు నీయందున్నవి.

చంద్ర:—మహాశయా! మాతృదేశాభ్యుదయార్థమై నాజీవముల గడ్డిపరకలుగా గణింతును. మాతృభక్తులకును, రాజానువర్తులకును దైవము తోడగుఁగాక!

చాణ:—చంద్రగుప్తా! రాజులు చారచక్షువులు. నిపుణులగు గూఢచారులను దేశమంతట నతినైపుణ్యముగా నింపి, యెప్పటి సమాచారముల నప్పుడే యెఱుంగుచుండ వలయును. సర్వప్రయత్నములయం దప్రమత్తుఁడ వై యుండుము. మాయట్టి యతుల తపోనియమాదులు, భారతదేశాధీశ్వరుండ వగు నీభుజబలముపై నాధారపడి యుండుటచే, సార్వభౌమున కిట్టి నీతిని గఱపుట మాకు విధియై యున్నది.

'గురుశేఖరా! నా కింక సెలవు. మీ సంరక్షణార్థము కొంతబలగము నంప నాజ్ఞయే?' యని చంద్రగుప్తుఁడు లేచెను.

చాణక్యుఁ డందులకు మందహాస మొనరించుచు "వత్సా! చాణక్యరుధిర మంత రుచ్యమేని గ్రీకులఁ జవిఁగొన నిమ్ము! 'కత్తి వ్రేటుకన్న కలముపోటు మిన్న' యను సామెత లోకమునకు నిదర్శన మగుఁగాక!" యని యనెను.

చంద్రగుప్తచక్రవర్తికిఁ జాణక్యాచార్యునెడ భక్తి మెండు. చాణక్యుఁ డాతనియెడఁ గడుంగడు ప్రియుఁడై వర్తించుచుండును. గురుశిష్యభావము వారియందు పెనఁగొని యుండును. దానంజేసి చంద్రగుప్తుఁడు పలుమాఱు గురు సందర్శనార్థియై యాశ్రమమున కరుదెంచువాఁడు.

# మూఁడవ ప్రకరణము

## కాలమహిమ

కాలమాహాత్మ్యము దురవగాహము. దాని వర్ణింప నలువయుఁ జాలఁడు. కాలము భగవత్స్వరూపం బని యోగులు వచింతురు. అది అనాది; అనంతము. ప్రపంచ వర్తనమున కెల్లఁ గాల మాధారభూత మై యున్నది. కాల మహారథము అసంఖ్యాకము లగు తనకర్మచక్రముల నాధార మున నిరంతరము విరామములేక చరించుచుండు నని కవి చంద్రులు వర్ణించుచుందురు. కాలగతి నడ్డగించు శక్తి యొండు గలుగదు. ఊహాతీతవేగగామి యగు నమ్మహారథము క్రింద, నెందఱో దురదృష్టవంతులు పడి నలుగుచుందురు. దాని రాపిడి కోర్వఁజాలక ఎందఱో పరితపించుచుందురు. ఎందఱో దాని జూచుట కైన వెఱచుచుందురు. కాని యదృష్టవంతు లద్దానినే యూఁతగాఁ గొని నడుచుచుందురు. ఎందఱో దాని నధిరోహించి సంతుష్టాంతరంగు లగుచుందురు. ఏవేళ కేది రావలయునో, అది వచ్చియే తీరును. అంతయును బురాకృత ఫలము. దాని ననుభవించియే తీరవలయును. సన్న్యాసి సార్వభౌముఁ డగును. సార్వభౌముఁడు సన్న్యాసి యగును. కలిమిలేములు కావడికుండలు.

నిర్వక్రతేజోదుర్నిరీక్ష్యుఁ డయ్యుఁ బ్రభాకరుఁ డనతి క్రమణీయ మగు కాలమునకుఁ జిక్కి యస్తంగమితతేజోవం తుఁడై యపరాంబుధియందుఁ గ్రుంకెను. వైరిరాజపరా

జయానందంబున యామినీభామిని వికీర్ణతమఃకచభారగ రోదసీకుహరరంగంబున నాట్యము సల్పుచుండెను. తన్నాట్య ప్రేక్షకులో యనఁ దారకలు వినువీథిఁ గిక్కిరిసియుండెను.

ఆ సమయమున శ్రీకృష్ణమందిరము మహా వైభవముగా నలంకరింపఁబడి యుండెను.

హిమవత్ప్రాంతాధికారి యగు మలయకేతుమహారాజు కొండొకనాఁడు మృగయావినోదమునఁ దవిలి, వితస్తానదీకూలస్థగహనాంతరంబుల సంచరించుచుండ, నాతని కొకగుట్టపై తాండవకృష్ణవిగ్రహ మొకటి దొరకెను. ఆ రాజశేఖరుం డది తన పూర్వజన్మపుణ్యాతిరేకముగా భావించి, యా లోకాధినాథున కచ్చోటనే యొకమందిరమును నిర్మించి, నిత్యనైవేద్యాదులు జరిపించుచుండెను.

ఆ దినము కృష్ణాష్టమి. భూభారహరణార్థము వైకుంఠవాసుఁడు భువిపై నవతరించిన పుణ్యదివసము. అప్పటి యట్టహాసము నంతయుఁ జూడ, నేదియో యుత్సవము జరుగఁబోవునటు లుండెను. దేవాలయము నాల్గు ప్రక్కల ప్రహరీగోడలపైఁ గల ప్రమిదలయందు దీపములు వెలుఁగుచుండెను. ఆ దీపము లనిలవశంబునఁ జపలచిత్తముల఼ఁ దోపించుచుండెను. గర్భగృహమున శ్రీకృష్ణవిగ్రహము వెలుఁగొందుచుండెను. ఆ దేవదేవుఁడు, ఆ దివ్య చారిత్రుఁడు మణిమయ కిరీటాలంకృతోత్తమాంగుఁడు నై చూపఱకనులకు మిఱుమిట్లు గొలుపుచు

నిర్వ్యాజభక్తి నుద్దీపించుచు, భక్తమనోరథసఫలతకై యీనాఁ డచట సాక్షాత్కరించి యుండెను.

యతాయాతజనసందోహమువలన నచట సందడి మిక్కుటముగా నుండెను. "గోపాలకృష్ణా! గోవర్ధనోద్ధారకా! గోవిందా! గో—విందా" యని భక్తులెల్లరు మెట్టుమెట్టునకు భగవన్నామకీర్తన మొనరించుచుఁ గొండ నెక్కుచుండిరి. తంబుఱలను మ్రోయించుచుఁ గొందఱును, మృదంగముల వాయించుచు మఱికొందఱును, తాళముల వైచుచు వేఱొకకొందఱును భజన సల్పుచుండిరి. జాగంటలఁ గొట్టుచు, నెమిలిపింఛములతో వచ్చుపోవువారి తలల నిమురుచు ధర్మము నపేక్షించు దాసరులు లెక్కకు మిక్కిలిగా నుండిరి. మూఁగ, గ్రుడ్డి, కుంటి మొదలగు వికలాంగకులు మార్గమున కిరువైపుల బారులుతీరి యాచించుచుండిరి. భక్తశిఖామణుల భగవన్నామకీర్తన ధ్వనులు, భజనపరుల వివిధవాద్యనాదములు, భిక్షుకుల ప్రార్థనవచోవినదములు తుములమై యా మందిరప్రాంగణ మెల్ల మాఱుమ్రోయుచుండెను. ధ్వని ప్రతిధ్వనులు మేళవించి యేకమై దూరశ్రవణమునకుఁ బ్రణవోచ్చస్వరముగా వినిపించుచుండెను.

ఇంతలో "జయ మహారాజాధిరాజ! జయ మలయకేతు మహారాజ!" యను జయజయధ్వానములు మిన్నుముట్టెను. హిమవత్పర్వతాధీశుఁడు మలయకేతువు శ్రీకృష్ణసందర్శనార్థియై దేవాలయమున కరుదెంచెను. ప్రభుసమాగమమునఁ బ్రజామహోత్సాహము వెల్లివిరిసెను.

అర్చకులు పూజావిధానమున కుపక్రమించిరి. మంగళ వాద్యములు భూభోంతరాళముల బ్రిద్దలుచేయసాగెను. 'భుంభుంభు' మ్మను శంఖారావమును, గణగణ మను ఘంటా వినాదమును జెవులు గిడ్డపడఁ జేయుచుండెను. అర్చకులు శ్రీకృష్ణుని కెదుట బారులు దీరి, యుదాత్తానుదాత్తస్వరితాది స్వరయుక్తముగ మంత్రము లుచ్చరించుచుండిరి. పుష్పాదిక సమస్తార్చనలు ముగిసెను. కర్పూరనీరాజన మిచ్చిరి.

మహారాజు నిటలంబునఁ గరపుటంబులు జోడించి "హే దీనబంధో! దయానిధే! ఆపద్బాంధవా! అనాథ రక్షకా! అఖిలాండకోటి బ్రహ్మాండనాయకా!" యని పెక్కురీతుల తదేకచిత్తమున దేవకీసుతుని నుతించుచుండెను. భగవద్దర్శనోత్సుకు లగుభక్తులు గర్భగృహములోనికిఁ దోసికొని వచ్చుచుండిరి. పూజకులు తమతమ కార్యముల నుండిరి.

అంతలో 'శత్రువులు, శత్రువులు! కొట్టుఁడు, నఱకుఁడు, చంపుఁ' డను శబ్దము శ్రుతిగోచరం బయ్యెను. ఆ ధ్వనితోడ రాజన్యుని యర్ధనిమీలితనయనంబులు విచ్చఁబాఱెను ఎట్టయెదుట బాలకృష్ణమూర్తి లోకమోహనముగ నృత్యము సల్పుచుండెను. ఎక్కడివాద్యము లక్కడ స్తంభించెను. హాహాకారములును, వీరాలాపములును చెలరేగెను. ఖడ్గధారాసంఘట్టనసంజనితవిస్ఫులింగంబులు గురియసాగెను. క్షణములోపల నుదంతమంతయు తేనికి స్ఫురించెను. శత్రువుల ముట్టడి యని యతఁడు గ్రహించి, జాగుసేయరా దని నిశ్చయించి, తన్నుఁ గాచి, భక్తకోటిని

గాఢాతురుండై వజ్రసారమగు కృపాణమును ఒరనుండి దివిచి చేఁబూని వైరుల నెదుర్కొనెను.

ఇప్పు డా రంగ మొక నూతనరూపమును దాల్చినది. నిముసములో శాంతినికేతనము బీభత్సాలయముగా మాఱిపోయినది. మూర్తిఁగొనిన రుద్రదేవతలో యన నొప్పు విపక్షులఘాతకకు నోడి, సాత్త్వికులగు భక్తులు జీవితాశం జేసి కాందిశీకులైరి. మలయకేతువు రోషభీషణాకారుండై శత్రువులపైఁ బడి తన యస్త్రవిద్యానైపుణ్యమును బ్రకటించుచుండెను. పగతుఱశిరములు తెగి మింటి కెగయుచుండెను. కళేబరములు తమంతట తాము పొరలి ద్వారబహిర్గత మగుచుండెను. ఆలయమెల్ల రుధిరమయ మయ్యెను. తఱుగుకొలది పగతుఱు పైపయిఁబడి యా వీరవరేణ్యుని నెదుర్కొనసాగిరి. ఖడ్గసంఘటనధ్వనులు మెండగుకొలఁది విరోధిశిరోధులు తటతట పడసాగెను. పోరు భయంకరమై యుండెను. మలయకేతువు తనహృదయమును దైన్యదేవత కప్పగింపక, యాఁకలిగొన్న కొదమసింగంబు హరిణశాబకంబులఁబోలె శత్రుసైనికులఁ జంచి చెండాడుచుండెను. 'విపది ధైర్య' మన వినమా! పౌరుషవంతుల కది పెట్టని భూషణముకదా!

ఆ వీరశిఖామణి నిలువెల్ల క్షతమయ మయ్యెను. ఆతఁడు పూచిన మోదుగవలె నుండెను. ఆతని భుజాబలము క్రమక్రమముగఁ దఱుగుచున్నదని వానికత్తి వ్రేటులే తెలుపుచుండెను.

కాని, యీ ఘోరనాటకమంతయు నా జగన్నాటక సూత్రధారి మిన్నక చూచుచుండెను. అహో! చిత్రము! ఆడించునది తాను; ఆడునది తన నాటకము; అవలోకించునది తాను; ఆనందించునది తనలోఁ దానే. అతని యానందతాండవమేగదా మాయ! భక్తులను క్లేశపరంపరల భగవంతుఁడు పరీక్షించుచుండును. నెగ్గినవారు శాశ్వతిక సుఖభోగులు. అన్యులకు సంసృతిపరిభ్రమణము తప్పదు. శివుని యాజ్ఞలేక చీమయైనఁ గదలువదు. మానాథుమాట లేక మశకమైనఁ గుట్టదు. కాని, బిడ్డల నేడ్పించనిదే ముద్దువత్తురా? సానఁబట్టనిదే మాణిక్యము వన్నె కెక్కునా?

ఎంతసేపు పోరుచున్నను, మలయకేతువునకు సాయమరుదెంచువారు లేరైరి. నాఁడతఁడు భగవద్దర్శనార్థమై సాత్త్వికవేషమున నొంటిగా దైవసదనమున కరుదెంచెను. తా నొకటి తలంచ, దైవము వేఱొకటి తలంచుటయ్యెను. ఆతని భుజాబలమే యాతనికిఁ దోడుకావలసివచ్చెను. ఒంటరిగాఁ బెద్దయుంగాలము పోరిపోరి యా శూరశిఖామణి యలసిపోయెను. కరమునుండి కరవాలము క్రిందఁబడెను. అయ్యో! అస్త్రవిద్యానిపుణుఁడు, సద్భక్తశిఖామణి యతఁడు సొమ్మసిలెను. ఆతని యవయవముల పటిమ సడలెను. ఆతఁడు నేలరాలి కనుమూసెను.

శత్రువుల సంతసమునకు మేరలేకపోయెను. ఎదిరిదళనాయకుం డంత మునుపడ వచ్చి 'ఈతని కెట్టి యాపదను గావింపకుఁ' డని కట్టడఁ గావించెను. రక్తప్లావితశరీరుం డగు

మలయకేతువు కడుహీనస్వరమున 'నాప్రాణముల నిచటనే తీయుఁ' డని రోష ముట్టిపడునటు లనెను.

"జీవములతోఁ గొని రమ్మని మాప్రభుని యానతి" యని యాతనికి మిగుల నాదరముతో నుత్తరమిచ్చెను.

"ఇట్టి యాడుదానిపని జేసిన వీ—మీ—ప్రభు—వె—వెవఁడు రా? ఆ—ఆ—ఆ—త—ని—" యింకను మలయకేతు వేమియో చెప్ప యత్నించెనుగాని, మాట వెలువడ దయ్యెను.

శత్రువు లాతని ప్రాణములతోడఁ దీసికొని పోయిరి. కాలమహిమ! సింహకిశోరము చింపిరివలఁ జిక్కెను. మత్తమాతంగము నులిపెపుదారమునఁ గట్టుపడును. జగదేకవీరుఁడు అనదచేతఁ జిక్కును. కాల మనుల్లంఘ్యము. కాలవశముగాని ప్రాణి లేదు.

# నాలుగవ పరిచ్ఛేదము

## యమలోకము

మలయకేతుమహారాజు సుంత తెలివొందింది, విశాలము సాలంకృతము నగు నొక గుడారములో మృదుతల్పమునఁ బరుండియుండుటను గ్రహించెను. బాలభాస్కరుఁడు, తరుణాంశువుల నా డేరాయం దప్పుడే ప్రసరించుచుండెను.

నిన్నటి పోరాటమున నాతనికిఁ దగిలిన పెక్కు గాయములనుండి రుధిర మధికముగా స్రవించుటం జేసి మలయకేతువు కేవలము దుర్బలుఁడై, సొమ్మసిల్లియుండెను. ఆతని నెవరు సేదదేర్చి గాయము లుపచరించినది, యాతని కెఱుకలేదు. విస్మృతుఁ డగుటం జేసి, యుపచారకృతజ్ఞత నేనియు నతఁడు దెలుపలేకుండెను.

ఆతని నేత్రములు సారెసారెకు విచ్చుచు మూఁతలు పడుచుండెను. విశాలము నున్నతము నగు నా వీరవరేణ్యుని వక్షోభాగము దీర్ఘోచ్ఛ్వాస నిశ్శ్వాసములవలన, పోటుం బాటుం జెందు సాగరమును దోఁపించుచుండెను. ఆతని వదనమండలము వన్నెదఱిగి పసఁజెడియుండెను. మాటలాడుటకు శక్తి చాలదు. పొరలుటకుఁగూడ బలములేదు. ప్రాణము లెందో యున్నట్లు గాన్పించుచుండెను. ఆకస్మికముగాఁ గలిగిన కలవర మాతని బాయకుండెను. వికృతాకారము లాతని యెదుట క్షణక్షణము సాక్షాత్కరించుచు,

మాయమనుచు, భయ మెట్టిదో యెఱుఁగని వీరాధివీరుని సయితము భయగ్రస్తు నొనర్పసాగెను. కన్నుమూఁత పడుటయే తడవుగా నాతని ప్రమోల దీర్ఘదంష్ట్రులు, నీలదేహులు, వికృతాకారులు నగు పురుషు లిరువురు నిలిచి యాతనిపై నొకపాశమును విసరిరి. అది యాతని కంఠమును బిగించెను. బాధ దుర్భరముగా నుండెను.

కాలకింకరు లా జీవుని దమ యేలికకడకుఁ గొని పోయిరి. శమనుఁడు తన రూక్షవీక్షణములకు మలయ కేతువును గుఱిసేసెను. సమవర్తియెదుట నతఁడు వినమ్రుఁడై నిలిచియుండెను.

నీలనీరద సంకాశ మహోగ్ర విగ్రహుఁడును, రూక్షేక్షణ వర్తులాకారరక్త నేత్రుఁడును, దండాయుధ ప్రశస్త హస్తుఁడను నగు సూర్యతనయుఁడు కనత్కనకాసన మధ్యవర్తియై శ్వేతాతపత్రమునీడఁ గూర్చుండి, పాతకులఁ బెక్కుర విచారించుచుండెను. పాతకుల పాపములను చిత్రగుప్తుఁడు విశదీకరించుచుండ, వారికి యథార్హశిక్షలు విధింపఁబడుచుండెను. పర నారీ లుబ్ధుల నంధతామిస్రమునఁ ద్రోయుచుండిరి. పర ద్రవ్యాపహారకులు కాలాగ్ని సంతప్తంబులగు శూలంబులకు గురియగుచుండిరి. హింసాపరులు గాఢాంధకార బంధుర పాతాళ గృహ పతనులై వివిధ క్రూరజంతు వితానముచే హింసఁ బొందుచుండిరి. ఐశ్వర్యోద్ధతుఁడై తన తోడిదే లోకమనియుండు లోభి క్రిమిదష్టుఁడుగా నుండెను. కూటసాక్ష్యములను జెప్పు

వారలను శతయోజనోన్నత శైల శిఖరమునుండి తల క్రిందుగఁ ద్రోయుచుండిరి. పాతకుల హాహాకారముల యందును, వేఁడికోలుల యందును శోకము రూపుఁ దాల్చి యుండెను. కాని నిరంకుశులగు కాలకింకరులు కరుణాదక్షితమ సిద్ధ్యుక్త ధర్మమును నెఱవేర్చుచుండిరి.

పరేతనాయకుఁడు తనప్రక్క నుండు చిత్రగుప్తు నుద్దేశించి "ఈతని యుదంత మెట్టి" దని మలయకేతువుఁ గూర్చి యడిగెను. చిత్రగుప్తుఁడు మలయకేతువు జీవిత చారిత్ర గ్రంథము విచ్చి చూచి "అవధారు రాజేంద్రా! 'రాజ్యాంతే నరకం ధ్రువ' మ్మను నార్యవాక్య మీతని యెడ నన్వయింపదు. ఈతఁడు కడు పుణ్యాత్ముఁడు. సంతత దాతృచక్రవర్తి. నిరంతర నీరజాక్షుపాదరాజీవ ధ్యానాసక్త చిత్తుఁడు. సదాచార సంపన్నుఁడు. కాని యప్రమత్తతచే నొనరించిన పాపలేశముచే నీతనికీ నరకవిలోకన పాప మొదవి నది. అది యటుండ నిండు. ఇతనికి నాయుష్కాల మింకను బరిసమాప్తము కాలేదు'' అని వచించెను.

పరంతపుఁడు పటపట పండ్లుగీటుచు కింకరుల నుద్దేశించి 'మందమతులారా! ఈ పుణ్యపురుషు నేలఁ గొని వచ్చితిరి? కన్నులు కానరాలేదా? పొగరు తల కెక్కినదా?' యని గద్దించెను. పరేతనాయకుని కోపానలము తమ్ము దహించునేమో యను తహతహచే, వారు గడగడ వణఁకుచు 'మహాప్రభూ! దాసులము; మన్నింప నగు ఇఁక జాగరూకలమై వర్తింతుము.

ఇదియే ప్రథమదోషము; కాన "క్షంతవ్యము" అని మొఱలిడి యాతని పాదముల వ్రాలి చెంపలు వైచుకొనిరి.

యముఁడు:— కూౌమ దేవతలారా! ఎన్నిసారు లని మిమ్ము సైరించుట. జీవికి మారుజీవిని దీసికొనివచ్చుట మీకు నాటగానున్నదిగదా! మీ యవివేకము జీవుని కెంతటి బాములు దెచ్చుచున్నదో గంటిరా? వాని పరిజనము రోదనము మీ చెవి సోఁకదా? వాని బంధువుల దుఃఖారావములు మీరు వినరా? నిరపరాధులకు నిట్టి సంకటములు నిష్కారణముగాఁ దెచ్చు మి మ్మే మనవలయు?

చిత్రి:—మహారాజా! పశ్చాత్తాపమునఁ బాపములు క్షయించును. ఈ నేరము ప్రమాదజనితమేగాని మనఃపూర్వకము గాదు. గాన క్షంతవ్యులు.

యముఁడు:—(మలయకేతువుతో) రాజన్యచూడామణీ! నా యీతప్పిదమును మఱవుము. పుణ్యవంతులు సర్వత్ర పూజ్యులు. జగన్నాథుఁడుసయితము వారిఁ గొల్చునన, తదీయభృత్యుని నాసంగతిఁ జెప్పవలయునా? మందభాగ్యుల ప్రమాదములు మహాత్ములఁగూడఁ జెనకుచుండును. ఇది సైరింపక తీరదు. సైరణయేకదా మహాత్మపదవికి మానవునకుఁ బ్రథమ సోపానము. మధుసూదనాశ్రయుల జోలికిఁ జనరాదని సాకట్టడి. అట్లుండియు వీరు ప్రమాదపడిరి.

ప్రేతనాథుని వినయసంపత్తికి మలయకేతువు సంతసించి, యాతనిగూర్చి కర్మప్రపంచమునఁ బరిభ్రమించు

ప్రజలాడు క్రూరవాక్యములు కేవలపరిమాదజనితములుగాఁ దలంచి సూర్యనందునుని గాంచి "దేవోత్తమా! భృత్యాను భృత్యుని న న్నింత పెద్దసేయ నేల? 'పరిమాదో మహాతా మపి' యన వినమా? పరితిరూపు లుండుట సహజము. అందుచే విూ భటులు పొరబడిరి. వారు పశ్చాత్తాప పరిష్కృత దోషు లైరి" అనెను. పరంతపుఁడు దూత లతో "ఓరీ! ఈ మహాపురుషుని కరుణాతిరేకము నేఁడు విూ ప్రాణములు గాచెను. ఈయనను యథాస్థానమునఁ జేర్చి రం" డనియెను. దూత లాతని దోడ్కొని వచ్చి పాన్పుపైఁ బరుండఁబెట్టి పోయిరి.

కొండొకసేపటికి మలయకేతువు ప్రజ్ఞవడసి కన్నులు దెఱచి చూచెను. యమలోకము కానరాదు. నరకము లేదు. దండధరుని దండ లేఁడు. చిత్రగుప్తుఁ డగపడ లేదు. కాలకింకరులు గాన్పింపరు. పాతకుల దీనాలాప ములు, దుఃఖారావములు వినఁబడవు. అంతయు నిశ్శ బ్దమై యుండెను. కాని, యతనికిఁ బూర్వదృష్టవిషయ స్ఫురణముమాత్రము తొలఁగకుండెను. అతనికిఁ దనూ కంప మొదవెను. ఆతం డదియు నిజమనో భ్రాంతిగాఁ దలంచెను. స్వప్న మని భావించెను. ఇంతలో నాతని కీ క్రింది సంభాషణము శ్రుతిగోచరం బయ్యెను.

"ఎవ రచట? పోఁగూడదు."

"ఎవరో గాదు. పోయిన నేమి?"

"పోఁగూడదు. నిలు నిలు. కాలు కదల్పకుము. రాజాజ్ఞఁబడయక యీపైదిలతో మాటాడరాదు."

"నీ పుణ్యము! అడ్డగింపకుము. అత్యావసరము!"

"పుణ్యము లేదు, పాపము లేదు. రాజాజ్ఞ నిరంకుశము. అతిక్రమింపఁ వలఁపకు. కొఱవితోఁ దలఁ గోకికొనుట గలదా."

"క్షణములోఁ దిరిగి వచ్చెద. ఈ పుణ్యము గట్టికో."

"ఎక్కువమాటలు వలదు. తేనియానతి లేనిది పోనిచ్చుటకు వలనులేదు."

"భ్రాంతా! రాజాజ్ఞఁ బడయక యింతదూరము వచ్చితి ననుకొంటివా?"

"అమ్మా! క్షమింపుము. సేవాధర్మ మొంటెఱుఁగదు. సేవకులకు స్వాతంత్ర్యము లేదు. క్షమింపుము."

మలయకేతువు మహాతురముతో నాద్వారమువైపుఁ జూడ్కి సారించెను. అతనికడ కరుదెంచున దెవరు? వనితామణి యొకర్తుక తన కభిముఖముగా వచ్చుచున్నటు లాతనికిఁ గన్పట్టెను. ఆమెరూపము త్రిలోకకమనీయము. వికచారవిందమును జంచరీకములువోలె, ముంగురు లామె వదనమండలమునఁ గ్రమ్ముకొని సహజసౌందర్యమునకు మెఱుఁగిడున ట్లుండెను. తిలపుష్పంబును గేలిసేయు నాసిక, దాడిమీబీజముల సొంపు మెచ్చని రదనములు, చేరలఁ

గొలుసఁదగి పీచులతో వియ్యమందుచున్న కందోయిసౌరు-కలిమిలేములఁ దలపించు గాను—అన్నియు నా సుదతీమణికిఁ బెట్టని తొడవులై యుండెను.

ఆ మదిరాక్షి తిన్నగ నరుదెంచి, రాజేంద్రుని పాదములకడ నిల్చెను. అతఁడు తన చూపునే నమ్మఁజాలకుండెను. అది స్వప్నవిశేషమో లేక మతిచాంచల్యమో యని భావించెను. అతఁడు హీనస్వరమున "మృత్యుదేవతవా?" యని యామె నడిగెను.

ఆ నారీతిలకము వ్యసననిరుద్ధకంఠయై "వీరవరేణ్యా! ఏమొగముతో మృత్యుదేవత నీయెదుటికి రాఁగలదు" అనెను.

మలయ:—ఎవరవు నీవు? ఏల వచ్చితివి?

యువతి:—రాజచంద్రా! సజ్జనుల కిట్టి యాపదలు గలుగ, ఏప్రాణి యోర్చియుండఁగలదు?

మలయకేతువు కన్నులనుండి బాష్పకణములు రెండు రాలెను. అతనికి మిక్కుటమగు నానందము కలిగెను. ఆ సుదతీమణి మాటలాతనివీనుల సుధఁ జిలికినట్లుండెను. యువతియు బాష్పముల నించుచుండెను. మలయకేతువు మాటలాడ నుంకించెనుగాని మాట వెడలలేదు. అతని కన్నులు సుడి వడుచుండెను. సన్నచేసి యాతఁడు దాహము గోరెను. అతని సంజ్ఞ గ్రహించి, యా మహిళామణి నీరుదెచ్చి యిచ్చెను. అంత నతఁడు సుంత తెప్పిరిల్లెను. అతని స్వరము కొంత స్పష్టమయ్యెను.

మలయ:—మానిని! నే నిపు డెచట నున్నాఁడ?

యువతి:—ఎక్కడనని యడుగనేల? భీకరపంచాస్యము భయంకరకిరాతునివలయందుఁ దగుల్కొని యున్నది.

మలయ:—బంధితుండ ననుసంగతి తెలియును. నన్ను పట్టిన దెవరు?

యువతి:—గ్రీకుచక్రవర్తి యగు శెల్యూకేశ్వరునకు కైరాతనాయకుఁ డగు భైరవపోత్సాహితుఁడై నిన్నుఁ బట్టి తెచ్చెను. ద్రోహము తగదని భైరవున కెంతయుఁ జెప్పితిని. కాని, చవుట విత్తనములు చల్లినట్టు లయ్యెను.

మలయ:—ఇది భైరవుని శిబిరమా?

యువతి:—కాదు. గ్రీకు శిబిరము. శెల్యూకేశ్వరుని శిబిర మియ్యెడనే కలదు.

మలయ:—భైరవుఁడుకూడ నిచట నున్నాఁడా?

యువతి:—ప్రస్తుత మున్నాఁడు. వాని వనభూముల నుండి యతఁడు వచ్చుచుఁ బోవు చుండును. వాఁడు యవనేశ్వరునకుఁ గుడిభుజమై యున్నాఁడు.

మలయ:—కోమలాంగిని; సాధుచరితవు నీ విట్టికూళల మధ్య నుండుట యేల?

యువతి:—ఆశీవిషంబుల ఫణంబుల ననర్ఘరత్నంబు లుండునుగదా! స్థానమాత్రమున రత్నమూల్యము దఱుగునా? అది అటుండనిండు. స్వాతంత్ర్యము గాంక్షించుచు రేవి యుపాయము విన్నఁడు. గ్రీకులు సమరసన్నద్ధులు. వారి కిప్పట్టునఁ

జేయుటచే నొసంగిన మీకు దాస్యవిమోచనమగును. భూలోక సుత్రామత్వముగూడ లభించును. ఇది మీకు సమ్మతమా?

మలయ:—(సరోషముగా) ఈ యుపదేశము మోచి కొని వచ్చితివా?

యువతి:—ఆర్యా! దూర మాలోచింపుఁడు. సిద్ధాన్నమును ద్రోయకుఁడు. ఎంత కాలమని కారాగారమును వరించియుందురు?

మలయ:—తరుణీ! పెక్కుమాట లేల? మానవంతుఁ డొక్కసారి మరణమునొందును. మానహీనుఁడన్ననో సారెసారెకుఁ జచ్చుచుండును. రాజద్రోహులకు, మాతృద్రోహులకు, దేశద్రోహులకుఁ బాతకావధి గలుగదు. వారిశిక్ష దురంతము, దురవగాహము.

యువతి:—దేశభక్తాగ్రేసరా! సత్పురుషశిఖామణీ! నీ స్వామిభక్తి యనుపమానము. నీ మాతృభక్తి నిష్కళంకము. నీ దేశభక్తి నిర్వ్యాజము. సర్వేశ్వరుఁడు నిన్ను సంరక్షించును గాక! గ్రీకు సర్వసేనానియగు పాత్రకులుఁడు నియమింప, నిన్నుపచరింప వచ్చితిని. నిన్ను సేవించిధన్యనైతి.

మలయ:—బంధితుని నన్ను సజీవునిగా నతఁ డుంచు టేల? వాని యుద్దేశ్య మెఱుంగుదువా?

యువతి:—ప్రాణమందలి తీపి నిన్ను ప్రేరేచి యత నికిఁ దోడ్పడఁజేయునని వాని యభిప్రాయము. భారత సామ్రాజ్యమునకు నీవు పెట్టనికోట యని వారెఱుంగుదురు. పురుషో

త్తమా! పోయి వచ్చెద. రాజవైద్యుఁడు రానున్నాఁడు. నేను గూడ ననుదినము మీపాదసేవకై వచ్చుచుండెద.

మలయ:—నవలామణీ! నీ పేరేవి?

యువతి:—ఈ నిర్భాగ్యురాలిపేరు తెలిపియు ఫలము లేదు. నా చరిత్రము కరుణారసంపుబుగ్గ. పోయివచ్చెద. సెలవిండు.

ఆ కమలాక్షి వెడలిపోయెను. మలయకేతు వా మహిళామణి యుపచారవిశేషముచేఁ గ్రమక్రమముగ నారోగ్యభాగ్యాభివృద్ధి నందుచుండెను. భగవానుఁడు సత్పురుషులకుఁ జేదోడువాఁదోడై యుండును. భక్తపరుల మనోరథము లీడేర్చుచుండును. "అట్టి సుశీలయు, సుందరాంగియు నగు తరుణీమణి యెవరో!" యని మలయకేతువు సంతతాలోచనాపరుఁడై యుండెను.

---

# అయిదవ ప్రకరణము

## పంజర బద్ధ కీరము

భారత రాజ్యేందిరను గబళింపఁ జతురంగ బల సమేతుఁడై గ్రీకురాజ్యధురంధరుం డగు శెల్యూకేశ్వరచక్రవర్తి వితస్తానది కావలి కూలమున విడిసెను. మగధసేనాని యగు భాసురాయణుఁడు వాని నిరోధింప నివలిగట్టున ససైన్యముగా వేఁచియుండెను. వితస్తానది గట్లొరసి ప్రవహించుటం జేసి దాఁటరాకుండెను. పరిసర గ్రామీణులు వలయు వస్తు ప్రచయము నిరువాగులవారికి ధారాళముగ జతపఱచుచుఁ గాల మొకరీతిఁ గడుపుచుండిరి.

గ్రీకుశిబిరము నట్టనడుమ గ్రీకుసార్వభౌముని గుడారము దాపిరి. దాని ముఖ భాగమున గ్రీకు పతాకము వెలయుచుండెను. డేరాలోపల నొకరత్నకంబళము పరువఁబడియుండెను. ఆ గుడారమునం దిప్పుడు శెల్యూకేశ్వరచక్రవర్తి మణిమయాసనము నధివసించియుండెను. అచ్చరలఁబోలు కన్యావతంసము లిరువు రాతనికి వింజామరులు విసరుచుండిరి. సైనికోద్యోగులు, సేవకులు యథార్హాసనములం దుపవిష్టులై యుండిరి. ఒకయెడ భైరవనాయకుఁడు కూర్చుండి యుండెను. ఆతని కట్టెదుట గ్రీకు సర్వసేనాని పాత్రిక్లుఁడు నిజవదనము గాంభీర్యభావాస్పదమై వెలయ నాసీనుండై యుండెను. శెల్యూకేశ్వరునకు దక్షిణపార్శ్వమున వానితనూజాత త్రిజగన్మోహిని నిలిచి యుండెను. భాద్రపదమునందలి నదివలె నా

తరుణీమణి సౌందర్యరాశి యుభయకూలముల నొరసి ప్రవహించుచుండెను. ఆమె శిరోజములు శిల్పములఁ జారుచుండెను. నవరత్నఖచిత మగు మకుట మామె ధరించియుండెను. ఆమె కటిప్రదేశమునఁ గరవాలము వ్రేలాడుచుండెను. అతి గంభీరములు, నత్యంత స్నిగ్ధతా ముగ్ధములు నగు నిజకటాక్ష వీక్షణముల నా వీరవనిత, సభాంతరాళమెల్లఁ బ్రసరింపఁ జేయుచుండెను. సభయంతయు నిశ్శబ్దమై యుండెను.

అప్పు డా విలాసవతి శెల్యూకేశ్వరునిదిక్కు మొగమై "జనకా! రాజద్రోహి యగు మలయకేతువును సభకుఁ దెప్పింప నేల? మఱల నాతనిమతము నెఱుఁగరాదా" యని కూర్చుండెను. శెల్యూకేశ్వరుఁడు పాత్రసులునితో "సేనాని! నీబోధ యాతనితల కెక్కినదా?" యని యడిగెను.

పాత్ర:-సార్వభౌమా! నాహితోపదేశ మాతనియెడ బధిరశంఖారావ మగుచున్నది. ఆ మూర్ఖుఁడు తాఁ బట్టిన కుందేటికి మూఁడేకాళ్ళనుచున్నాఁడు.

శెల్యూ:—అటులైన మే మాతని నిశ్చయాభిప్రాయమును ముఖాముఖిగ నెఱుంగ నగు. అతని నిటకుఁ దెప్పింపుము.

సేనాని యాజ్ఞాపించెను. భటులు మలయకేతువును సభకుఁ గొనివచ్చిరి. సాయుధులగు నిరువురు సైనికు లాతని కిరువంకల నిలిచియుండిరి. సామాన్యుఁడువోలె నా రాజన్యుఁడు శృంఖలానిబద్ధుఁడై యుండెను. ఔరా! మృగరాజు వేఁటకానియురులఁ దగుల్కొనెఁగదా!

అహహా! కాలమహిమ.

శెల్యూ:—ధారుణీశ్వరా ! ఒకమాట; స్వాతంత్ర్యేచ్ఛ కలదా ?

మలయ:—స్వాతంత్ర్యాభిలాష లేని ప్రాణియు నుండునా ?

శెల్యూ:—నీయీదుర్గతికిఁ గారణము తెలియునా?

మలయ:— (కోపముతో) తెలియును. అన్యాయ ప్రవర్తకులకుఁ గారణము వలదని తెలియును. దుర్మదాంధులకు న్యాయమునకు గడుదూర మని తెలియును. సాధు. హింసలే దుష్టుల క్రీడావినోదములు. సాధుజనార్తారావములే వారలకు పరమశ్రావ్యము లగు సంగీతరవములు.

శెల్యూ:—అన్యాయప్రవర్తకులా ? దుర్మదాంధులా ? ఎవరు వారు ?

మలయ:—ఎవరో కాదు. ఏమరించి వీరాధివీరుని జెఱఁగొన్న ముచ్చులు, వంచకశిఖామణులు; నీచలాభపరాయణులు గాక, యన్యాయప్రవర్తకులు దుర్మదాంధు లన్యులగుదురా ? ధీరుఁడేని ఖడ్గాఖడ్గి, బాహాబాహిఁ బోరవలయు. నిదురించుసింహమును జిట్టెలుక దాఁటదా? వెనుదట్టి సింహమును లేపితిరి. అది మిన్నకుండునా ?

శెల్యూ:— ఓయీ ! చాలు, నీవాచాలత. నీస్థితిగతు లెఱిఁగి మాటలాడుము!

మలయ:—అంతయు నెఱుంగుదు. మాయలమారులమధ్య—రాజ్యమదాంధునియెదుట—పిఱికిపందముంగల—నున్నాఁడను. కాని గ్రామసింహము వనకేసరి యగునా ?

శైల్యూ:—హాహాహా! ఇంతిమిరాటే సాగను. పేలితి వేని నీ నాలుక ప్రేలును. మూర్ఖా! నావచించు మంచి నీకుఁ జెడుగా తోఁచెనా?

మలయ:—స్వపరబలంబుల నించుకయైన గమనింపక, అసహాయశూరులును, అనక్రమవిక్రములు నగు భారతవీరరత్నములపైఁ బడనెంచు నీవా మూర్ఖుఁడవు? నేనా? 'ప్రాణము ప్రాణ'మని పడి తల్లడిల్లునది మీరు కాని, భారతీయులు గారు. అధికారమదాంధతను నీమాట సాగు ననుకొంటివా?

మెగాస్తనీసు:—మలయకేతుమహారాజా! పెక్కుఁ గోరను. ఈ సమరమున మాకుఁ దోడ్పడ మాటనిమ్ము. ఈ యుంకువకు గ్రీకురాజచంద్రుడు నీయెడఁ బ్రసన్నుఁడగును. నీబంధములు సడలును. అంతియగాదు. విజయానంతరము మాప్రతినిధివై హైందవరాజ్యరము నేలఁగలవు. రోగికిఁ బథ్యముపోలె, మాయీయుపదేశము మీకిపుడు వెగటు గావచ్చు. అయినను, కాలక్రమమున నదియే మీకు మిక్కిలి యుపకరించును. రాజభిషగ్వరుఁడు బంధనపథ్యము నిడెనని బ్రుంగకుము. కార్యాకార్యములు పరిణామవిశదములు. నీయెడ మాకు దురుద్దేశము లేదు. చతుస్సాగరమేఖలావలయిత రాజ్యలక్ష్మి తనకై తాను వరింపనుండ, నిరాకరించు వెఱ్ఱియుఁ గలఁడా? రానున్నసిరికి మోకాలొడ్డనగునా? సార్వభౌముఁ దర్శింప బేదమోముఁజూప నీ యట్టి మహానీయునకుఁ దగవా?

మలయ:—అవును. గ్రీకు చక్రవర్తి యంతటివాఁడే. ‘దేహి’ యన, ‘నాస్తి’ యనుట నిజముగ న్యాయముగాదు. కాని, నీవప్రసన్నను భారత జనయిత్రిని మీదాసురాలి నొనర్చి, తదీయపుత్త్రపుంగవుల, దుస్తర విషాదసముద్రమునఁ ద్రోయు మనెదవా? పరమశుంఠ యగు మీ సార్వభౌమునకు రాజ్యతంత్రకుశలుఁడ వగు నీకును సరిపోయినది.

శైల్యు:—నీచుఁడా! దుర్మార్గుఁడా! ఈ శ్రీరంగ నీతులుఁ గట్టిపెట్టవేని, నీకుఁ దగినటుల బుద్ధిఁ జెప్పెదము.

మలయ:—ఓయీ! ఈబెదరింపు లటుఁ గట్టిపెట్టుము. ఈ ప్రపంచము మిథ్య. ఐశ్వర్య మశాశ్వతము. ప్రాణులు బుద్బుదప్రాయులు. ఇట్టి నశ్వరవిషయముల నమ్మి చెడు మార్గముఁద్రొక్కి మహాపాపకూపమునఁ బడు మందువా? ఏఁడి! మీ ఆలీసాందరుండేడి? మీ దరయసుఁ డెక్కడ? వారివైభవ మెందుఁ బోయెను? పుణ్యపాపములు దక్క వా రేమి మూటఁగట్టుకొనిపోయిరి.

శైల్యు:—ఓరీ మూఢుఁడా! మా మాట నాదరించు వఱకు నీకు ముక్తి లేదు. గ్రహించితివా? ఈ మొఱకుపట్టు వదలవేని, నీ యుత్తమాంగము గ్రీకు రాజ్యలక్ష్మికిఁ గాన్క యగును. ఇదియే మాయాజ్ఞ.

మలయకేతువు రోషవివశుఁడై రోజసాగెను. కరవాలమువంక వాని కనుసాగును. కాని, సంకెలలు గయిఁ గాళ్ళఁ గదలనీయవు. ఏమి చేయఁగలఁడు? “ఓయీ! శరీర మనిత్యము. దానిని మాత్రము నీయిచ్చవచ్చినట్లు చేయఁ

గలవు. నిత్యముగ నామాత్మనుమాత్రము జెనకఁజాలవు. నీ నిగ్రహానుగ్రహములు రెండు నాకు సమము. నీభోగభాగ్యములు నన్ను భ్రమింపవు. తమి వెల్లిదంబునఁజేసి పరమోముఖము లని యెఱుంగక విషభాండములఁజేయు భైరవనాయకునివంటి యలసులు నీమాయమాటలకు లోఁబడుదురు. ధనమునకు నమ్ముడువోయినఁ బోవుదురు. ఎల్లరు నట్టివారని భ్రమింపకుము. హాలాహల ముదయించిన సముద్రమునచే యమృతముకూడ నుద్భవిల్లు టెఱుంగవా? సృగాలము సంచరించు విపినమందే హర్యక్షముకూడ నుండు టెఱుంగవా? అధర్మాభ్యుదయము మరుమరీచిక యని యెఱుంగవా? దురాశాప్రవాహము వినాశసముద్రమున సమసిపోవునని యెఱుంగవా? అదియునుంగాక, బాహుబలమున మీకు సాటిలేరని విఱ్ఱవీగుచున్నావు. అదియు, బయల్పడుతఱి యాసన్నమగుచున్నది. మీమారణము దీని విశదీకరించుఁగాక! భరతరాజ్యలక్ష్మి మీకనుగుట్టఁ గాఁబోలు: కానిచో వీరాతివీరుని మౌర్యతిలకునిపైఁ గత్తిదూయుదువా? ఇంతటి కనువేమ రుండుట బాగుపడుటకా? దీనిఫల మనుభవింతువు, చూడుము. అరిషడ్వర్గమునకు నోడిన యాతఁడు ప్రబలవిరోధివరూధిని నెదిరింపనేర్చునా? దురాశాపాశములకుఁ గట్టువడిన యవనద సమరకోలాహలమున కెట్లు సమర్థుఁడు? ఇంద్రియములకుఁ గయిమోడ్చునంతకాలము—ధర్మాధర్మములఁ గనుమూయునంతకాలము—నీకు మంచిగలుగదు. ఇది సత్యము. ఇప్పటికైనను, బాగుగోరుదువేని లెమ్ము. నాతో రమ్ము; మౌర్యసార్వభౌముని పాదముల వ్రాలుము ".

మా రాజన్యచూడామణి యొూతుగ అచుచు వచించెను. ఆ మాటలతోడ సభాంతరమునఁ గోపపిశాచ మావిర్భవించెను. అప్రయత్నముగ గ్రీకుల కరములు కరవాలములపై వ్రాల సాగెను. శెల్యూకేశ్వరుని హృదయము కోపాగ్నికుండమై ప్రజ్వలించెను అతని నేత్రము లగ్నికణములఁ గురియుచుండెను. "దురాత్మా! వదరుబోఁతా పాపాత్మావల! ఈ నీచు నావలఁ గొనిపొం"డని యతఁ డనియెను.

భటులు, మలయకేతువు నావలకుఁ దరలించిరి. అతఁడు నిర్లక్ష్యభావముతో సభను వీడిపోయెను.

అనంతరము, శెల్యూకేశ్వరుని కుమారి హేళిని, తన చంద్రహాసమును సవరించుకొనుచు లేచి "సభాసదులారా! గ్రీకువీరపుంగవులారా! నాటకమును జూచితిరిగదా! సంభాషణసారము వింటిరిగదా! భారతీయులు దుర్మార్గు లనుట గ్రహించితిరిగదా! ఇఁక జాగుసేయక, గ్రీకు బాహుబల ప్రభంజను సాయమున హైందవవారిదముల శకలీభూత మొనర్పుఁడు. వారి ప్రాణములు, మీచేత నున్నవి. వారి బ్రదుకు మీపై నాధారపడి యున్నది. భీరువులకు బింకములు మెండు. దక్షులు కార్యకౌశలురు. రాజ్యములు వీరుల సొత్తు. జయలక్ష్మి వీరవశవర్తిని. మన ఆలీసాంద్రుఁడు పరలోకగతుఁ డయ్యు మిమ్ము వేయుఁగన్నులఁ జూచుచున్నాఁడు. ఆతని చరిత్రను స్మరింపుఁడు. ఆలీసాంద్రుని హైందవదిగ్విజయకాలమున నీ చంద్రగుప్తుఁడు, డేగం గన్న పావురముఁబోలె నెందో దాగియుండెను. అట్టి యనద నేఁడు మేటియయ్యెను. అంతటిపిటికి నేఁడు మగధసింహాపీఠి

నధిష్ఠించు టయ్యెను. ఊరుపేరు లేనివానికి సార్వభౌమపదము లభించెను. మృగరాజు వాసిన కానయందు నక్క పెద్ద గాదా! వృక్షములేనిచోట నాముదము వృక్షముగాదా! ఓ శూరకులావతంసులారా! గ్రీకునామ ముద్ధరింపుఁడు. ఆలీ సాండరుని పేరు నిలుపుఁడు. చంద్రగుప్తుని రుధిరమున నాతనికిఁ దర్పణ మిడుఁడు. భారతరణావని వీరవిహారము సల్పుఁడు. ఏ గ్రీకువీరుఁడు మహార్యుని శిరము నుత్తరించునో, ఏ యవనశూరుఁడు చంద్రగుప్తునియసువులఁ బోకార్చునో, ఏ మ్లేచ్ఛయోధుఁడు హైందవసార్వభౌముని మట్టుపెట్టునో యాతని పూజ్యచారిత్రము శిలాక్షరనిర్మితమై వెలయుచుండును. ఆతఁడు గ్రీకురాణ్మణికిఁ గూర్చు పుత్రిరత్నము. ఆతఁడే మ్లేచ్ఛరాజ్యరమావల్లభునకు నచ్చినబం" టని యామె యుత్సాహదేవతను బురికొల్పి కూర్చుండెను.

ఆ నారీమణి యుపన్యాసామృతము వెల్లివిరిసి పలుపాయలుగాఁ జీలి గ్రీకు యోధ హృదయ సరోవరముల నింపెను. చంద్రగుప్తుని జీవముల హరింప నెవరికి వారు నిశ్చయించుకొనిరి.

మెగా:—— సార్వభౌమా! ఆరసి చేయుపనికి హానిలే దందురు. వైరి యల్పుఁ డని యుపేక్ష సేయరాదు. అగ్ని రేణు వని త్రోయరాదు. నిశ్శాత్రవ మగు రాజ్యమే రాజ్యము. సామము సాగు నేని సర్వశ్రేయము. కానినాఁడు, తక్కినవి శరణీయములు.

అది విని పాత్రకులుఁడు లేచి "ప్రభువర్యా! మంత్రు లట్లాడక తీఱును. విరోధిశిరోధులఁ జెండాటలాడు వీరభటుల

కివి నచ్చవు. గ్రీకు సీరా గ్రేసరులకుఁ బిఱికిపందలతో సఖ్యమా? స్త్రీమాత్రురాలగు హేళిసిరమణికిఁ గల ధైర్య శౌర్యములు మాయందు లేవు ఉన్నవా? కయుంగవమ్రోల నిట్లాడ లజ్జింపరా! భైరవనాయకుఁడు మనకుఁ దోడైయుండ, హైందవవిటపి నున్మూలముగా నాశనము చేయుట యొక పనియా? సామమునకుఁ గడంగుదురేని, మగధమంత్రి యగు రాక్షసుని, మాయలమల్లియగు చాణక్యుని గెలువఁగలరా? మనకు దండము తప్ప నొండుమార్గము లేదు. హేళిని యంతయోజింపక పలికినది కాదు. ఆమెమతము గ్రహింపలేని మన వెఱ్ఱితనమున కే మనవలయును? రాకుమారిపలుకులు శిరమునఁ దాల్ప దగ్గములు" అని చెప్పి కూర్చుండెను.

సేనాప యభిప్రాయమును సభ్యులెల్లరు ప్రశంసించిరి.

మెగా:— రాజచంద్రా! భారతీయుల పరాక్రమము లాబాలప్రసిద్ధములు. మనకు వా రేమిటను దీసిపోవువారు కారు. గోటఁబోవుదానిని గొడ్డంట నఱుక నేల? దండోపాయము తుదఁగలనే కలదా. దాని ప్రస్తావ మిప్పు డనవసరము.

హేళిని:— జనకా! మఱి మఱి యోజించిచూడ, మంత్రిశేఖరునిమాట నాకు నచ్చుచున్నది. చంద్రగుప్తుని యభిప్రాయ మింతదనుక మనకుఁ దెలియదు. కాన, నీతికోవిదుం డగు మెగాస్తనీసును, పాత్రకుల సేనానిని రాయబారమంపుఁడు. చంద్రగుప్తుని యభిప్రాయము తెలియఁగలదు. అనంతరము కర్తవ్య మాలోచింప నగును. గ్రీకుల పాంచాల రాజ్యమున వారి పతాకమును దింపుట; మనకుఁ

చంద్రగుప్తుఁడు సామంతరాజగుట; మనము నిర్ణయించు కప్పము నతఁడు చెల్లించుట; యీమూఁడు కుదిరిన సంధి యగును; చంద్రగుప్తుఁడును ప్రాణముల దక్కించుకొనును.

పాత్ర:—హేళినిమతము విన్నంత నా యభిప్రాయమును మాఱినది. ఎటు చూచినను సంధికన్న మేలు గానరాదు. సంధి గానినాఁడు విగ్రహము గలదు.

తన కుమారీమణి బుద్ధివిశేషమునకు సెల్యూకేశ్వరుఁడు సంతసించి ‘సంధినమరునేని యీకల్లోల మాగును. భారతీయులజీవనములు నిలుచును. సేనానియు సచివశేఖరుఁడును సమయము చూచి పాటలీనగరమునకుఁ దరల వలయును’ అనెను.

మెగాస్తనీసు పాత్రకులులు. రాజాజ్ఞను మాఱుఁదాల్చిరి. అంతతో నాఁటిసభ ముగిసెను. అందఱును రాయబారపుఁ బర్యవసానము నిరీక్షించుచుండిరి.



# ఆ జ వ ప్ర క ర ణ ము

## మో హాం కు ర ము

రతీమన్మథుల కల్యాణమునకు లక్ష్మీనారాయణుల పిలుపున సూర్యచంద్రులు చనిరి. విందువేడుకలు వివాహమునకుం దగినట్లు జరిగెను. లక్ష్మీనారాయణులు లోకక్షేమంకరులగు సూర్యచంద్రుల రాకకెంతయు సంతసించి వారిని సముచిత సత్కారముల నాదరించిరి. కల్యాణోత్సవములు సమాప్తము లయ్యెను. అన్నదమ్ములు రవిశశాంకు లిలు చేరిరి. వారిం గాంచినతోడనే వారితల్లి పరమానందభరితయై 'నాయనా! ప్రభాకరా! పెండ్లి బాగుగా జరిగినదా? తల్లికేమి తెచ్చితి' వని ప్రేమమీఱం బ్రభాకరు నడిగెను సహజకోపనుం డగు తపనుం డందులకు "సర్వలోకనాయకుండు మహావిష్ణువు తలంపులకు సేగి యుండునా? ఈ ముసలి ప్రశ్నలం బ్రొద్దుపుచ్చకు. ఎంతయున్నను ఆడువారికిం గొదువ తీఱదుగదా!" యని కసరికొట్టెను. ఆ గద్దింపుల కామె యలిగి 'ఓరీ! మూఢా! ఆదిత్యా! తల్లి యను గౌరవము నీ కేకడను లేదా? నీకృతజ్ఞత యింత మాత్రమా? ముక్కోపివై మాతృదేవత నగు న న్ననరాని మాట లంటివి గదా! ఇదే శపించుచున్నాను. నీసహస్రకిరణముః లేక శైత్యమునకు దూరమగుంగాక! నీతోడిదే లోకముగానున్న తల్లిమెడ నీ వెట్లాచరించితివో, అట్లే భూలోకనివాసులు నీ వలన నుజ్జీవితు లగుచుండియు, నీయెడ నాచరింతురుగాక: నీ

ముఖావలోకనము నా కొల్లకుండుగాక!' యని శపించి, హిమాంశునివంకఁ దిరిగి 'ఓహిమకరా! నీవు నా కేమి తెచ్చితివి? వివాహమునందలి విశేషము లే' మని ప్రశ్నించెను. అందులకుఁ గలువలచెలికాఁడు వినయస్వరమున 'తల్లీ! మామనికల్యాణ మతివైభవముగా జరిగెను. అది చూడ సహస్రాక్షుఁడు తనకుఁ గన్నులు చాల వనెను. ఇదిగో నీకై నా తెచ్చిన ప్రసాద' మని కొన్ని స్వాదుఫలములను, పారిజాతప్రసూనముల నామెమ్రోల నిడెను. అమృతకరుని మాతృభక్తికిని, కృతజ్ఞతాబుద్ధికిని నామె సంతుష్టాంతరంగయై 'నాయనా! నీ కెంతయు నలరితి. సహస్రకరునికంటె వయసునఁ జిన్నవాఁడ వయ్యు, బుద్ధికుశలతఁ బెద్దవాఁడవు. పట్టి విద్యవలన ఫలము లేదు. అది వినయమునఁగాని ప్రకాశింపదు. నీవు దేవతలకు నమృతదాయి వగుదువుగాక! కువలయాహ్లాది వై తనరుదువుగాక! నీ సందర్శనార్థము ప్రజలువ్విళులూరుదురుగాక! నీ తేజోమయములు, జగద్రంజకములునగు షోడశకళలు నీకుఁ బెట్టనిభూషణములగుఁగాక!' యని యామె చలువలతేని దీవించెను. సప్తసముద్రములింకినను, సర్వప్రపంచము లయించినను సత్యసంధుల వరములుగాని, శాపములుగాని తప్పవుగదా! నాఁడు పూర్ణిమ. ప్రకృతిపైఁ గప్పురపుఁబొడి చల్లినటు లుండెను. మలయమారుతుఁడు హాయిగా వీచుచుండెను. తారకలు మింట నందందుఁ గానవచ్చుచుండెను. చంద్రుఁడు లోకము నెల్లఁ దేటి చూడ నభోమధ్యభాగమున కేళ్ళుచుండెను. ప్రాణికోటి మైమఱచి నిద్రించుచుండెను.

కాని హేళినికి మాత్ర మీదిన మేలో నిదురరా లేదు. ఆ రాకుమారి తన యుద్యానవనమున సెలయేటి యొడ్డున నిసుకతిన్నెపయి నొంటరిగాఁ గూర్చుండి యోచ నానిమగ్నయై యుండెను. అప్పుడప్పుడు వినవచ్చు కోకిల రుతములుదక్క నొండుశబ్ద మందుఁ గలుగుటలేదు. కరకలిత కపోలయు, ననిమిషలోచనయు నగు నారాజపుత్త్రి కను గోశములనుండి వెలువడు వీక్షణమాలికలు నద్యోటితర గలఁ దేలియాడి పోవుచుండెను. అట్టిసమయమున నట్టి సుందర వనమధ్యమున, నా మోహనాంగి మూర్తిఁ గైకొనిన శృంగా రమువలె నుండెను. ఆకృతిఁదాల్చిన వనలక్ష్మిఁబోలె నొప్పారు చుండెను.

ఇంతలో నెవరో వచ్చుచున్న సడి యయ్యెను. ఆ వైపున కామెచూపులు మఱలెను. కాని యెవరును గాన రారు. ఆమె మఱల నదీజలములఁ జూడఁసాగెను. కొంత సేపటికి 'చెలీ! హేళినీ! ఇట్టివేళ నొంటరిగ నేమి చేయు చున్నా' వని యనుచు నొక సుదతీలలామ యచటి కరుదెంచి యామెచేతిని బట్టుకొనెను. హేళిని విభ్రాంత యయ్యెను.

హేళిని:— తిలోత్తమా! ప్రాతఃకాలమునుండియు నాదేహ మస్వస్థముగా నున్నది.

తిలోత్తమ:— శీతలమారుతము హాయిగూర్చు ననుకొంటివా? అంతయును దెలియును. బహిఃప్రాణ మగు నాకా దాచెదవు?

హేళిని:— సఖీ! నే నిచట నుండుట నీ కెట్లుఁ దెలిసినది?

తిలో:— నీగదికిఁ బోయి చూచితిని. అందుఁ గానరామి నిచట నిట్టిస్థితి నుందు వని తలంచి వచ్చితిని.

హేళిని:— నీవు జాణవు. ఈ దినము మలయకేతువు కడ నింతసే పేమి చేయుచుంటివి?

తిలో:— పాత్రకులుఁడు మఱల నేఁ డరుదెంచి యాతని కేమియో బోధించెను. కాని వానిబోధ బూడిఁబోసిన పన్నీ రయ్యెను.

హేళిని:— పాపము! పాత్రికులుఁడు గ్రీకువిజయోత్సవార్థమై చాలశ్రద్ధఁ దీసికొనుచున్నాఁడు. ఈ దండయాత్రయం దాతఁడు మాతండ్రికిఁ గుడిభుజమువలె నున్నాఁడు.

తిలో:— (నవ్వుచు) అవు నవును. నీ వాతనిగూర్చి యెట్లో, యాతఁడును నిన్నుఁగూర్చి యట్లే ప్రశంసించుచుండును. సర్వకాల సర్వావస్థలయందును నిన్నే యాతఁడు కలవరించుచుండును.

హేళిని:— తిలోత్తమా! నీ పలుకు మర్మగర్భము. వానియెడ నాకు సోదరభావము. అంతియకాని, నీవు తలంచు నటుల యొకనాఁ డైనను... ... ... ...

తిలో:— అవునని యెవరు చెప్పిరి? గుమ్మడికాయ దొంగ లెవరనిన, భుజములఁ దడవుకొనెద వెందులకు?

హేళిని:— చెలీ! నీకుఁ దెలియని దేమి కలదు? చెప్ప రాని దే మున్నది? నాయౌవనప్రాదుర్భావము మొదలు, పాత్రకులుఁడు నన్ను వలఁపుచూపులఁ జూచుచున్నాఁడు. నా

మనసున కెక్కఁ బ్రయత్నించుచున్నా. కాని నామానస భృంగ మామోదసుపుష్పముపైఁ లనిచ్ఛగించుటలేదు.

తిలో:—మంచిమాటఁ జెప్పితి. అట్టి వికృతాకారుని గట్టికొనిన తరుణి యేమి సౌఖ్య మనుభవింపఁగలదు? ఆతఁ డ్లోక దుశ్శాసనుఁడు. అతని గుణము లతినీచములు. వర్తన మతిహేయము, మధుపానరక్తిమము లగు నాతని నేత్రములు సర్వదా చింతనిప్పులవలె నుండును. సర్వాంగసుందరివి నీవు; సర్వాంగవికూపి సేనాని. మీకు లతికా శుష్కకాష్ఠ సామరస్య మున్నది. సఖీ! చూచితివా! ఇట్టి సామాన్యుఁ డగు సేనాని సర్వగుణసంపన్నుం డగు చంద్రగుప్తునిపైఁ గత్తిఁ గట్టినాఁడు. శత్రుప్రశంస యొకించుక యప్రస్తుత మైనను మాటవరుసకుఁ జెప్పెదను. పాత్రకులుం డెంతటి నీచవర్తనుఁడో చంద్రగుప్తుఁ డంతటి మాన్యవర్తనుఁడు. పాత్రకులుం డెంతటి పిఱికిసందయో, చంద్రగుప్తుం డంతటి ధీరాగ్రేసరుఁడు. పాత్రకులుం డెంతటి కురూపియో, చంద్రగుప్తుం డంతటి మోహనమూర్తి. వాయస మెక్కడ? వైనతేయ మెక్కడ? పాత్రికులుఁడు మసిబొగ్గు. చంద్రగుప్తుఁడు మాణిక్యము. ఎక్కడిసామ్యము వీరికి?

హేళిని:—చంద్రగుప్తుఁడా? భారతసార్వభౌముఁడా?

తిలో—అవును. ఆ దివ్యచారిత్రు నెప్పుడైనఁ జూచితివా? చూచినచో.........

హేళిని:—ఏ మగును?

తిలో:—ఏ మగును! వెంటఁబడి పోవుదువు.

హేళిని—ఆతనిపేరు విన్న విలువెల్లబోగయు నా ప్రేమాల తదీయ ప్రతాప పౌరుషాదులు వర్ణించు నీభావము నాకుఁ దెలియకున్నది. అట్టి పందను నాకుఁ గట్టిపెట్టెదవా!

తిలో:—ఏమనెదవు! అతఁడా పంద! భారతీయుఁడు గాన పంద యనెదవు గాఁబోలు!

హేళిని:—యవనేతరులు భీరువు లని నా యభిప్రాయము.

తిలో:— ఇది యభిప్రాయముగాదు; దురభిప్రాయము. శౌర్యలక్ష్మికి యవనులు మాత్రమే పుస్తెఁగట్టిరా? మౌర్య రాజ్యస్థాపనమున చంద్రగుప్త సార్వభౌముని వీరవిక్రమ లీలలను, చణకనందనుని రాజనీతినైపుణ్యమును విన్న నీవే మందువో?

హేళిని:—చణకనందనుఁ డెవఁడు?

తిలో:—ఆతం డొక బ్రాహ్మణోత్తముఁడు. ప్రతిభాశాలి. నిరస్తనీతికోవిదుఁడు. సార్వభౌముని యుపాధ్యాయుఁడు. పట్టినపట్టు వదలువాఁడు కాఁడు.

హేళిని:—అవును. ఆతఁడు మిగుల మాయలమారి యఁట! మాగ్రీకువీరుల నెందఱినో బలిగొనెను. మగధ రాజగు మహాపద్మనందునకు నా బ్రాహ్మణునకు వైర మేల గలిగెను?

తిలో:—పలువిధములుగాఁ జెప్పుదురు. ఒకనాఁడు పాటలీపుత్రమున నొకసభ జరిగెను. చాణక్యోపాధ్యాయుం

డద్దాని కధ్యక్షత వహించెను. ఒకానొక పండితుఁడు వక్తయై యుపన్యాస మిచ్చుచుండెను. పురప్రముఖులెల్ల రా సభ నలంకరించియుండిరి. ఇంతలో మహాపద్మనందునిపుత్త్రులా సభను ప్రవేశించిరి. వారి యాగమనగౌరవసూచకముగా వక్త యుపన్యాసము నాపెను. సభయెల్ల లేచి వారల గౌరవించెను. అగ్రాసనాధిపతిమాత్రము కదలలేదు. చాణక్యుని నిర్లక్ష్యభావమునకు నందులు కోపాక్రాంతులైరి. వారికోపము మిన్నుమన్నేకముగ మ్రింగున ట్లుండెను. దుర్భాషలాడుచు వారు చాణక్యుని—అగ్రపీఠస్థుని— జుట్టుపట్టుకొని లాగి యీవలకు గెంటిరి. ఆత్రోపున నా బ్రాహ్మణుఁడు క్రిందఁబడెను. ఆపాటునం జేసి చాణక్యాచార్యుని పిలకముడి వీడెను. ఆ యకార్యకరణమునకు సభయంతయు హాహాకారము నొనర్చెను. సభ్యులెల్లరు “ఇంత యరాజకమా? ఇంత గర్వమా? యువరాజులకుఁ గన్నులు కానరాలేదా?” యని తల కొకమాట యనసాగిరి. రాజకుమారుల దుండగము చాణక్యు నాగ్రహోదగ్రమానసునిగా నొనర్చెను: “ఓరీ! దుర్మార్గులారా! నన్ను నాయాసనమునుండి మీరు గెంటినట్లు, మిమ్ములను మగధరాజ్యసింహాసనమునుండి గెంటి, మీప్రాణానిలములఁ బోకార్చుదనుక, ఇదిగో చూచితిరా యీ నాశిఖను ముడువ” నని భీకరప్రతిజ్ఞ యొనర్చి సభను వీడిపోయెను. గోచిపాతకే గతిలేని బాపఁడేమి చేయఁగలఁ డని నందులు నిర్లక్ష్యభావసూచకముగా నవ్విరి. పేదకోపము పెదవులచేటని వెక్కిరించిరి. ఈ భయంకరోదంతము పౌరులకు ముక్కుపై వ్రేలు తెచ్చెను. చాణక్యుం డన్నంత సేయునని వా రనిరి. బ్రాహ్మణావమానము

వినాశసముద్రమునఁ ద్రోయకపోదని తలఁచిరి. ఈ విషయము మహారాజు చెవిఁబడెను. కాని యాతఁడంనుల కొకనవ్వు నవ్వి యూరకుండెను. చాణక్యకోపానలమున కిది ప్రచండమారుత మయ్యెను. "కొంఱగాని కొంఱకుపుట్టిన కొంఱగామియె కాదు, తంత్రీగుణములఁ జెలఁచున్" అను పండితవాక్యమునకు మహా పద్మనందుఁడు తార్కాణమయ్యెను.

చాణక్యచరిత్రమును వినుటతోడనే, హేళిని కాతని బ్రత్యక్షముగఁ జూచినటు లయ్యెను. "ఘటనాఘటన సమ ర్థుండగు చాణక్యుని జూచితీరవలయు" నని యామె యనెను.

తిలో:—(నవ్వుచు) ఆతని శిష్యుని జంద్రగుప్త సార్వ భౌమునిగూడఁ జూచితీరవలయును. సంగతి నవిస్తరముగా వినుము. ఆ సమయమునఁ జంద్రగుప్తుఁడు, అసూయాపరు లైన నందులచే రాజద్రోహిగాఁ బ్రకటింపఁబడియుండుటవలనఁ బురమువాసి పోయి యుండెను. నందుల దుర్వ్యాపారమును, చాణక్యపరాభవమును, ఆ విప్రుని భీకర ప్రతిజ్ఞను చంద్ర గుప్తుఁడు వినియెను. చాణక్యప్రభావ మాతని కిదివఱకే విది తము. ఆ నాఁటిసభ తనకు మహోపకార మొనరించినదని యాతఁ డుప్పొంగెను. చాణక్యాశ్రయమే తన కిప్పట్టున శ్రేయోదాయక మని తలంచెను. అందులకై యాతఁ డా భూసురప్రవరునియాశ్రమమున కభిముఖముగా నడువసాగెను. మందస్మితవదనముతో విజయలక్ష్మియు నాతని ననుగమిం చెను. అది ప్రాతఃకాలము. మార్యుండచటికిఁ బోవునప్పటికి చాణక్యాచార్యుఁడు మార్గమందుఁ గూర్చుండి యొక

గునపముతో నొకగడ్డిదుంపను ద్రవ్వుచుండెను. ఏలకో యా మహీసురుని ముఖము జేవురునారి యుండెను. ఆతం డా దుంపను మమూలముగా( బెకిలించి ముక్కలు ముక్కలుగా(జేసి, తగుల(బెట్టి, కమండలూదకమున( గలిపి గుటగుటమని త్రాగెను. చంద్రగుప్తు(డు దీనినంతటిని ఱెప్ప లల్లార్పక చూచెను. చాణక్యప్రతిభావిశేష మా యువకుని నిశ్చేష్టునిగా నొనరించెను. ఆతం డటులే 'నందవిద్వేషి ప్రియశిష్యు(' డని యాధరణీదేవుని పాదముల వ్రాలెను. 'నందవిద్వేషి' యను చంద్రగుప్తునెడ చాణక్యు(డు ప్రసన్నుండై 'అభీష్టావాప్తి' రస్తని యాశీర్వదించెను. అంత వారి కిట్లు సంభాషణ జరిగెను.

"మహాత్మా! మహాపద్మనందుని కుమారు(డను. నాపెదతల్లి పుత్త్రు లసూయచే నన్ను దేశభ్రష్టుని జేసిరి."

"అటులైన వృషలా! నీవు నాకు ముఖ్యశిష్యు(డవైతివి. తెలిసితివా? నందుల పాపఫలము పండినది. నేల రాలుటే కొదువ. కాకియై కలకాలము బ్రదుకుటకంటె, హంసయై యాఱునెల లుండుట మేలు. లోకనృశంసులను, ధర్మమార్గకంటకులను మన నిచ్చుట ప్రాజ్ఞత కాదు."

"చాణక్యకోవిదవర్యుని ప్రసన్నతచే నాజన్మ మీ దినము సార్థకమైనది."

"వింటివా? నా రెండవ ప్రతిన. నవనందవినాశనిశ్శాత్రవమగు మగధసింహాపీఠి నిన్ను( బ్రతిష్ఠింతును. నా ప్రతిజ్ఞ జరుగును. జరుగ(గలదు. జరిగి తీరవలయు."

చంద్రగుప్తుఁడు హర్షోత్ఫుల్లలోచనుం డయ్యెను. నేతక బోయిన తీఁగె కాలఁ జుట్టుకొని నటులయ్యెను.

చంద్రగుప్తుని యసమాన బాహుబల పరాక్రమము నకుఁ జాణక్య మేధాసంపత్తి తోడ్పడుట, అగ్నికి వాయువు సాయముచేసినపటు లయ్యెను. గురు శిష్యుల నిరంతరదృఢ ప్రయత్నములచే యవనరాజాష్టకము పరలోకయాత్రసల్పెను. స్వయంకృతాపరాధమునకు వగచుచు, మహాపద్మనందుఁడు కానలఁబట్టి పోయెను. మగధ సింహాసనము మౌర్యుం డధిష్ఠించెను. దుష్టగ్రహవిముక్తుఁడై రాజు షోడశకళలతోఁ గువల యానందకరముగాఁ బ్రకాశింపసాఁగెను. దేశము నలుమ యున్న దుర్వ్యసన తమః పటలి వలసపోయెను. కృతప్రతిజ్ఞుఁడు చాణక్యుఁ డప్పుడు సిగ ముడిచెను. నాఁడు చంద్రగుప్త సార్వభౌముఁడు విపక్షులకుఁ బ్రక్కబల్లెమై యున్నాఁడు. చూచితివా! ఆ మహామహుని దివ్య మంగళవిగ్రహము.

అని తిలోత్తమ తన యొడినున్న చిత్రపటమును దీసి హేళిని చేతి కిచ్చెను. ఆ చిత్రపటమును జూచినతోడనే హేళిని మిట్టిమీఁదై పడి "ఇందేమి యెక్కువ కలదు? ఇది నీ కెటుల వచ్చిన" దని యామెను నిందాగర్భముగా నడిగెను.

తిలో:—(నవ్వుచు) ఎటుల రావలయునో యటులే వచ్చినది.

హేళిని:—ఈ పటములోనివాఁడు నాకు బద్ధవైరి. దీనిని నా కింకఁ జూపకుము.

అని హేళిని యించుకకోపముతో నా చిత్రపటమును తిలోత్తమపై విసరివేసెను. అది వాతోద్ధూతమై, యాసెలయేటి యందుఁబడి కొట్టుకొని పోయి చూచుచుండఁగనే మాయమయ్యెను. అందులకు హేళిని మందహాస మొనరించుచు, "చూచితివా! నీ సార్వభౌముఁ డేమయ్యెనో?" యని యామెను ఎత్తిపొడిచెను. హేళిని చేష్టలకుఁ దిలోత్తమమనస్సు చివుక్కురు మనెను. 'నా పటము పనికిరానప్పుడు, నేనుమాత్ర మెందులకు? పోయెద' నని యామె లేనవ్వు నవ్వి బయలుదేరి వనవృక్షములసందులఁ బడి పోఁజొచ్చెను. హేళిని "చెలీ! రమ్ము! చెలీ! రమ్ము! ఇంత మాత్రమున కింత కోపమా?" యని కలస్వనమున నామెను జీరుచుండెను. హేళిని పిలుపులను దిలోత్తమ పెడచెవిఁబెట్టి పోవుచుండెను.

ఇంతలోఁ మఱియొక వైపునుండి "హాయి హేళినీ! హాయి హేళినీ!" యను ప్రేమసూచకంబగు పిలు పామెకు వినఁబడెను. పిలుపువెంటఁ బురుషుఁ డొకడు గానవచ్చెను. వానిని జూచినవెంటనే యామెమేను జలదరించెను. ఆతని రాకవైఖరి యామె కెంతయు భయముఁ గొల్పెను. కింకర్తవ్యతావిమూఢత్వమును వదలి యామె చివాలున లేచి "తిలోత్తమా! తిలోత్తమా! అయ్యో! చెలీ తిలోత్తమా" యని పరుగెత్తసాగెను. "చెలీ! ఇదుగో వచ్చితి" నని తిలోత్తమ

దూరమునుండి హెచ్చరించుకొనెను. హేళిని యింతలో నామెను గలిసికొని వెడలిపోయెను.

"హేళిని! హాయి ప్రియా! హేళిని!" యని సొక్కుచు సోలుచువచ్చుచున్న యాపురుషుం డచ్చట హేళినిఁ గానమి ఖిన్నుఁడై నేలఁగూలఁబడెను. మధుపానమత్తతకు నిదురతోడై వానిని వివశు నొనర్చెను. ఆ ప్రదేశము యథాపూర్వము నిశ్శబ్దముగా నుండెను.

# ఏడవ ప్రకరణము

## మాతృప్రబోధము

లోకభయంకర మగు యుద్ధము సంభవించు సూచనలు పొడగట్టుచుండెను. శెల్యూకేశ్వరునిచే నియుక్తులై రాయబారమునకుఁ దరలిన పాత్రకులుఁడును, మెగాస్తనీసును జేపో మఱునాఁడో పాటలీపురమును జేరనుండిరి. ఈ వార్త క్షణములోఁ బట్టణమంతయు వ్యాపించెను. పలువురు పలు విధములుగా నాడుకొనుచుండిరి. దౌత్యపర్యవసానమును గుఱించి పౌరులు మిగుల నాతురతగా నుండిరి. మహావీర శిఖామణియు, రాజ్యతంత్రకుశలుఁడు నగు సార్వభౌమేంద్రుఁడివివఱకే రాయబారుల కియ్యవలసిన ప్రత్యుత్తరమును సిద్ధముచేసికొని యుండెను. నృపాలురు చారచక్షువులు. చంద్రగుప్తుఁడు తనరాజ్యమునంతటిని గూఢచారులచే నింపెను. నానావిధవేషములతో, పాయసములోని పంచదారవలె వారు రాజ్యమంతయుఁ దిరుగుచు నెప్పటివిశేషముల నప్పుడే చక్రవర్తివీనుల వైచుచుండిరి.

భారత దేశాభ్యుదయ మీ సమరముపై నాధారపడి యుండుటచే, నారాజచంద్రుఁడు మిగుల జాగరూకుఁడై వేయిగన్నులఁ గాచియుండెను. భారతవర్షము నిసర్గసంపత్సమృద్ధము. దానికై కన్నుపచ్చగాని విదేశవాసి లేఁడు. వారి బారి తొలఁగు టెట్లు? అందుల కేది వెఱవు? రణమే శరణ మన్న నది యపాయములేని యుపాయము గాదు. గ్రీకులు

జిగీషాలోలురై ప్రాణముల లెక్కచేయుట లేదు. భారత కుమారులు మాతృరక్షణార్థము కత్తిదూసి నిలిచియున్నారు. సమరము నిలుచుమార్గము దోఁచదు. చాణక్యాశ్రమము నకు, రాజధానికి నడుమ రెండుక్రోసులుగలదు. గురు శిష్యు లనుదినముకలిసి మంత్రాలోచనముచేయుట కది కొంత యాటంకముగా నుండెను. కాన వారు పరస్పరమంత్రములఁ జాణక్యశిష్యులముఖంబున నందుకొనుచుఁ గర్తవ్యనియతులై యుండిరి.

పగలు నాలుఁగుగంటలైనది. రహస్యాలోచనామం దిరమునం దుండి యువరాజగు బింబిసారుఁడీవలకొచ్చి రాజానుమతిని నెచటికో పోయెను. అంతలో నొకచారుం డరు దెంచి "జయము! జయము రాజపరమేశ్వరా! గ్రీకురాయ బారులు రేపుప్రాతఃకాలముననే రాజధానికి వచ్చెదరని రూఢి యగు వార్త తెలిసిన" దని విన్నవించెను. చక్రవర్తి నగు మోము దాల్చి 'గాలవు నిటకు సత్వరము గొని రమ్మ'ని యానతిచ్చెను. గాలవుఁ డరుదెంచెను. 'రాయబారము రేపే జరుగుననియు, సభకు తప్పక విచ్చేయవలయుననియు, నాప్రార్థనఁగా ఆచార్యునితో విన్నవింపుము' అని సార్వభౌ ముఁడు వచించెను. రాజచనానుసారముగాఁ గాలవుఁడు చాణక్యదర్శనార్థము తరలెను.

అప్పటికి సాయంకాల మయ్యెను. భారతదేశముపై నిరపరాధముగా దండెత్తివచ్చు గ్రీకుల దుండగములకుఁ గివి సెనో యన, లోకబాంధవుం డరుణిమఁ దాల్చెను. గాలవుఁడు గుర్వాశ్రమమునకుఁ బోయి యందు చాణక్యునిఁ గానక,

యాతని వెదకుచు గంగాతీరమునకుఁ జనెను. చాణక్యుండు సికతాతలమున యోగదండమును నాటి బాహుమూలఁ నానించుకొని పద్మాసనస్థుండై యుండెను. ఆతని చూపు ఒ వంక నిగిడి చెదరక యుండెను. భావనా పరంపర లా మానసాకాశమునఁ బొడసూపి మాయ మగుచుండెను. అ ముఖము గంభీర భావద్యోతకమై యుండెను. ఆతని య ములనుండి మాటలెవ్వియో యస్పష్టముగా వెలువడుచుండె. గాలవుం డతనికడ కేగి నమస్కరించి ప్రాంజలియై నిల్చె దీర్ఘాలోచనా నిమగ్నుండై యుండిన చాణక్యుండా జూచి యాశ్చర్యచకితుఁడై "వత్సా! విశేషము లేమి?" అని యడిగెను.

'ఆర్యోత్తమా! ఎల్లి ప్రాతఃకాలముననే గ్రీకురాయబారులు రాజధానికి రాఁగలరఁట! రాజసభ జేపే కూడఁగలదు. తాము తప్పక విజయం చేయవలయు నని చక్రవర్తిగారి ప్రార్థన'' యని గాలవుఁడు విన్నవించి, సెలవుఁగొని వెడలి పోయెను.

చాణక్యాచార్యుని మానసచంచరీకము, మజుల సాలోచనోద్యానమున నిర్ధారణ కుసుమార్థము సంచరింపక సాగెను. "ఓరీ! లోక మెంత పాడుగా నున్నది. దీనికి విలయ మెప్పుడు వచ్చును? పరమేశ్వరుఁడు దయాస్వరూపుఁడు. ప్రాణిసర్గ మాతని సంతానము. అయినను, ఎందుఁ జూచినను బోరు తప్ప యొండు గానరాడు. ఇందలి యోధులు క్షణక్షణనూత్న సంవిధానములు పన్నుటఁ జూడ వీరి ప్రతిభాశక్తి విలయకరమయ్యుఁ బ్రశంసనీయమై యున్నది.

కాకోదరము మండూకముపైకి నుఱుకు తఱి, తన్ను నెన్నంటి వచ్చు నీలకంఠము నరయుట లేదు. సుఖాభిలాష, జీవరాశి నిన్ని కడగండ్ల నడుపుచున్నది. భోక్త, తన బుద్ధియం దుండు దానికి భోగ్యవస్తుల వెదకిన ఫల మేమి? కామశక్తియు, మహా మాయావియు నగు సౌఖ్యముకొఱకు ప్రాణిసర్గము స్వస్వతాగ తమ్ము మెంచుట లేదు. తన మనలను వలపెట్టుట లేదు. హితాహితముల సరకుసేయుట లేదు. దవ్వుదగ్గఱల గణించుట లేదు. సాధ్యాసాధ్యములఁ బాటించుట లేదు. ఎంతటి యజ్ఞానము! ద్వంద్వగుణములకుఁ జిక్కిన ప్రాణికోటులు కష్టాటవులఁ బరిభ్రమించుచున్నవి. కాని విషయాతీతుఁ డట్టి దుఃఖాంధకారము నందే సుఖజ్యోతిని బడయఁ గలఁడు. హాలాహలమున నమృతమును సంపాదింపఁగలఁడు. నరకమున నాకసౌఖ్యము లానఁగలఁడు. సర్వ మీశ్వరేచ్ఛాధీనము. మానవుం డాతనిచేతికీలుబొమ్మ. పురాకృతము తప్పదు. మానవుఁడు స్వతంత్రుఁడు కాఁడు. కానున్నది కాకమానదు రానున్నది రాకమానదు. కాన మానవుఁడు నిర్లిప్తుఁడుగా నుండుటయే సముచితము.

గాలవుని వలన వార్త విన్నంతనే, చాణక్యుని హృదయమున నిట్టితలంపులు వెల్లివిరిసెను. కడ కాతని మానస భృంగము నిశ్చలతఁ జెందెను. ఇఁక నాతఁడు లేచి యోగ దండమును బూని యాశ్రమమునకు బయలు దేఱెను. అంతలో జాహ్నవీచిక లాతని దృష్టి నాకలించెను. అది యటనుండి మరల లేదు. ఆతనికి గగుర్పాటు కలిగెను. యోగ దండము హస్తమునుండి జాఱెను. అచట నేమున్నది? అతఁ డేమి

గాంచెను? గంగాజలోపరితలము; శరచ్ఛంద్ర చంద్రికా సాంద్రము; వీచీ…ంతరనిగర్ణక్రీడాసరతారకాసముదయము. అంకు కినాలాపిని దివ్యాంగన గానవచ్చుచుండెను. ఆమె కనుగొలుకులనుండి ముత్తియములఁబోలు బాష్పకణములు రాలుచుండెను. విన్నఁబోయి యున్న యామె నెమ్మోము పయి కుంతలములు చెల్లాచెదరుగ నుండెను. విదేశవాసుఁ డొకఁ డామెనెదుట నిలిచి, రక్తనయనంబులఁ దేఱిచూచుచు నామెను బెదరించుచుండెను. అతని జేరనీయక యా యువతి చీకొట్టుచుండెను. అధిక్షేపముల నతఁడు సరకుచేయుటలేదు. ఇంతలో భారతీయుఁడు తరుణవయస్కుఁ డొకఁ డత్తరుణీ మణి యాక్రందనము నాలకించి కాఁబోలు! వచ్చి యా వైదేశికుని బరిభవించి, బంధించి యెటకో కొనిపోయెను. ఆ మానవతి యటులే ప్రలాపించుచుండెను.

ఈ నాటకమునకు ద్రష్టయై నిలిచి యున్న చాణక్యుని నయనములనుండి యప్రయత్నముగా నీరు గారసాగెను. కదలుట కైనను, మెదలుట కైన నాతం డశక్తుం డయ్యెను. ఆ మహీసురుం డచ్చోటనుండియే, యామహాదేవికి సాగిల పడెను, "తల్లీ! శపింపుము. ఈ మాతృద్రోహిని—ఈ బ్రాహ్మణ చండాలుని—ఈ నరాధముని—మాపుమాయు నటుల శాపోదకముల విడువుము. కన్నతల్లియాపదఁ జూచుచు మిన్నకుండు నీ దుర్మార్గుని — పెట్టి పెంచిన మాతృదేవి మస్తకముపైఁ బడనున్న పిడుగును జూచుచు నిశ్చింతతో నుండు పరమనీచుని—తల్లీ నాశన మొనరింపు" మను మాట లా భూసుర ప్రవరుని ముఖమునుండి వెలువడెను.

అతఁడు లేచి నిలుచుండి యా దివ్యమూర్తినలను జూచెను. ఆ తల్లి మందహాసాంచిత వదనమునఁ దనకడ కనుదెంచి "కుమారా! తెలియక చేసిన తప్పును మన్నించితి. వైరి విజయ మొనరించి యశము నాచంద్రార్కము నిలుపుకొనుము. భారతగ్రామిణి యగు పవార్యవను బాసటగా నుండు" మని యా దివ్యాంగన యాతనితో నని పలుకఁ జేచెను. భారతమాత దయార్ద్ర హృదయమును కెంతయు నలరుచు, నతఁ డామెకుఁ గృతజ్ఞుఁడై యభినందన మాచరించెను. మరల లేచెను. కాని యామె యచట లేదు. అంతలో నామె యదృశ్య యయ్యెను. పూర్వదృశ్య మదృశ్యమైపోయెను. గంగా స్రవంతికా వీచికాఘాత ప్రభూతశబ్దమున నా దేవి దివ్యసందేశము సమ్మిళితమై, మంద మంద మలయానిలముతోఁ గలిసి యాధరణీదేవుని శ్రవణపుటముల భేదించుకొని, ఇతికర్తవ్యతావిమూఢత్వాంధకార సంచారి యగు నాతని మానస చంచరీకమును జ్యోతిర్మయ ప్రపంచమునకుఁ దెచ్చి విడిచిపెట్టెను. మానవులకుఁ గర్మమార్గ మనుసరణీయమని యామహాత్ముఁడు నిశ్చయించు కొనెను. ఆతనిని, మాతృదేవి దివ్య సందర్శనము నిరవధి కానంద సాగరమున నోలలాడించెను.

"ఓ తల్లీ! ఈ దినమే సుదినము. నీదివ్యదర్శనమున నా బుద్ధిజడిమ సమసిపోయెను. నీ యుపదేశము నా హృదయదేశమునఁ బ్రజ్ఞానజ్యోతిని వెలిఁగించెను. జననీ! వీరమాతవగు నీకు వంతనొందఁ బనిలేదు. చండవిక్రము లగు నీ ముప్పది మూఁడు కోట్ల సుతులు నిన్ను విపత్సాగరమునుండి

దరిఁజేర్తురు. పంకజాసన సమాన బ్రాహ్మణ కోటి స్వస్తి వాచక సంరక్షిత వై, వీరాతి వీరలోక భుజా బల పరిసేవిత వై, కుబేర సదృశ వైశ్యరాజ రమా పరివర్ధమాన వై, హాల ముఖాత్త విభూతిదాన వినోదక్రీడాపరాయణ వై, నిరుపమ భక్తి సంపన్న రాక్షస చందనదాస హస్తంగత చామర జనిత శీతమారుతంబుల ననుభవించుచు, దిగంత విశ్రాంత యశశ్ఛత్రచ్ఛాయా కమనీయ సింహపీఠిపైఁ గూర్చుండు నీకుఁ జాణక్య చంద్రగుప్తులు కర్పూర నీరాజనము లిచ్చుచుండ, నట్టి వీరాధివీరుం డైన నేమి, నిన్నుఁ గన్నెత్తి చూడనైన సాహసింపఁగలఁడా? అమ్మా! వగపు మానుము. రజనీకర దివాకరులకు గ్రహణబాధవోలె, సర్వసస్యసంపదాభ్యురాంగివగు నీకును క్షణిక క్లేశము గలిగెను. తల్లీ! దిగులొందకుము. విమోచనకాల మాసన్నమైనది. పిశాచోచ్చాటన మహా మంత్రానుష్ఠానము ముగియవచ్చినది. అచిరకాలమున శాంతి యగు. నీ కానంద మొదవు.''

అని చాణక్యుఁడు కృతప్రతిజ్ఞుండై ''అన్యాయపరులగు యవనుల గెలువనైన గెలువవలయు. లేకున్న నా ప్రయత్నమునందే సమసిపోవలయు'' నని నిశ్చయించుకొనెను. యోగదండమును దీసికొని 'భాగీరథీ! పంచభూతములారా! ఇందులకు మీరలే సాక్షులు. మాతృసంసేవనమున, దేశ సంరక్షణ వ్రతోద్యోగమున, నా ప్రాణములఁ దృణప్రాయముగా నెంచెద' నని యచటినుండి బిరబిర యాశ్రమాభిముఖుఁడై పోయెను.

---

# ఎనిమిదవ ప్రకరణము

## రాయబారము

అనన్య లభ్య దారుమయ కుడ్యవిరాజితంబు, విచిత్ర పతాకాభిశోభితంబు, మహనీయ మరకత శోభాభాసురంబునై కనులపండువుగా నలరారు మగధాధినాథ సభాభవనమునం దా నాఁడు హైందవ రాజ్యలక్ష్మి ప్రసన్నమై యుండెను. గ్రీకు రాజ సందేశ హారులు పాత్రకులుఁడు, మెగాస్తనీసును సముచితాసనంబుల నుపవిష్టులైయుండిరి పరాక్రమమూర్తులో యన మగధచమూపతులు లోకవంకఁ గూర్చుండియుండిరి. రాజకుమారుఁడు బిందుసారుఁడు సింహాసనమునకు దక్షిణ పార్శ్వమున నుచితాసనము నధివసించియుండెను. పరేంగితజ్ఞులగు మంత్రులు కనుసన్నల నొండొరులతో భాషించుకొనుచుండిరి. రాయబారమును జూడ నరుదెంచిన పౌరులు తాళ్వారముల నిండియుండిరి. ఇంకను గార్యక్రమము మొదలిడలేదు. రాజచంద్రుఁ డింకను సభ నలంకరింపలేదు. సభాసదులు రాజాగమనమును నిరీక్షించుచుండిరి.

అంతలో "జయ మహారాజాధిరాజ! జయ సార్వభౌమ!" యని వందివాక్యములు వినఁబడెను. వెంటనే జయజయ ధ్వానములు సభాంతరాళము నిండెను. మహారాజు సభ నలంకరించెను. కాషాయాంబర ధారియు, మహాతేజస్వియు నగు చాణక్యాచార్యుం డాతని వెనువెంట

నచ్చెను. చాణక్యుఁడు ప్రత్యేక పవిత్రాసనము నలంకరించెను. కరతాళ ధ్వనులు నింగి మాఱుమ్రోయ, రారాజు మయూర సింహాసనము నధిష్ఠించెను.

సందడి చల్లారినంత గాయకులు లేచి నాంది శ్లోకములు చదివి సభావిదితము గావించిరి. ఎల్లరచూపులు రాజచంద్రుని మోమునందు నిలిచియుండెను. సార్వభౌముఁడు రాయబారులఁ జూచి "గ్రీకురాయబారులారా మీ ప్రభువరేణ్యునకు, శెల్యూకేశ్వరునకుఁ గుశలమా?" యని వారల హెచ్చరించుకొనెను.

పాత్ర:—మహారాజా! భగవదనుగ్రహమున మా సార్వభౌముఁడు కుశలియే.

చంద్ర:—మీకును గుశలమా?

మెగా:—రాజమార్తాండా! అభేద భావమునను నాటపట్టగు భవద్దేశమున మాకుఁ గొఱఁతయుండునా?

చాణ:—ఇఁక మీ రాజేంద్రుని సందేశము వినిపింప నగు.

పాత్ర:—(లేచి) అవధారు. భారత సార్వభౌమా! అరిందముఁడు శ్రీ అలకసుందర మహాచక్రవర్తి, నెత్తురు వెల్లువలు ధారవోసి, పాంచాల పర్యంతము భారత రాజ్యమును గైవసము చేసికొని, కార్యాంతరమున స్వదేశమునకుఁ జని యచట పరమపదించు టాదిగాఁగల విషయములు మీకు వినిపించుట చర్వితచర్వణ మగు. ప్రభువులేని

తరుణముంజూచి పాంచాలమును మీ రాక్రమించుకొంటిరి. ధర్మైకదీక్షాపరు లగు రాజుల కిది తగదు. ధర్మమునకుం గట్టుబడి మా రాజ్యమును మా కప్పగించి, అపరాధ ఫలముగా మీరు మాకు సామంతరాజులై యుండవలసినది. ఇది మీకు సమ్మతమేని యుభయపక్షములకు శుభమగును.

మెగా:—రాజేశ్వరా! దూతలకుం బక్షపాతము గాని, ప్రాణభయముగాని తగదు. కలరూపు తెలుపుట వారి ధర్మము. వాయునంద వాసుదేవాదుల రాయబారములు మీ పురాణగ్రథితములు మీకుం గ్రొత్తగావుగదా! గ్రీకురాజ్యం బగు పాంచాలమును మీ రాక్రమించుకొనుట ధర్మముగాదు. మా రాజ్యమును మా కప్పగించి యాత్మహిత మొనర్చుకొనుడు. నేడుసుత మా విధించు కప్పమును మీరు చెల్లింపవలయును.

చంద్ర:— ఇదేనా మీరాజు పంపిన సందేశము?

పాత్రి:—ఇది యొల్లరేని, యుద్ధమునకు సిద్ధపడవలయును.

చంద్ర:—గ్రీకు రాయబారులారా! మీ సందేశము మాకు నవ్వుం దెచ్చుచున్నది. అలకసుందరుని చావుతోడ పాంచాల మరాజకమయ్యెను. శెల్యూకేశ్వరున కది యెట్లు ప్రాపించెను?

పాత్ర:—ఆత్మ భుజాబల సముపార్జితమును దానిని అలకసుందరుఁడు శెల్యూకేశ్వరుని యాధీనము గావించెను.

చంద్రా:—గ్రీకువర్యాయు సెల్యూకేశ్వరసాక్షీనయు నను పాంచాల రాజ్యలక్ష్మిని భారతీయులు మజుల నాక్ర మించు తఱి మీా సెల్యూకేశ్వరుం డెందుండెను ? నాఁ డాతని బహుబలపరాక్రమాటోపము లేమూల డాఁగి యుండెను ?

పాత్రి:—సెల్యూకేశ్వర చక్రవర్తి యిప్పుడు బాబి లాను నగరమం దుండెను. హైందవుల దుండగము వినియు, మా రాజు కార్యాంతర ప్రసక్తి, వెంటనే హిందూదేశ మునకు రాఁజాలఁ డయ్యెను. ఎదురైపోరి జయించుటం గదా మగతనము. మీా సేత దొరలేని యింట దొంగ జొచ్చు టగా నున్నది.

మెగా:—సార్వభౌమా ! అతివిస్తర మేల ? ఒండు రెండు మాటల మీా నిశ్చయమును దెలుపుఁడు.

చాణ:—గ్రీకు రాయబారులారా ! దొఱికిన దానిని దాఁచుకొనలేక పోఁగొట్టుకొని, యిట్లాడుట వెఱ్ఱితనము. రాజ్యములు వీరభోజ్యములు. నాఁడు మీా యేలిక వశమైన నేఁ డది మా వశమైనది. పాంచాల మాగంతుకమే గాని మీాకుఁ బైతృకము గాదు.

పాత్ర:—మీా వాక్యములు సమరసన్నాహద్యోతకము లుగా నున్నవి. నాయమాహా సరియేనా ?

చాణ:—సార్వభౌమా ! తగినజవాబిచ్చి వీరినంపనగు.

చంద్ర:—అయిన, యవనరాజ సందేశహారులారా ! మా ప్రతిసందేశము వినుఁడు. దురాశాపాశబద్ధుఁ డగు

మీ రాజేంద్రుని యిష్టము ననువర్తింప నోపను. వస్తుసంపాదనమునఁ బోలెఁ దద్రక్షణయందును జాగరూకత వలయు. ఆత్మాపరాధము నన్యులపై మోపరాదు. పాంచాలము భారతీయుల సొత్తు. భారతీయుల నాఁటి పరస్పర వైషమ్యమును సందుగొని, పాంచాలమును మీ రపహరించితిరి. అపహృతమును భారతీయులు నేఁడు చిక్కించుకొనిరి. ఇందలి ధర్మాధర్మములు మీరే యూహింపుఁడు. ధర్మవిరుద్ధంబగు నిట్టి ప్రయత్నమునుండి మీ ప్రభువు విముఖుఁడు గాకున్న, యవనహైందవ వివాదము రణాంగణమునఁ గాని పరిష్కారము గాఁజాలదు!

పాత్రి:—రణక్రీడోల్లాసము యవనులకుఁ బాలతోడఁ బట్టినది. కాలగతిం జేసి మీ కీ తలఁపు గలిగెను. బుద్ధి కర్మానుసారిణిగదా!

చంద్రి:—బిందుసారా! ఈ గ్రీకు రాయబారులను సముచిత సత్కారముల మనయెల్లఁ దాటింపుము. రాయబారులారా! సెలవు గొండు. సమరభూమిని మీ దర్శన మగుఁ గాక!

రాయబారఁపు బర్యవసానముగా యుద్ధము నిర్ధారితమైనది. రాయబారుల బిందుసారుఁ డనుగమించెను. సార్వభౌముఁడు సింహాపీఠి నవరోహించి చనియెను. అంతతో నాఁటిసభ ముగిసెను.

# తొమ్మిదవ పరిచ్ఛేదము

## స్వీయ చరిత్రము

'రమణీమణీ! గ్రీకులవలన పారతంత్ర్య కూపమునఁ ద్రోయఁబడిన నాకు నీ వెలనవ్వు కరదీపిక యయ్యెను. మృత్యుముఖమునుండి నన్నుఁ గాపాడిన నీ యుపకారబుద్ధి మిగులఁ బ్రశంసనీయము.'

'రాజశేఖరా! నే నంతటి సన్నుతి కపాత్రురాలను' సపర్యాభాగ మొదవుటంజేసి కృతార్థమైన యీ మంద భాగ్యురాలి ప్రణామసహస్రము లివే గ్రహింపుఁడు.'

'తిలోత్తమా! నీవు చెంతనుండుట నా కెంతో హాయిఁ గూర్చును. ఈ విపదబ్ధియందు నీవు నాకుఁ దరణి వలె నున్నావు. నీ యుదంత మింకను దాచెద వేల?'

'రాజకంఠీరవా! గతస్మరణ మాత్రమున నా హృద యము తపించుచున్నది. ఈ దీనురాలిని మన్నింపుఁడు.'

'నీ చారిత్ర మంతటి దుఃఖమయమా?'

'నేను మిగుల దురదృష్టవంతురాల. ఇఁక నాచరిత్ర మెటు లుండును? ప్రచండానిలముచే శాఖాపల్లవ పుష్పవిహీ నమై ప్రోడై నిల్చియుండు పాదపమువలె, నీ నిర్భాగ్యురా లీ ప్రపంచమున ననపయై, జీవచ్ఛవమై యున్నది.

పాపము తిలోత్తమ హృదయవారిధియందు చింతా మందరము తిరుగుచుండెను. మథన వేగమునఁ జెదరిపడు తుంపురుల పగిది, నశ్రుధార లామె నేత్రములనుండి పడుచుండెను. వ్యసనభర మామెను మాటలాడ నీయలేదు. చిత్తరువుఁబోలె చైతన్యవిహీన యై ప్రక్కఁ నిలిచియుండు తిలోత్తమను గాంచి, మలయకేతువు నిర్విణ్ణుఁ డయ్యెను. పాన్పుపైనుండి యాతఁడు లేచి యా కుటిలాలకను డాసి 'తిలోత్తమా! ఆపదలకు లోంగరాదు. శోకాగ్నిని వివేక జలంబులఁ జల్లార్పవలయు. కమనీయగుణోపేత వగు నీ వెందులకుఁ గుందెద' వని తన చేలాంచలమున నామె కన్నుల నద్దుచు, చెక్కిళ్ళపైఁ బ్రవహించు నశ్రుజలములఁ దుడువ సాగెను.

పరపురుషసంస్పర్శనముచే రోమాంచకంచుకితశరీరయై తిలోత్తమ యాతనినుండి తప్పి యొదిగినిల్చి మందస్వరమున 'ఆర్యపుత్రా! నా కన్యాత్వము రక్షణీయము. ఈ పాతకిని దాకి పతితులు కావలదు' అనియెను. ఆమె విశుద్ధచారిత్రమున కాతఁ డచ్చెరు వందుచు, నిశ్చలుఁడై నిలిచెను. అనిర్వాచ్య మగు భావ మొండు వారిహృత్తలముల నుద్భవించి, వారల నానందసామ్రాజ్యసీమలఁ ద్రిప్పసాగెను. తిలోత్తమ కన్నులఁ దుడుచుకొనుచుండెను.

మలయ:—తిలోత్తమా! ధైర్య మూనుము. ఆపదలు మానవులకుఁగాక మ్రాఁకులకు వచ్చునా? కష్టసమయములఁ దోడునీడయై నిలిచి, యుపచరించిన పుణ్యావృత్తను

ని న్నిప్పుడు బాష్పాకులనయనగాఁ జూచి నాకెంతో మనసు కుందుచున్నది.

తిలో:—నా జీవనతరణి యీ విపత్సాగరమునుండి దరిచేరఁబోదు. ఇట్టి పాపాత్మురాలికిఁ దొలిబాముసందలి సుకృత లేశంబునఁ గాఁబోలు మీ సేవ యబ్బెను. ఇదియే నాకుఁ బదివేలు.

మలయ:—సుందరీ! భగవత్సంకల్పములు దురూహ్యములు. ఆతని లీల లనంతములు. ఊరడిల్లుము. తిలోత్తమా! సుకుమారమగు నీ హృదయము శోకాగ్ని మఱఁగుటకుఁ గారణ మేమి?

తిలో:— మీ యమృతమయభాషణములచే నాసంతాప చారిత్రము దొంతర దొంతరలుగా దుమికి వచ్చుచున్నది. చెప్పక తప్పదు భూమీశా! నాది ఉజ్జయినీపురము. నే నొక క్షత్రియాంగనను. మా జనకుఁడు రాజాస్థానమున నున్నతపదవి నాక్రమించి యుండెను. మా తలిదండ్రులు నన్ను గారాబముతోఁ బెంచుచుండిరి. వారి కనుల యెదుట నే నల్లారుముద్దుగా నాడుకొనుచుంటిని. నన్నుఁ జూచుకొని వారు ఏడొకదినముగా గడుపుచుండిరి. అప్పుడు దేశమున నొక ప్రళయమారుతము వీఁచెను. గ్రీకు సార్వభౌముఁడు అలకసుందరుఁడు హైందవ భూమిపై దండెత్తి వచ్చెను. ఐకమత్య విహీనులై యుండు హైందవోర్వీనాథులాతని దండనీతి కెఱ కాసాగిరి. క్రమ క్రమముగ వారి రాజ్యము లన్నియు నా గ్రీకు వీరుని హస్తగతము లయ్యెను.

మా పురమును, రాజ్యముకూడ నట్టి యవస్థనుండి తప్పించు
కొన లేదు. శూరమ్మన్యుండగు మా ప్రభు వాతనిధాక కాగ
లేక కాలికి బుద్ధిఁ జెప్పెను. పట్టణమం దరాజకత ప్రబలెను.
అంతయు నల్లకల్లోలమునకు లోనైపోయెను. చేతి కడ్డులేనందున
గ్రీకుసైనికులు గృహములను గొల్లఁగొట్టమొదలిడిరి.
పతివ్రతాశిరోమణులగు భారతనారీమణులు మాన సంరక్ష
ణార్థము ప్రాణములఁ గోల్పోవుచుండిరి. గ్రీకులు కొందఱు
మా యిల్లు చొచ్చి, తల్లి యొడిలోని ముద్దుల బిడ్డను నన్ను
లాగి వైచి, ఆమె మానము నపహరింపఁ గడంగిరి. మా
జనకుఁ డప్పు డింట లేఁడు. మానధనయగు నాతల్లి వారి
నెంతయో బతిమాలెను. ఆ దీనోక్తులను వారు పెడచెవిఁ
బెట్టిరి. అంత నామె కత్తిఁ జేకొని వారి కంధరముల నఱుకు
మాడ మొదలిడెను. ఆ మల్లరమున నాతల్లి యసువులు
పోయెను. గ్రీకులు మాయిల్లు గొల్లఁగొని చనిరి. నే నచట నే
రోదన మొనరించుచుంటిని. పురమునం దెక్కడనో ప్రజా
సంరక్షణోద్యోగతత్పరుం డై యుండిన మా తండ్రిని
నాయాక్రందనధ్వను లాకర్షించెను. ఆయన వచ్చి, నా స్థితిని–
నా తల్లి గతిని– మానిలయ ముందు రీతిని– జూసెను. తోడనే
యాతనికి మతిచెడెను. న న్నెత్తుకొని యాతఁడు వనాంతరము
లకుఁ బరుగెత్తెను. నే నాతని చంకయందే కూర్చుండి,
యాఁకట వెక్కి వెక్కి యేడ్చుచుంటిని. నా తండ్రి నన్ను దించి
ముద్దిడుకొని యెచటికో వెడలిపోయెను. అదియే యాతని
కడసారి ముద్దు. కొంతసేపటికి గంగాజలముల 'గభీ' లను
శబ్దము కలిగెను. మాతండ్రి యామహాతల్లి గర్భమునఁ

జొచ్చె నని గ్రహించితిని. అదియే నా కాతని యంత్యసందర్శనము.

తిలోత్తమకు దుఃఖము పైకొనెను. మాట రాలేదు. అశ్రువులు ధారలు గట్టి కపోలదర్పణంబులఁ బడి ప్రవహింప నారంభించెను. దృష్టి జడత నొందెను. ఆనాఁటి దృశ్య మామె కన్నులకుఁ గట్టినటు లుండెను. మలయకేతువు 'తిలోత్తమా! ప్రసన్నవు'మని పెక్కుసారు లనునయించెను. ఎట్టకేలకు తిలోత్తమ తెలివొంది 'రాజేంద్రా! నాయుదంత మతిశోకమయమై, కరుణావహమైన దని చెప్పితిని. మహాపాతకులచరిత్ర యట్టిదే గద' అనెను.

మలయ:— తిలోత్తమా! ఆ పసికందు గతి యే మయ్యెను?

తిలో:— అప్పు డీ శైల్యకేశ్వరుఁడు సార్వభౌమపదవి నందియుండలేదు. అలకసుందరునికడ నీతఁడు సర్వసైన్యాధిపతియై యుండెను. దైవవశమున నాతఁడు నే నుండు నరణ్యమధ్యమునఁ బోవుచు నాపరిదేవనము నాలకించెను. నన్నుఁ జూచినతోడనే యాతనిమెద జాలిపుట్టెను. అనపత్యుం డగు నాతనికి నాపై వాత్సల్య ముదయించెను. నన్నుఁ దనవెంటఁ దీసికొనిరాఁ దన యనుచరుల కానతిచ్చెను. నాఁటనుండి న న్నా దయాసాగరుఁడే సాఁకి సంతరించుచున్నాఁడు. నే నాతనియింట నడుగిడిన కాలవిశేష మెట్టిదియో కాని, వారి సంసార మప్పటినుండి పాలవలె పొంగసాగెను. కాలక్రమమున నాతఁడు గిరిక సింహాసనము నాక్రమించి చక్రవర్తి

యయ్యెను. ఒక కుమారుఁడు నొక కుమారిత యాతనికిఁ బుట్టిరి. పరమకారుణికుఁ డగు శైల్యూకేశ్వరుం డిప్పటికిఁ గూడ నన్నుఁ దనజ్యేష్ఠకుమారిగా భావించుచున్నాఁడు.

మలయ:—తిలోత్తమా! నీ వదృష్టవంతురాలవు. రాత్రిందివములభంగి కష్టసుఖములు చక్రగతిఁ దిరుగుచుం డును. నీ సాహచర్యముచే నా కనంత మగు సంతసము కలుగుచున్నది. భైరవుని యుదంత మేమి?

తిలో:—భైరవుఁ డమాయికుఁడు. ఆశాభూత మాతని నీ విధమున నాడించుచున్నది. ఆతని ద్రోహబుద్ధికై నేను దుఃఖింపని దినమే లేదు. యవనేశ్వరునకు సాయము సేయు తలంపున నాతఁడు పెద్ద కాలమునుండియు, గ్రీకురాజధాని బాబిలాను నగరమునకు రాకపోకలు సాగించుచుండెను. అట్టి యెడ హైందవయువతి నగు నాయెడ నాతని కకారణవాత్సల్య మొదవెను. న న్నాతఁడు మిగుల గౌరవముతో నాదరించు చుండును. 'కుమారీ' యని పిలుచుచుండును. నా కాతనియం దద్వితీయమగు భక్తిభావ ముదయించెను. ఈ సమయమున, మౌర్యసార్వభౌముని కోపానలమునకు శైల్యూకేశ్వర భైరవ నాయకు లాహుతి కాకుండునటులఁ జేసి, హైందవ విజయ మొనఁ గూడునట్లును, యవనుల కపజయ మొనఁగూడ కుండు నట్లును జేయవలయునని నాయాశయము.

మలయ:—తిలోత్తమా! శైల్యూకేశ్వరుఁడు రాజ్య మదాంధుఁడనియు, భైరవుఁడు దుర్మార్గశిఖామణియనియు

నీ వెఱుంగనిదానవు కావు. అట్టివారలకు నీవు సాయమొన రింపరాదు. పామునకుఁ బాలుపోయ విషవృద్ధి యగును. దావానలమునఁజిక్కి దహించఁబడు దందశూకమును దప్పింపఁ బ్రయత్నించిన, నది కఱవక విడుచునా? నైజము దప్పింప నేరికి సాధ్యము?

తిలో:—రాజనరేణ్యా! నాయాశయము ఫలించునని నా విశ్వాసము. ఫలాఫలములలో నిమిత్త మనవసరము. శాశ్వత శాంతి సౌధ నిర్మాణ మొనరింపవలయు ననియే నా యీప్సితము.

మలయ:—అబలవుకావున, నీకిట్టికోరికయుండుట సహజము. నీయమాయికత్వమునకు నాకు నవ్వువచ్చుచున్నది. పామైనను జావవలయును, బడితెయైనను విఱుగవలయును. దురాశాపాశబద్ధులగు శాత్రవనాయకు లిరువురు సప్రాణులుగా నుండుట; హైందవవిజయము సమకూడుట యీరెండు పరస్పరవిరుద్ధములుగదా!

తిలో:— పరస్పర విరుద్ధముల సమర్థింతునేని నా నిర్మించు శాంతి సౌధము చిరస్థాయిగా నుండఁగలదు. ఏనాఁ డిట్టి పరిస్థితు లొనఁగూడునో, యానాఁడే యీ యబల బుద్ధి మదగ్రిగణ్యా యని మీరెఱుంగఁగలరు.

మలయ:— (నవ్వుచు) అప్పుడు నీవు సబలవుగాక, అబల వెట్లయ్యెదవు! సకల రాజ సమ్మాన్య వయ్యెదవు! నీకృతజ్ఞతా కార్యనిర్వాహణమునకును, నీమాతృపాదారవింద సంసేవనమునకును, నీయుపకారబుద్ధి విశేషమునకు ననంత

ఫల ముండితీరును. అయినఁ దిలోత్తమా ! యవనహైందవ సమరము జరుగదా?

తిలో:—ఎందులకు జరుగదు? ఱేపో మఱునాఁడో భారతీయులు రా నున్నారు. కాని యుద్ధమునకుఁ గాలవిలంబము గలుగకమానదు. మీరు మౌర్యునకు సాయము చేయవలయును.

మలయ:— వైరిహస్తములఁ జిక్కి కారాగారబంధితుఁడనై యుండు నేను మౌర్యున కెట్లు తోడ్పడఁగలను?

తిలో:— బంధనిర్ముక్తుని జేసెద. స్వాతంత్ర్యము గూర్చెద.

మలయ:—అట్టిది శూరమ్మన్యులకు సమ్మతమగును. నాబోం ట్లిచ్ఛగింపరు. సింహగుహాంతరాళము చొచ్చితిని. దానిని జంపుటో నేను జచ్చుటో, రెంట నొకటి సిద్ధము.

తిలో:—ఉభయులకు క్షేమమగుఁగాక! ఇఁక నాకు సెలవు.

అని యామె బిరబిర వెడలిపోయెను. 'తిలోత్తమా! మఱల నెప్పుడు వచ్చెద?'వని యాతం డామెను హెచ్చరించుకొనెను. ఆమె కాతనిపిలుపు వినఁబడియెనో లేదో తెలియదు.

తిలోత్తమ దీనచారిత్రమునకును, రూపసౌందర్య సౌకుమార్యములకును, సుగుణసముచ్చయములకును నాతఁడు విషాదాశ్చర్యము లందుచు నేమియో యాలోచించుచుండెను.

—...—

# పదియవ ప్రకరణము

## దూత్య సంఘటనము

ప్రపంచమునందు ప్రతికార్యమునకుఁ బ్రాయికముగాఁ గామినీకాంచనములు బీజములై యుండును. ఎట్టి విచక్షణుఁ డైనను మోహపిశాచవాగురయందుఁ దగులుకొనినచో మతిని గోల్పోవును. మధువు కొఱకు మక్షికములు చేరి యందుండి వెడలలేక పరితపించునటుల, కాముకులు మోహ వారాశియందు మునిఁగి దరిగాన ననేకపరికరముల వెదకుచుందురు. మోహావేశపరవశుఁ డసత్యములకుఁ బుట్టినిల్లు. అప్రమాణములకుఁ బట్టుకొమ్మ. అధర్మముల కిక్క. మోహము చాల చెడ్డది. దాని బారిఁబడనివారు ధన్యులు, ధన్యతములు. ఎక్కడ సౌందర్యవిలాసము లుండునో, ఆ నెలవును దన కాశ్రియ మొనరించుకొని, తా నావేశించియున్నవానిని గ్రిందు మీఁదుఁ జేయుచు, వాని ననేకరీతుల నా మోహదేవత యాడించుచుండును. మోహమువలనఁ గలుగు ధైర్యము మఱి దేనివలనఁ గలుగదు. మోహసామ్రాజ్యమునఁ బయోధి పిల్ల కాల్వ యగును; భీకరభుజంగము పుష్పమాల యగును; భయంకర కృశానుకీల శీతలాంబుధార యగును. మోహమున కంతటి శక్తి కలదు.

ఎప్పుడో, యేసమయముననో, పాత్రకులుని మానసము రాజకుమారి హేళినిపై వ్రాలెను. నిరంతరసాన్నిధ్యముచే నా మోహలత పెరిగి, రాజకుమారీరూప మహీజమును బెనఁగొనుచుండెను. సర్వకాల సర్వావస్థలయందును

త్రిలోక మోహనంబగు నా రాజకుమారి కళ్యాణ రూపము నాతఁడు తలంచుకొనుచు, నిర్భరానందము నందుచుండెను. హేళిని పవిత్రనామాక్షరత్రయము నాతఁడు స్వర్ణమయముగఁ దనహృత్ఫలకమునఁ జెక్కుకొని, నిరంతరము తన్నామపఠనముచే—విలోకనముచే—నపారపారవశ్యమునకు లోనగుచుండెను. హేళిని సౌఖ్యమే తనసౌఖ్యమనియు, హేళిని సంతోషమే ప్రపంచసంతోషమనియుఁ దలంచి యా నారీరత్నము నానందపఱచుటకై యెట్టి ఘనకార్యమునైన, నవలీలఁ గావింప సంసిద్ధుఁడైయుండెను. మోహితు లాత్మసౌఖ్యవ్యయమున నైనఁ దమ ప్రియురాండ్రమనసున కెక్కు, వర్తించుట సహజముగదా!

పాత్రకులుఁడు నిండు యువకుఁడు; అతులిత బల పరాక్రమ సంపన్నుఁడు; కాని భీరుజన శిఖామణి యగుటకుఁ దోడు, సమర విద్యా గంధ శూన్యుఁడు. పురాకృత పుణ్యవశమున నాతనికి సర్వసైన్యాధిపత్యము లభించెను గాని వేఱు గాదు. అంత రూపరి కాకున్నను, సురూపులలో మాత్రము చేర్చుకొనఁ దగినవాఁడు కాఁడు. అంతటి రూపలేశమునకే కాఁబోలు! సురారమణి యాతని నెల్లకాలమెడఁబాయక, తన స్నేహముచే నాతని నానందింపఁజేయుచుండును. పాత్రకులుఁడును దనకై తాను వలచివచ్చినవనిత యని చులకనసేయక, యా మధుదేవిని మిక్కిలిగా నాదరించుచు నామెచెలిమిభాగ్యమున సంతోషాంబుధి నీదుచుండును.

ఒకనాఁటి సాయంసమయమున, నాతఁడు తన గుడారమునఁ గూర్చుండి ప్రియస్నేహితుఁ డగు మిహిరునితో మాటలాడుచుండెను. మిహిరుఁడు భారతీయుఁడు.

పాత్ర:—మిహిరా! అనుకొనినంత యైనది. యుద్ధము నిశ్చయమైనది. అనతికాలములో భారత చమూ సమూహ మరుదేరఁగలదు.

మిహి:— సంధికొడంబడమి, భారత సార్వభౌముని ప్రమాదమని నా యభిప్రాయము. స్వపరబలంబులు నించుక యైన గమనింపక వారు రణావని కుఱుకఁ బ్రయత్నించుచున్నారు.

పాత్రి:—నిజము. ఒక్క యవనాంగన, పెక్కు భారత వీరుల నుఱుమాడఁగలదు. అట్టియెడ మాఁబోఁటి బాహుబల సంపన్నులతోఁ గయ్యమునకుఁ గడంగుట బాగునదుటకా?

మిహి:—ఏమీ? యవనకామినులంతటి వీరకాంతలా?

పాత్రి:—మిహిరా! తినఁబోవుకూరాకురుచి నడుగుటేల? రాజకుమారి హేళినికూడ, కైదువుఁగొని రణరంగ విహార మొనర్పనున్నది. అట్టి సుదతీమణి సమక్షమున వైరి కరగ్రహణముతోఁ బాటు, యా తలోదరి పాణిగ్రహణ మొనరించుకొంటె, నాబోఁటి చమూపతికిఁ గామితం బేమి కలదు?

మిహి:—(నవ్వుచు) హేళినిమెప్పఁ బడయుటకై బవరమునఁ బాల్గొనుచున్నావా?

పాత్ర:— అదియు నొక కారణముగా నుండవచ్చును. నన్నుఁ బెండ్లాడ నామె యెట్టి యాటంకము నింత దనుక సూచింపలేదు. రాఁగలసమరమున నామగఁటిమి మెచ్చి యించి యమ్మత్తకాశిని చిత్తముఁ గొందును.

మిహి:—మిత్రమా! నీయోచన కడుంగడు సమంజసముగా నున్నది. రాజకుమారియే నిన్నుఁ బరిణయమూడ నిష్టపడిన, నీ వఖండైశ్వర్యవంతుఁడ వయ్యెదవు. మాయట్టి వారల కప్పు డదృష్టభానూదయమగును.

పాత్ర:—అవును. రాజకుమారి వెనువెంటనే, యవన రాజ్యరమయు నాయంకతలము నలంకరించును.

మిహి:—నిజముఁ బల్కితివి. నేను నదియే చెప్పఁ బోవు చున్నాను. భారతదేశమును జయించిన తర్వాత, సెల్యూకేశ్వర చక్రవర్తి మరల బాబిలాను నగరమునకుఁ బోవును. ఆతని ప్రతినిధిగా హిందూదేశమును నీ వేలుదువు.

పాత్ర:—ప్రాతినిధ్య మనునది మాటమాత్రమునకే కాని, నిజముగా సర్వాధికారము నాయదియేకదా! అదేలనో కాని, హైందవసీమ గ్రీకుహస్తగతమగుననియు, పాత్రకులుఁడే మున్ముందు భారత సార్వభౌముఁ డగుననియు, హేళినీరమణి తప్పక యాతని జేపట్టితీరుననియు నాకుఁ దోఁచుచున్నది. ఆ విషయసంస్మరణ మాత్రముననే, నా మానస కాసారమునం దానందవీచికలు పొంగి పొరలు చున్నవి.

సింహి:— ఏలనో యేల? అంత సందియ మెందులకు? రాకుండు సుఖదుఃఖముల ఛాయలవలెనె ధృతియు, భీతియు హృదయమునఁ బొడగట్టుచుండును. ఇంతకన్న నిశ్చయముగ నన్నుఁగూర్చి హేళిని కెక్కడ లభింపఁగలదు! నామనసుపోవునంత వఱకు కట్టివాఁడెచటఁగాని కాన్పించుటలేదు. అటులఁగాక, యా రమణి నిన్నుఁగాదని యితరుని గామించిన, సత్యసంకేత భక్త్యముల వాసలఁద్రోసి, మొఱపుఱానేల దున్నుటకుఁ బోయిన మహాఘనునివలెఁ బట్టును. కావున, నీ వేమాత్ర మిందు సందియమందఁ బనిలేదు. కాని, ఒక్కమాట మాత్రము గలదు. కార్యసానుకూలతకై, భారము నంతటిని భగవంతు నిపై వేయక మానవప్రయత్నముకూడ నుండవలయును. నీ యభిమత మామె కింతకుముం దెప్పుడైనఁ దెల్పితివా?

పాత్ర:— అంతమాత్రి మా విదుషీమణి గ్రహించి యుండదా?

సింహి:— అటు లెన్నటికిని దలంపకుము. మానినుల హృదయము మిగుల యగాధము. వారి నిజాభిప్రాయము నెఱుంగుట కెట్టివారును జాలరు. ఇట్టి విషయములలో దూతిక నిక్కలి కార్యకారిణి, మిగుల యవసరము. కాని యా కుం టెనకత్తె యీ రహస్యమును గాపాడునటు లుండవలయును. ఇటుల నీవు హేళిని యభిప్రాయము నెఱింగిన బాగు.

పాత్ర:— ఇదియు నొకమార్గము. కాని యెటుల నెఱ వేఱును? అట్టివా రెవ రున్నారు?

మిహి:— అట్టి యెడకత్తె యెవరో తగదు. ఆమెకు హేళినికడఁ జన వుండవలయును. ఆమె గీఁచినగీటును, హేళిని దాటన ట్లుండవలయును. ఆమెకడ నీసంగతిని గోరంతలు గొండంతలుగా నుతింపవలయును. ఒకవేళ రాజకుమార్తెపై మన స్యము చూపినను గ్రమంబుగా నీయెడఁ బ్రసన్నురాలు గాక మానదు.

పాత్ర:—సరియే! అట్టివా రెవరున్నారు?

మిహి:—నాకుఁ దెలిసినంతవఱకున కట్టియాంతరంగికు రాలు హేళిని చెలి తిలోత్తమకంటె వేఱొక రగపడుటలేదు. కాని యామె యిందుల కే మనునో?

పాత్ర:—మిత్రమా! సర్వసేనాధిపతి కోరునట్టి యీ స్వల్ప సాహాయ్య మామె నిరాకరించునా?

మిహి:— అటులైన సుఖపడఁగలదు. ఈమా టామె నా కగపడిన, నీ సంగతిఁ జెప్పి నీకడకుఁ బంపెద. ఆమెను నీవు కడుజాగరూకతతోఁ బట్టుకొని రావలయును. "ధనమూల మిదం జగత్" అని పెద్దలు చెప్పిరి. కార్యము సానుకూలము కాకపోదు.

అప్పటికి సూర్యుఁ డస్తమించెను. అంధకారము జగ మంతయు వ్యాపించెను. మిహిరుఁడు తన శిబిరమునకుఁ బో యెను. ఎప్పుడును మిహిరసందర్శనమునఁ బాత్రకులుని హృ దయసరోజము వికసించుచుండును. సూరి యగు మిహి రుని యమూల్యాలోచనాంశువులచేఁ బాత్రకులుని హృదయ కుహరమునందలి సందేహాంధకారచ్ఛాయలు పటాపంచలగు

చుండును. తిలోత్తమ తన కడకు వచ్చి, తన మతమును హేళిని కెఱింగించి, తన కార్యమును సానుకూల మొనరించునా యని యాతఁడు తహతహ పడుచుండెను తిలోత్తమను వెనువెంట పంపు మని మిహిరునకుఁ జెప్పకపోయితి నని పరితపించుచుండెను. క్షణములు హాయనములుగ, నిముసములు యుగములుగ నాతనికిఁ దోఁచుచుండెను. కామమునకుఁ గన్నులెక్కడివి? "ఈ రాత్రి వేగించుటెట్లు? తిలోత్తమ నాదండ కరుదెంచి, నా యీప్సితమును విని యేమనునో? కార్యసానుకూలము మిగుల దుర్లభ మనునా? అందని ఫలముల కఱ్ఱు చాప వల దనునా? నామనోరథ మొనఁగూడునా? నాహృదయాకాశమున హేళిని ప్రకాశించునా? మానసేందీవరము హేళిని యుదయముచే వికసన మొందునా? నిజముగా నా కంతటి భాగ్యమున్నదా? ... ... హేళిని నన్నన్నటికిఁ జిన్నచూపు చూడదు. మిహిరుం డనినటుల, రాజకుమారికి నన్నుఁబోలు వరుఁడు లభించునా? నిజముగా హేళిని నన్నుఁ గరుణించును.... ... ... ... ... కరుణించిన, నాఁడా కాంతాతిలకము పరిష్వంగ సౌఖ్యమునకై, ప్రమదోద్యానమునకు నేనుబోఁగా, నానాతిమిన్న నన్నుఁ జూచి, హర్యక్షమును గనిన హరిణిమాడ్కి యేలపరుగిడును? తన చిలుకపలుకుల నన్నలరింపక యటు లేల యదృశ్య యామెను?... ... ...అయ్యో! నే నెంత మందబుద్ధిని! నేనే యాతం డని యా మోహనాంగి కెటులఁ దెలియును? తెలిసి యుండిన, నిలిచి, నన్నాదరింపదా? ఆదరించి, నీ యభిమత మేమని నన్నుఁ బ్రశ్నింపదా? ప్రశ్నించి,

నా వాంఛిత మెఱింగి, తన కబ్బినభాగ్యమునకు కుబ్జి, తన కర పంజరమున నన్నొక కీరముగాఁ జేసికొనదా ? అంతయు స్వయంకృతాపరాధఫలము. గతజలసేతుబంధనములు గానా, కాముకకోటి యోచనలు! ”

అని పాత్రికులుం డనుకొనుచుఁ బరుండెను. ఉదయా స్తమయము విరామ మనునది లేక వివిధయోచనలచేఁ గలఁతఁ బాఱియుండిన యాతని మానసమున కెట్టి విశ్రాంతియు లేకుండెను. కార్యబాహుళ్య మతని నలయించి యుండెను. పరుండుటయే తడవుగా నాతనికి నిదుర వచ్చెను. వెంటనే స్వప్నములు పైకొనెను. అది యొక నిండు పూర్ణిమ రాత్రి. ఆతం డొక గుఱ్ఱము నెక్కి యెచటికో పయన మొనరించుచుండెను. ఆ వారువము దేవదత్త మగుటచేఁ గాఁబోలు, దానికిఁ దెల్లని ఱెక్క లుండెను. దాని యిష్టము ననుసరించి యది కొంతసేపు ఱెక్కలతో నెగురుచు, మఱి కొంత సేపు పరుగెత్తుచు, నింక కొంచెము సేపు మందగమనమునను నీ విధముగాఁ బోవుచుండును. ఒక్కసారి యది యున్నట్టుండి యంతరిక్షమున కెరిగెను. పాత్రికులుని దన మూపున మోసి కొని యది ఱివ్వుఱివ్వున నాకాశమున నెచటికో పోవుచుండెను. అటు లది యెంతయో కాలము పోయి పోయి యొక యుద్యానమున వ్రాలెను. ఆ యుద్యానము ఫలభారవినమ్ర పాదపరాజమండితమును, నానావిధ శకుంత సంతాన కలకలారావ బంధురము నై కన్నుల పండువుగా నుండెను. అం దొక్క సరోవరము-కంఠీరవ కురంగము లొక్క రేవున నీరముఁ గ్రోలుచుండెను. శశాదన పారావతము లొక్క

కులాయమున నివసించుచుండెను. ఆ పవిత్రోద్యానము శాంతి మయమును, స్నేహబంధురము నై యుండెను. పాత్రికులుఁడు సజ్జము దిగి, యుద్యానవన రామణీయకమును దిలకించుచు వనమధ్యమునకుఁ బోయెను. అచట నొక నికుంజమందు స్ఫటికశిలావేదికపై యువతీయువకు లిరువురు పరస్పరాలింగనములఁ జొక్కి మైమఱచి యుండిరి. తోడనే, పాత్రికులుఁడును నాగ్రహోద్రిక్తుఁడై యానికుంజమును డాయ, నా యువకుం డదలించి రోషతామ్రాక్షుఁడై యాతనిపైఁ బడెను. పాత్రికులుఁడు తప్పించుకొని పోవుటకై ఘోటకము నెక్కినుండ, నది రివ్వున వియత్తలమున కెగసి చూచుచుండఁగనే మాయమై పోయెను. యువకుఁడు పాత్రికులుని బంధించెను. తన్ను విడువఁ బాత్రికులుం డెంతయో వేడుకొనుచుండెను. ప్రాణభిక్షఁ బెట్టుమని యాతని నెంతయో బతిమాలుచుండెను. ఆతఁ డొక భీరువని యువకుఁడు గ్రహించి, దాసునితప్పు దండములో సరి యని తలంచి, యిరువురు సేవకులఁ బిలిచి 'వీనిని గ్రిందికిఁ ద్రోయుఁ' డని యాజ్ఞాపించెను. ఆ సేవకులనుఁగూడ ఱెక్కలుండెను. వా రాతని బాహుమూలములఁ జెరియొకరు పట్టుకొని పైకెగసి, యాతని నంతరిక్షమునుండి ధరణీతలమునకు విడిచిరి. పాత్రికులుఁడు దబాలునఁ గ్రిందఁబడెను. ఒడలు ఝల్లు మనెను. దేహమంతయు ముచ్చెమ్మటలు పోసెను. కన్నులఁ దెఱచిచూడ, నాతఁడు పాన్పుపైననే పరుండియుండెను. శిబిరమున నప్పుడే 'టంగు టంగు' మని పదునొకండు గంటలఁ గొట్టిరి. గుడారమునందు దీపము

బాగుగా వెలుఁగుచుండెను. అంతటను నిశ్శబ్దముగా నుండెను. కాని, గవాక్షముకడ నెవరో. తలుపును ఎక్కువ శబ్దము కానటుల మునివ్రేళ్ళతోఁ దట్టుచున్నట్లు లాతనికి వినఁబడెను. పాత్రికులుఁడు లేచి, కృపాణపాణియై, గవాక్షమును దెఱచి 'యెవ రచట?' అని యడిగెను.

'నేనుకదా తిలోత్తమను. మిహిరుం డేమైన నిచటి కరుదెంచెనా?'

తిలోత్తమను జూచిన వెంటనే, పాత్రికులుఁడు పట్టరాని ప్రమోదముతో 'తిలోత్తమా! రమ్ము. కూర్చుండుము. మిహిరుం డిచటికి రాలే' దనియెను.

'అట్లయినఁ బోయి వచ్చెద. కొన్ని యవసర కార్యముల విషయమై మిహిరునితో మాటలాడనలయును. ఆతని గుడారమునకుఁ బోయితిని. అందాతఁడులేఁడు. పోయివచ్చెద.'

'తిలోత్తమా! వచ్చినటులేవచ్చి పోయెద వేల? రమ్ము. కూర్చుండుము.'

'వచ్చుటకును, గూర్చుండుటకును నిది సమయము గాదు. ఇంతరాత్రిమున మనమిద్దఱము నొంటరిగా నుండిన, నలువు రే మనుకొనియెదరు! వచ్చినపేరు చచ్చినను బోదు. పోయి వచ్చెద.'

'తిలోత్తమా! అటు లెన్నఁటికిని దలంపకుము. నిన్ను నా సోదరినిగాఁ దలంచుచున్నాను. ఇన్నిదినములుగా నీవు

నన్నుఁ జూచుచున్నావు గదా! నా ప్రస్తుతము నీయుం చిం చుకమైన నర్తనముగా నున్నదా?"

"రామరామ! లేనిది యున్న దనుకొనుచుంటివి గ్రహచార మేమి వచ్చినది?"

"తిలోత్తమా! నాతోఁ బుట్టువునిగ నిన్ను నేను చూచుకొనునపుడు, నా సర్వస్వము నీ యది కాదా? అట్టి యెడ నీసోదరుని సౌఖ్యము నీయది కాదా?"

"సోదరా! నావలన నీ కేదైన నుపయోగముండిన ధన్యను గదా!"

"తిలోత్తమా! నా విషయమై మిహిరుఁడు నీ కేమైన జెప్పెనా?"

"లేదు. ఆతఁడు నా కగపడినఁ గదా!"

"నీకు నూఱేండ్లాయువు. అనుకొను నంతలో నీవే వచ్చితివి. ఆ కార్యము నీవలనఁగాని గా దనుకొనుచుంటిమి."

"వీరవరేణ్యులగు మీచేతఁగాని యే కార్యము నాబోఁటి యొకబోఁటిచేఁ గాఁగలదు? ప్రాణమానముల నొడ్డియైనను, నీ కార్యమును సానుకూల మొనర్చి, నీయెడఁ గృతజ్ఞురాలనుగా నుండుటకంటె, నాకుఁ గరణీయమును, ఆనందసంధాయకమును మ ఱేమి కలదు?"

"తిలోత్తమా! నా మనోవాంఛితమే నెఱవేఱవల యును గాని, నీ మేలును మఱువఁజాల?"

“అన్నా! నీ దయ యనున దొకటి యుండవలయును; గాక! నా కింకేమి కావలయు ?”

“తిలోత్తమా! హేళిని వింటుజన్నవిగదా! యువతు లవివాహితలుగా నెంతకాలమని యుండఁగలరు ?”

“సోదరా! నీ యభిప్రాయము నాకుఁ దెలిసినది. నీ మనోభీష్టితము నాకు విదితమైనది. ఈ యల్పవిషయమున కింత చింతయా? నీ వేమైన నాదని సందేహించుచున్నావా యేమి? నా చేతనైనంత ప్రయత్నించెద. పిమ్మట దైవ మున్నాఁడు. అన్నా! తలక్రిందుగఁ దప మాచరించినను హేళినీకాంతకు నీ యట్టి సర్వాంగసుందరుఁడు, వీర శిఖామణియు నగు వరుఁడు లభించునా? సర్వగుణసంపన్నుండగు పాత్రకుల సేనాధీశుని త్రిలోకైక మోహనాంగి హేళిని పరిణయ మాడిన మహారజతమున మాణిక్యము పొదివిన ట్లుండును. హేళిని నిన్ను వివాహమాడిన సౌఖ్య డోలిక నూఁగఁగలదు.”

“తిలోత్తమా! ఎట్లైన నీ కార్యము ఫలకారియగుట నీపై నున్నది.”

“మన చేతిలోని పనియా! సరియే. పోయి వచ్చెద” అని తిలోత్తమ వెడలిపోయెను.

---

# పదునొకండవ ప్రకరణము

## సమరసన్నాహము

'శ్రీ పాటలీపుర నివాసులారా! సముచిత పరివార సమేతముగా సార్వభౌమేంద్రుఁ డీ భానువారమున, మ్లేచ్ఛుల నెదిరింప జైత్రయాత్ర సాగించును. పౌరులెల్లరు యథావిధి సంతోషితస్వాంతులై, సేనానివహముల సాగనంపవలయునని రాజాజ్ఞ' యని యొక డాంఘికుండు తప్పెటను గొట్టుచు, పాటలీపుర వీధులయం దఱచుచుండెను. స్వకార్య వ్యగ్రులై యుండిన పౌరులు కొందఱా చాటింపును వినమింజేసి, మఱల నాతని నడిగి తెలిసికొనుచుండిరి. నిరంతర సందేహాయత్త చిత్తులగు మఱికొందఱు, వినియుం దమ్ముం దాము నమ్మంజాలక పొరపాటున దప్పుగ వింటిమేమో యను సందియముతో నాతనినుండి మఱల వినుచుండిరి. పూర్తిగాఁ దెలియనివారు జనుల యార్భాటమును, బిల్లల చెరలాటమును గాంచి 'ఏమిటిరా?' యని వానివలన వినుచుండిరి.

'మానినీమానాపహారు లగు యవనులు హతమగుదురు గాక!' యని పతివ్రతలు దైవప్రార్థనలఁ గావించుచుండిరి. అట్లే సునిశితమతులగు బాలురుకూడఁ బలుకుచుండిరి. 'బాలుర దీవనలు బ్రహ్మ దీవనలు' గదా! దుర్మదాంధీభూతచేతస్కులై అన్యాయమున కొండిఁగట్టి, నిరపరాధిని యగు భారత రాజ్యేందిరపైఁ గత్తిఁగట్టియుండు యవనరాక్షసులపై భూదేవోత్తములు శాపోదకములు విడుచుచుండిరి.

పాటలీపుత్రమునం దా దినమునుండియు నానంద ప్రవాహము వెల్లివిరిసి పోవుచుండెను. ఎక్కడఁ జూచినను వీరాలాపములు కర్ణగోచరము లగుచుండెను. ఎక్కడఁ జూచినను, యుద్ధయాత్రాసముచితాలంకార విలసిత గాత్రు లగు రణ వీరులు లోచన గోచర మగుచుండిరి. సజ్జిత శర శరాసన ధారులై యాశ్వికులు వీధుల వెంటఁ బచారొనరించు చుండిరి. ఏ యెడను బరమానంద సంగీత నిస్వనములు శ్రుతిగోచరము లగుచుండెను. అంతట నానందము సమాధి స్థిత యోగివరేణ్యుని హృదయముఁ బోలె, సర్వమును సంతోష సింధువున నోల లాడుచుండెను. ఆ సమయమునఁ బాటలీ పురమునఁ బ్రమోదము మూర్తిగైకొని, వీర రసము నందుఁ దోలఁకాడుచుండెను. సమర యాత్రా సూచక మగు భేరీ నినాదమును, సమరావసరములగు సకల విధా యుధములను గర్మాగారములందుఁ జేయుటచేఁ గల్గిన ఠణ ఠణా రావములును, గజేంద్రముల ఘీంకార నినాదములును, హయముల హేషారావములును పూర్వవాహిని యగు గంగాతరంగిణి తరంగకలకలారావమునఁ గలిసి, భూన భోంతరాళములనిండి లోకమును జెవుడ్పఱచు చుండెను. సద్యోవికసిత లతాంత తోరణావళులచేఁ దమ గృహద్వార ముల నలంకరించి, గృహిణులు తమ హార్షమును వెల్లిఁ బుచ్చు చుండిరి. చిత్రవిచిత్ర రంగవల్లికలఁ దమ గృహాంగణములఁ దీర్చి, బాలికలు తమ ప్రమోదమును

జాబుచుండిరి. విచిత్ర కేతువులపై 'జననీ జన్మభూమి శ్చ స్వర్గా దపి గరీయసీ' 'ధర్మ ఏవ జయతి' 'యతో ధర్మ స్తతో జయః' మొదలగు నుత్సాహకర నీతివాక్యములఁ జెక్కి, వానిని దమ సౌధాగ్రములఁ గట్టి, గృహమేధు లాత్మానందము ప్రకటించుచుండిరి.

సైనిక నికాయమంతయు సమరోత్సాహ సంకలితమై, ఎప్పుడెప్పుడు పరిపంథి వీర శిరముల తాళ ఫలముల వలెఁ బెకలింపఁ గొట్టు సమయ మబ్బునా, ఎప్పు డెప్పు డరాతి వీర రుధిరమును జవిఁగాంచు భాగ్యము తమ ఖడ్గాశీవిషముల కొదవునా యని యువ్విళు లూరుచుండిరి. సతులు తమ పతుల నుత్సాహ వాక్యములఁ బ్రమోదవార్నిధి నోలలాడించుచుండిరి. రణాంగణ విహార సముత్సుకుఁ డగు యోధయువకుఁడు, నవోఢ యగు తన ప్రియతో నేకాంతమున "ప్రేయసీ! రణాంగణమునకు ముదలయా?" యని ప్రేమ స్నిగ్ధముగాఁ బ్రశ్నించెను. అందుల కా వీరపత్ని యానంద బాష్ప ధారా సిక్త కపోల యై గద్గద కంఠముతో 'కాటుక కంటి నీరు చనుకట్టుపైఁ బడ' 'మనోహరా! మాతృదేశోద్ధరణమున కగు సంగ్రామరంగ విహారణము కంటె, నిజమగు శూరునకు భాగ్య మేమి కల' దని ముత్యములఁబోలు రదనపంక్తులు కాంతులీన మందహాస సుందర వదనముతో బదులాడెను. తోడనే, భీషణ విపక్ష సమక్షమునఁ గ్రోధ భీషణాకారమును దాల్చవలసిన యా యువకుని యాననాబ్జము, ఆ రమణీమణి యెదుట మోహనాకృతిఁ దాల్చి, పరమానంద భరితమై, విస్మయాంకురముల

కాలవాల మై పోయెను. వైరియెదుట నిశిత వీక్షణములకు నెలవులగు నాతని విలోకనము లిప్పుడు, శాంతి తేజస్స ముజ్జ్వలములై, మోహరస సమ్మిళితములై, ప్రమోదాశ్రు బిందువుల వర్షించుచుండెను. పరిపంథి వీర హృదయ విదారణ చణములగు భీషణహుంకారములకు బదు లాతని వక్త్రమునుండి మనోజ్ఞ మాధురీ రసస్ఫూర్జితము లగు మాటలు వెలువడుచుండెను. 'మోహనాంగీ! మనోహారిణీ! ఇఁక సెలవా!'' యను ప్రాణకాంతుని పల్కు నాలకించి యా కామిని యవ్యక్త మధుర భాషణముల నాతనిని 'విజయీభవ' యని తన సుంద రాపాంగ విలోకన కుసుమ మాలికల నలంకరించుచు వీడ్కొలిపెను. వీరపత్ని యను సార్థక నామము కల్గుఁ గాక యనియుఁ, ప్రాణకాంతుఁడు విజయవంతుఁడై సేమముగ మఱల నిలుసేరి తన కానందమును గూర్చుఁగాక యనియు నా వీరకాంత వేల్పులకు నతు లొనరించుచుండెను.

పురబాహ్యప్రదేశమునందలి విశాల సమతలమున నీదినమే, సైనికులందఱు చేరి తమతమ వాహినీ పతుల కెఱింగించుకొనవలయునని సార్వభౌముని యాజ్ఞ యయ్యెను. తదాజ్ఞానుసారము యోధులెల్లరు తమతమ నాయకుల కెఱింగించుకొని, తన్ముఖమున వాహినీపతికిఁ దమ్ముఁ దెలుపుకొనిరి. సమరభూమిని గావింపఁబోవు నతిమానుషక్రియలను జెప్పికొనుచు, వారొండొరు లానందించుచుండిరి. కదనమనిన వారికి కందుకకేళిగా నుండెను. ప్రతివీరుం డద్దాని నొక సామాన్య విషయముగా భావించుచుండెను. ఏలయన,

భారత సైనిక నికాయమంతయు, నిర్జితారాతి భుజబలయుత మహాబలమే దీనికిఁ గారణము. రణవిద్య వారికి వెన్నతోఁడఁ బెట్టిన విద్యయే దీనికి హేతువు. నిర్వక్రపరాక్రమోజ్జ్వలు లగు భారతీయులు సమరమునను వెనుదీయువారు కారు. అనాదినుండియు సంగ్రామభీములని కీర్తిని గడించిన భారతీయులకు, యుద్ధమనిన సంతోషజనకమైనది. ఓ భారత జనయిత్రీ! నీ వెంతసుకృతవతివి! నీకడు పెంత చల్లనిది! సహస్రవిజయులు, మాతృక్షేమంకరులునగు నీకుమారులను గనుటచే నీకుఁ గలిగిన సంతసమునకంతమున్నదా! ఏమి నీ భాగ్యము? అనవక్రవిక్రమధురంధరుం డగు గాంగేయుని గనిన నీకు—భువనైక పరాక్రమోపేతుఁడగు పార్థుని గనిన నీకు—విమతతమోభంజన ప్రతాపధురీణుఁడగు అభిమన్యుని గనిన నీకు—నిర్జితారాతినిబిడాంధకార ప్రతాపమార్తాండ మూర్తిని మౌర్యరాజేంద్రుని గనిన నీకు—సాటి యెవరు? శిష్టులరక్షింప, దుష్టుల శిక్షింప, భువిపై జననమంది, యఖండ విఖ్యాతి నార్జించిన శ్రీరామ కృష్ణులు నీ కుమారమణులు గారా! నీసుతు లగణ్యులు! తారల లెక్కిడ నెవరికి సాధ్యము! ఇసుము రేణువుల గణింప నెవరికి శక్యము! నీ భాగ్యమే భాగ్యము! నీపుణ్యమే పుణ్యము. అమ్మా! ఆ నీ యానందము భువిపై నాశశాంకతారకము మనియుండుఁగాక! భగవాను డిందుల కనుగ్రహించుఁగాక!

విధివిరామము లేక యుద్ధకార్యతత్పరులై యుండుటచే, సాయంకాలమున కంతయు సైనికులందఱు గుడారములఁ జేరి విశ్రాంతిఁ గైకొనుచుండిరి. రాత్రి తొమ్మిది

గంట లైనది. హిమాంశుఁడు నడుమింటఁ బ్రకాశించుచుండియు నాతనికాంతు లతినీరసముగా భూమిపైఁ బడుచుండెను. మలయానిల మతి మందముగా వీఁచుచుండెను. అప్పు డిరువురు యోధులు గుడారము బయటఁ బరుండి యీ తీరున నొండొరులతో మాటలాడు కొనుచుండిరి.

ఒకఁడు:—అంతటి ప్రబలయుద్ధ మని చెప్పుటకు లేదు.

ఇంకొకఁడు:—అవును. తీర్థసేవాభిలాషతో రాష్ట్రాంతరములకుఁ బోయియుండు రాక్షసామాత్యుఁడు కూడ తిరిగి రాలేదు. ఈ సమర మొక సామాన్య విషయముగా నెంచుటఁ జేసియే, సార్వభౌముఁ డీమాఱు సామంతరాజసాయ మపేక్షింపఁడు.

ఒకడు:—రాక్షసామాత్యుఁడు వచ్చినను రాకున్నను, సామంత రాజన్యులు సాయమున్నను లేకున్నను. గుడిని గుడిలోని లింగము నమాంతముగ మ్రింగు చాణక్యుని సాయ మలవడియున్నదిగదా!

ఇంకొకఁడు.—అదియే నాకు నాశ్చర్యము. సర్వసంగపరిత్యాగ మొనరించియు, మఱలఁ జాణక్యుఁ డెట్లు కర్మప్రపంచమునఁ జొచ్చి, యీ రాజకార్య కర్దమమునఁ గాలూనెనో నా కర్థమగుట లేదు. మఱియు నెటుల యిది యార్యమతసమ్మతమో తెలియకున్నది.

“మూర్ఖులారా! యుక్తాయుక్త జ్ఞాన శూన్యులై యసంగత ప్రసంగముల కుపక్రమించుట మీ కెటుల యసంభావితమో, మహాత్ముఁడగు చాణక్యుని పవిత్ర చారిత్ర

మునకుఁ గళంక మాపాదింపఁ జేయుటయు సరిగాదే యనంగా భావి తమ్మని యొక మానవుం డన్నట్లుండి యెలుగునుండియో యరుపెంచి, నారల గర్జించి, యచట నిలవక యెటకో పోయెను. ఆ పురుషుని జూచినప్పటికనే. నాకు లిసుప్రస కొయ్యబారి భయముచే నిద్ర నభినయించితి.

ఆ వ్యాఘ్రంతుకుఁ డటు లా చోటు వాసిపోయి, యనతి దూరమునఁగల వటమునీడ నదివఱకే తనకై వేచియుండు వ్యక్తిని గాంచి "ఓయీ! నీ రాజభక్తి యప్రతిమానము. వృషలుఁడు నీ సేవలకు కృతజ్ఞతఁ జూపఁగలఁ" డని యాతని తో ననెను.

"విధ్యుక్తధర్మమును నెఱవేర్చుచున్నాఁడనే కాని వే ఱిందేమి కలదు? అంతలేసివారు లుండ, రత్నరాశినుండి నాయకమణి నేఱునట్లు నా భుజములపైననే యిట్టి కార్య భారమును మోపుట మీరు నన్నాదరించుట గదా!"

"ఓయీ! యనన హైందవ సమరము నాకే మాత్ర మిష్టము లేదు. అది పెక్కునిష్టముల కాలవాలము. యుద్ధ ములచే దేశములు నక్కుకొనవు. రాజ్యములు పాడగును. రాష్ట్రములు బీడు లగును. ఆ మరణాంతరము మానవుఁడు కష్టతమిస్రమందే తిరుగులాడుచుండిన ప్రమోదభాస్కరు నెపుడు చూడఁగలఁడు? ఆశాపాశము మిగుల నిడుపైనది. మొదలు తుద లేనిది. మదీయేప్సితము ఫలకారి కావలయు. అట్టి సఖ్యమునకుఁ బునాదివేయుట నీయం దున్నది."

"ఆర్యా! ఆ యువతి సుగుణఖని. శాంతి సౌధమునకు బునాది వేసితి నని యామె యీవలనే చెప్పినది. సత్సంకల్పముల కాటంకముండునా? ఇఁక నాకు సెలవా!"

"అక్కడి సమాచారముల యువరాజు ముఖంబున మా కందఁజేయుచుండుము. కత్తులబోనునందు జాగరూకతతో వర్తించుము. మించినదానికి వగచి యుపయోగము లేదు. తెలిసెతివా?"

"ఆర్యా! తమ ప్రయాణ మెప్పుడు?"

"త్రేస్తే! అనతి కాలములో నిన్నుఁ గలిసికొనియెద. మలయకేతు భైరవులయెడఁ దగురీతి నడుచుకొనుము. ఇఁక నీకు సెలవు. రాజభక్తులకు సర్వేశ్వరుఁడు తోడగుఁగాక!"

అనంతర మా పురుషులిరువురు వేఱు వేఱు మార్గములఁ బట్టి పోయిరి. ఇంతకును వా రెవరో?

---

# పదిరెండవ ప్రకరణము

## ఆతం డెవఁడు?

మానవ సంఘ చారిత్రము మిగుల విచిత్ర మైనది. తృటిలో ననేక పరిణామములు గలుగుచుండును. క్షణములోఁ గ్రిందుమీఁదు లగుచుండును. పరస్పర ప్రాణానిలములఁ గోరుచుండు శత్రువులు కాలపరిణామముననో మఱి దేనివలననో బద్ధానురాగు లగుదురు. ఒక్క ప్రాణముగను రెండు దేహములుగ నుండు చిరకాలమిత్రులు కాలవైపరీత్యముననో; మఱెందుచేతనో అజన్మవైరు లగుదురు.

కొందఱిఁ జూచిన వెంటనే యెట్టి కఠిన మానసునకైనను నప్రయత్నముగా, నకారణముగాఁ బ్రేమోదయ మగును. మఱికొందఱిని గాంచినతోడనే నవనీత సమాన మగు హృదయమైనను వజ్రకర్కశ మగును. సముజ్జ్వలనయన దీప్తిప్రసారముచేఁ గొందఱు చూపఱహృదయకుహరము నందలి నిబిడధ్వాంతమును జిమ్ముచుందురు. మృదుమధుర వాక్సుధాధారలచేఁ గొందఱు శ్రోతలవీనుల విం దొనరించుచుందురు. కాని, నిరంతర లోకోపకార దీక్షాబద్ధకంకణుఁడును లోకములోని సకలజనుల హృదయముల నాకర్షింపఁజాలఁడు. మిట్టుపల్లము లేర్పడియుండుట ప్రకృతికి సహజము. లేకున్న, లోకబాంధవుని కరస్పర్శ మాత్రముననే పద్మినీకాంత గిలిగింతలఁ జెందుటయు, కలువకాంత మోము వాడ్చుటయు నెందులకు? అహస్కరోదయముచేతనే

నిశాకాంతి దీనత్వముఁ జెందుటయుఁ, గువలయము తెలివిఁ గాంచుటయు నెందులకు ?

తిలోత్తమ సరళ యగు తరుణి. ప్రేమపూరితమును, సంతతసంతోషాలవాలమునగు నామెవదనమును జూచుటచే నెట్టి కఠిన హృదయమునందైనను ప్రేమ బీజము మొలకెత్తక పోదు. ఆమె కడుఁ బేదరాలు. ఐన నేమి ? అప్పాలఁబడి చిమ్మచీఁకటులఁ జిక్కియుండు నళినికి మిత్రుఁ డగు హేళిప్రభవముచేఁ బ్రమోదము కలుగునటుల, దారిద్ర్య దుఃఖాంబుధిఁ బడి యనదయై యుండిన తిలోత్తమకు హేళిని మిత్రత్వ మబ్బినది. అప్రియత్నముగను, అనాయాసముగను హేళినీసందర్శన భాగ్య మబ్బినది. తిలోత్తమ వదనాంబుజ మందలి సమ్మోహనభావము అయస్కాంతము సూదినివలెఁ గరుణాస్వరూపిణియు, దీనమందారమును, ప్రేమభాగినియు నగు హేళినిహృదయము నాకర్షించినది. స్థానబలిమిచేతను క్షేత్రమాహాత్మ్యముచేతను ఆ సన్మైత్రి దృఢమై, పవిత్రముగాఁ బరిణమించెను. కృతదోహదంబగు మహీరుహాము మాడ్కి వారి నేస్తము సద్భావముచే నానాఁటికి విలసితమగుచుండెను. మాతృవిహీన యగు హేళినికి తిలోత్తమయే మాతయై, చెలియై, చుట్టమై, సచివురాలై యుండెను. ఆ సఖిద్వయ మటుల రెండోరుల నెడఁబాయక, క్షీరనీర న్యాయమున మెలఁగుచుఁ బరస్పర సౌఖ్యాయత్తచిత్తలై యానందడోలిక నూఁగులాడుచుండిరి. దశమిచంద్రుం డాకసమునఁ బయన మొనరించుచుఁ బ్రమదోద్యానమునందలి సృష్టివైచిత్ర్యమున కొక తీరైన సొగయము నిచ్చుచుండెను.

వితస్తానదియందలి కెరటములతో శశికిరణములు సయ్యాటలాడుచుండెను. క్రొంజిగురుల మనోహర రూపములను గుసుమసంతతుల వివిధవర్ణములును గన్నులఁబండువు సేయుచుండెను.

ఇప్పటికే ప్రొద్దుపోయినది. కాని తిలోత్తమ యింకను దనసఖి నెందులకో సర్వాలంకారములతో సింగారించుచుండెను. అనుపమాన మగు హేళినిసౌందర్యమున కామె వన్నెఁబెట్టఁ బ్రయత్నించుచుండెను. రాజకుమారిని నిరవధిక సౌందర్య శోభా విభాసితనుగాఁ జేయఁ జూచుచుండెను. మూఁడు లోకములఁ దన చెలియే యింతుల సౌందర్యవతిగా నుండవలయు నని యామె కోరుచుండెను. వికసిత వారిజాతమును జుట్టుకొను సమదచంచరీకములఁ బోలియుండు నా కుటిలాలిక ముంగురుల నామె దిద్దుచు, నిండు పున్నమనాఁటి చందురుఁబోలి యుండు నా చిగురుఁబోఁడి వదనమును గళంకరహిత మొనరించుచుండెను. శరాసనములఁ బోలియుండు నా చపలాక్షి కన్బొమల నామె తీర్చుచుండెను. మృణాల సమానము లగు నామె బాహువులకును, శంఖ సన్నిభ మగు నామె కంఠమునకును గుసుమ మాలిక లలంకరించి యా పద్మగంధిని ద్విగుణీకృతపరిమళ భరితనుగాఁ జేయుచుండెను. రాజహంసమునకు రమణీయంబగు యానము నేర్పుచుండెను.

కాని, హేళిని కడుసుకుమారి. తిలోత్తమ చేయుచుండు సపర్యలును, అలంకారవిశేషములు నామెను విసుగుఁ గొలుపుచుండెను. మొగమోటమిచే నామె యా ప్రేమ

ప్రవాహమున కెదురీదఁ ద్రొక్కులాడుచుండెను. "చెలీ! ఈ నాఁ డిట్టి యలంకార విశేషము లెందు" కని మెల్లఁగ మోమునఁ జిఱునవ్వొలయఁ బ్రశ్నించెను.

"సహజమనోహర వగు నీ కీకృత్రిమాలంకారములతో నుపయోగ మేమి?"

"ఐన, నీ యార్భాట మెందులకు?

"చెలీ! ఈ దినము పర్వ మని యెఱుఁగవా? పూర్ణ చంద్రోదయముచే సముద్రము సంతసమునఁ బొంగును."

"పూర్ణ చంద్రోదయ మేమియో, సముద్రము పొంగు టేమియో, నీమాటలు నా కర్థమగుట లేదు. అది సహజముగదా!"

"అవును. నీహర్ష మప్రతిమానముగా నుండఁగలదు. సమరసంభారసమేతముగా భారతచతురంగబల మరుదెంచె నని యెఱుఁగవా? ఆ సైన్యమంతయు నదీమతల్లి యావలి కూలమున విడిసి యున్నది. వారి యట్టహాసమును బట్టఁ బగ్గములు లేకున్నవి."

"సరియే. మాయలమల్లి యగు చాణక్యుం డరుదెంచినాఁడా?

"ఏమో? వచ్చె నని కొందఱు, రాలే దని కొందఱు. కాని, చంద్రగుప్త సార్వభౌముఁడు మాత్ర మేతెంచినాఁడు."

"కావలసిన దంతియే. మౌర్య సంహార ణోత్కంఠుం

తను పాత్రకులుఁడును జేతనింత పని కలిగెనది. అనివార్య శౌర్యుఁ డను నా సేనాపతిముందు హైందవులు నిలుచుటకల్ల.”

“అయ్యో ! హేళినీ ! అన్నట్లు మఱచితి. నే నిఁక నెంతయో కాల మిచట నిలుచుటకుల లేను. అయ్యో ! నిన్ను విడిచి జీవములతో నుండఁగలనా?”

పాపము! ఎందులకో తిలోత్తమ కన్నులలో నీ రిడు కొనెను. ఆమె కన్నుల హేళిని తన పైఁటతో నొత్తుచు “తిలోత్తమా ! ఏ కీ పిన మేమైనఁ బిచ్చియెత్తినదా? నీ కింత జేల వని నా కింత్రవఱకుఁ దెలియదు. దుఃఖించెద వెందుల” కని యామె నూరడించు చుండెను. గద్గద స్వరముతోఁ తిలోత్తమ “సఖి! ఏ మని చెప్పుదును! ముందుఁబోయిన నూయి, వెనుకఁబోయిన గోయిగా నున్నది. ఒకవంకఁ బాత్రకులుఁడు నిన్నుఁ ద న్నెట్లైన వరించునటులఁ జేయు మని నాతోఁ జెప్పుచున్నాఁడు. బెదిరించుచున్నాఁడు. బలా త్కరించుచున్నాఁడు. వేఱొకవంక, నీ వాతని ప్రస్తావనైన వినుటకు నిరాకరించుచున్నావు. నడుమ నాయవస్థ విష మముగా నున్న” దని యనెను.

హేళిని:—సఖి ! అతని కంతకంటె నేమి తెలియును? వక్ర మగు కురువేరున కొక్క సువాసన తప్ప మఱేమియు లేనటుల పాత్రకులుఁడు బాహుబలాన్వితుఁ డనియే కాని వే ఱే మున్నది? విద్యాగంధమా శశవిషాణము. భోగభాగ్య ములా మృగతృష్ణవీచికలు. రూపసంపదయా గగనకుసు మము. వంకరగ నుండు కుక్కతోఁకను సరిజేయు టెంత

యసంభవమో మందమతి యగు పాత్రకులుని సన్మార్గగామినిగాఁ జేయు టంత యసంభవము.

తిలో:—(నవ్వుచు) సన్మార్గగామునఁడు గాదు. హేళిని కాముఁడు మాత్ర మై యున్నాఁడు. మదహస్తి హస్తగత వారిజినిఁబోలె మదాంధీభూతహృదయుం డగు పాత్రకులుని బారిఁ బడిన తరుణి యేమి సౌఖ్యము నందఁగలదు? భోగాము లాలోచించియే, ధర్మపథమున నాకొకించుక యాపద కలిగి నను, భరింప నిశ్చయించితిని.

హేళిని:—తిలోత్తమా! నీ క్షేమమునకై పెట్టని కోట యగు నే నుండ, నీ కెట్టి యాపద కాని కలుగఁజాలదు. నీ విఁక దిగులొందకుము. ఈ దినపు విశేషము లేమి? పోయి పండుకొనవలయు.

తిలో:—ఏ మున్నవి? యవనులును, భారతీయులును వితస్తాతరంగి ణ్యుభయకూలములఁ బరస్పర మారణ మంత్ర ములఁ బఠియించుచున్నను, యుద్ధముమాత్రము జరుగ దను నొక ప్రతీతి ప్రబలి యున్నది. అంతయుఁ జాణక్య వ్యూహము. ఉదధిలోఁతుఁబోలె నా కోవిదవర్యుని యభి ప్రాయము నెఱుంగు టంత యసాధ్యము,

హేళిని:—నాకుఁ దెలియును. ఎల్లప్పు డుపమాలం కారశోభితవు నీవు. ఆఁకలిఁగొనిన బెబ్బులులవలె లేచి యుండు యవనవీరుల నాలోకించుటతోడనే భారతీయుల గుండె నీరైనది. అందుచే సామోపాయము ననుసరించుట కంటె వారికి గత్యంతరము లేకపోయినది. పైఁడిగద్దియ

నెక్కిన వానరము మానవావలోకనమునఁ జిక్కక్కులఁ బల్కియు, కడను భయకంపితమై, స్థానభ్రష్టతఁ గాంచు నటులఁ, బిఱికిసందయగు చంద్రగుప్తునకు చిరవిఖ్యాతులగు యవనులఁ గాంచినవెంటనే గుండెలో రాయి పడినది.

తిలో:—అహంభావము నీకు మెండని యీ వఱకే చెప్పితిని. చంద్రగుప్త సార్వభౌముఁ డప్రతిహతపరాక్రమోపేతుఁడు. ఆతని నీ విటు లనుట పాడిగాదు.

హేళిని:—అందులకే పేరనార్చి నాఁడు నేను, ఆ చంద్రగుప్తుని కదనమున జయించి, యాతని సామ్రాజ్యము నాక్రమింపవలయు ననుచున్నాను.

తిలో:—(నవ్వుచు) ఏది యెట్లున్నను, నీ వాతని మానసమును జయించి, యాతని ప్రేమసామ్రాజ్యమున కధిష్ఠానదేవతవు కాఁగల వని నొక్కి చెప్పఁగలను.

హేళిని:—(ఇంచుక కోపముతో) ఇఁక నిట్టి మాటలాడిన నీకు నాయాన కలదు.

తిలో:—సఖీ! నిజము చెప్పెదను. ఆ జగన్మోహనుని నీవు చూడలేదుగాని, చూచియే యుండినచో నిట్లని యుండవు. నారీజనైకకందర్పమూర్తిని జంద్రగుప్త చక్రవర్తిని గాంచిన నీ హృదయనీరజము వికసింపదా? ఆ రాజశేఖరుని సందర్శనముచే నీ మానస సరోవరమునఁ గూర్మి రాయంచ సంచరింపదా? ఆ ప్రభుశేఖరుని విశాల వక్షోభాగమును సవతిమత్సరమున రాజ్యలక్ష్మికంటె మున్మున్న నీవే యధిష్ఠింపవా?

హేళిని:—నీ యుపన్యాసమున కంతము లే నట్టు లున్నది. నీ వాక్చాతుర్య మిూదిన కింతయుఁ జాలును. రమ్ము. ప్రొద్దుపోయినది

తిలో:—ఇందు వాక్చాతుర్య మేమి కలదు? లేనిది కల్పించితినా? మాణిక్యమునకును మెఱుఁగిడ వలయునా? హేళినీ! ఏమయిన నసుము. ఇం కొకమాఱు చెప్పెదను. అఖిలోర్వీశమకుట మణి నీరాజిత పాద రాజీవుఁడు మౌర్యరాజ సుత్రాముఁ డన్నిఁట సమర్థుఁడు.

హేళిని:—(చిఱునవ్వుతో) అవు నవును. మౌర్య చరిత్రగానప్రియవు నీవును మిగుల సమర్థురాలవు. ఉదాత్తాలంకారప్రియవు కూడ!

తిలో:—(నవ్వుచు) ఉదాత్తాలంకారప్రియను నేను. మౌర్యరాజేంద్రుని ప్రియవు నీవు. ఔనా?

హేళిని యించుకాగ్రహముతో "ఇంకొకమారీ విధమున నసందర్భ ప్రలాపములాడిన నీ యుపాసితదేవత నా మౌర్యునిశిరము నీ ఖడ్గరాజమునఁ దునిమివైచెద" నని, సింగంపుఁ గౌనునఁ గట్టుకొనియుండిన కరవాలమును లాగి, పిడికిట ఝుళిపించెను. తిలోత్తమయొక్క యనవసరప్రసంగము చేరాజకుమారి హృదయము నొచ్చెను. ఆ ప్రభుతనయనయనములనుండి సునిశితవీక్షణములు వెల్వడుచుండెను. కాని, తిలోత్తమ తనచెలిమిక త్తెచర్యలకు నిర్లక్ష్యభావముతో వికటముగా నవ్వుచుండెను.

ఇంతలో సమీపమునఁ గల నికుంజాంతరమునుండి యొక పురుషశ్రేష్ఠుఁడు తటాలున నచట నవతరించి "శూరాగ

నారీమణీ ! అసమానరూపలావణ్యా వగు నీచేఁ జంద్రికాపుత్త్రుఁడు యుద్ధమునఁ బరాజితుఁ డైనను ధన్యుఁడే కదా!'' యని మందహాసాంచితసుందరవదనుఁడై నిలువఁబడెను. సరసాలాపనిమగ్నలై యుండిన చెలులిద్దఱు నూతనపురుషాగమనముచేఁ బ్రతిష్ఠంభితలైరి. లోకాతీతసుందరాకారుఁడగు నా పురుషపుంగవుని వక్త్రమునుండి వెలువడిన, మేఘగంభీరభాషణములా కలకంఠుల నానందాత్ములనుగాఁ జేసెను. కాని, తిలోత్తమ యింతలో సమయస్ఫూర్తిగ "చెలీ! ఇందే యుండుము. మఱల నిప్పుడే వచ్చెద" నని బిరబిరజరిగిపోయెను. చంద్రికావిలసిత మగు నా సుందరవనమధ్యమున – నా సుందరీసుందరులిరువురు – హేళినియు, నూత్నపురుషుఁడు నటులే స్థాణువులవలె నిలువఁబడియుండిరి.

ఆతని విశాలనయనములనుండి కటాక్షమాలికలు బయలుదేరి యా నవలావణ్యవతిఁ గట్టివైచుచుండెను. గగుర్పాటుచేఁ గాఁబోలు! హేళినిహస్తమునందలి ప్రశస్త చంద్రహాసము క్రిందఁబడెను. ఆజన్మ మెఱుఁగని యెద్దియో యొక వికారమునకు హేళిని లోనయ్యెను. హేళినీమానసాకాశమునఁ బ్రేమవిద్యుల్లత తళుక్కని మెఱసి మాయమయ్యెను. ప్రేమ యన నెట్టిదియో, మోహనరూప మన నెద్దియో యామె కర్థ మయ్యెను. స్వానుభవ మామెకు సంతసప్రదముగా నుండెను. అవ్యక్తానందరసమునం దామె యూఁగులాడుచుండెను. తలవ్రాల్చి కాలిబొటనవ్రేల నేలరాయుచు, నా రామాంగి యా నూతనవీరశిఖామణిపైఁ గ్రీఁగంటిప్రసారములఁ

బఱపసాగెను. ఓషధీశుని లేఁతకాంతు లా కాముకీకాముకుల విలోకనాంశువులచేఁ బటాపంచ లగుచుండెను. వారి మనోభ్రమరములు ప్రేమారామమునఁ బరిభ్రమింపఁజొచ్చెను. ఆ రాకుమారి యపాంగవిలోకనము లా పురుషసింహుని సుందరాపాంగములతో సయ్యాటలాడుచు వియ్యమందుచుండెను. అప్పటి వారియానంద మనిర్వాచ్యము, అనుపమానము, అలేఖ్యము. పండువెన్నెలపిండుఁ దెగడు మోము—సౌదామినీలతఁ గేరు మేను—కెంపురానిగ్గులఁ దెగడు మోవి—చికిలిచూపులు—మొలకనవ్వులు—మనోజ్ఞప్రదేశము—అన్నియు నాసుందరుని బ్రేమభావోన్మత్తునిగాఁ జేసెను.

ఆ పురుషకేసరి ముందు కొక యడుగిడి "మానినీమణీ! యవన హైందవయుద్ధరంగమున నొకవేళ నాతో శాత్రవము నెఱపినను, ఇతర సమయములయందైన నాతో సఖ్యము నెఱపవా!" యని కమలనాళముఁబోని యామెకరమును గ్రహించి, యా కోమలాంగి నాలింగన మొనర్చుకొనఁ బ్రయత్నించెను. పరపురుషస్పర్శచే హేళిని రోమాంచితశరీరయై, నగవుం దేటలఁ దరళించు దరళకటాక్షవీక్షణముల నాతనిపై నొలయించుచుండెను.

ఇంతలో 'హేళిని! ఇఁకఁ బోవుద' మని తిలోత్తమ యచట సాక్షాత్కరించి నవ్వుటకు మొదలిడెను.

తిలోత్తమాగమనముచే వారు విడిపోయిరి. పాపము! హేళిని పరిహాస పరిభవ పాత్ర యయ్యెను. 'పున ర్దర్శన

మగుఁగాక !' యని యా పురుషపుంగఁవు డంతర్హితుఁ డయ్యెను. హేళిని యా వైపుఁ జూచుచుండెను.

"యౌవనమదముచే నీకుఁ గన్నులు కనఁబడుచుండినఁ గదా !" యని తిలోత్తమ మేలమాడెను.

"నవ్వులబండి ! ఆ నూత్న పురుష శ్రేష్ఠుం డెవ" రని యించుకసిగ్గుతో హేళిని ప్రశ్నించెను.

'రామకథ సంతటిని విని, రామునకు సీత యేమి కావలయు నని నటు లున్నది. ఇంతదనుక నాతనితో నేకాంతమున నుండియు, నీ కాతని సంగతియే తెలియదా? రమ్ము. చెప్పెద' నని యామెను బిల్చుకొని తిలోత్తమ వెడలిపోయెను! నవ్వు నాపుకొనుట కామెకు శక్యముగాకుండెను.



# పదుమూఁడవ ప్రకరణము

## ప్రత్యాలోచనము

"ఆహా! యవనమహీశకుమారీలలామను బోలు సుకుమారగాత్రలు, సర్వాంగసుందరులు భూమండలమునఁ గలరా! అమ్మత్తకాశిని కామెయే సాటి. కళంకము లేకున్న సంపూర్ణ చంద్రమండల మా తన్వీవదనమున కెనవచ్చుఁ గాఁబోలు! అయ్యో! ఆ త్రిలోకైకమంజులాకారము 'నాయది' యని యనుకొను మహాభాగ్యము నాయట్టి నిర్భాగ్యున కీ జన్మమునఁ గాకున్న, నింకొకజన్మమునందైనఁ గలుగునా? సర్వప్రపంచాధిపత్యమైన, నా చకోరాక్షి కడఁగంటి చూపున కెనయగునా? శారికావిహీన మగు పంజరమువలె - నీరజాభావమగు సరోవరముపగిది - హేళిని దండలేనినాబ్రతుకునిరుపయోగముగదా! పూర్ణేందుబింబము నవఘళింపఁజాలు నా దివ్యాంగనముద్దుమోమును జూడఁగలవైననాఁడు దురంతపరితాపకుండమున నీ పాత్రకుఁడు ద్రుగ్గవలసినదేకదా! అట్టి వీరనారి నన్ను నిరాకరించిన, నా బాహుబలపరాక్రమాటోపము లన్నియు నవాలంకారము లగునుగదా! నాభవిష్యదాలోచనములన్నియు నదీవినిర్మితహర్మ్యము లౌనుగదా? ... ... ... నాకిట్టి హృదయదౌర్బల్య మెందులకు? హేళిని నిక్కువముగా నన్నుఁ బరిణయమాడితీరును. తిలోత్తమ యనినటుల నన్నుఁ బోలిన రసికావతంసుఁ డా నారీరత్నమునకు లంభించునా? అటులుకాక, పాలనుగా దని విసమును ద్రావినఁ దగినఫలము ననుభవింపఁగలదు... ... ...అయ్యో! నిజముగా నటులైన

నే మనియుండఁగలనా? ... ... ...ఛీ! అట్లేల యగు? నిక్క-
ముగాఁ దిలోత్తమ నాకార్యమును జక్కఁబెట్టఁగలదు. ఆమె
నావాంఛితమును ఫలవంతము సేయఁగలదు. నా విషయమై
హేళినికడ గోరంతఁ గొండంతగాఁ బ్రస్తుతింపఁగలదు. సర్వా
లంకార సుగుణ సంశోభితుఁడ నగు నానెయ్యమునకై హేళిని
సంతసింపదా?... ... ...ఔను! ఒకవేళ హేళిని నాపాణి
గ్రహణమహోత్సవమునకు సమ్మతింపఁ జూపిన, నభిమానగర్వి
యగు శైల్యూకేశ్వరుం డిందుల కియ్యకొనునా? రాజరాజగు
తనకును, దాస్యవృత్తి నవలంబించి యుండు నాకు నెక్కడి
సంబంధబాంధవ్యము లనునా? మాప్రేమప్రవాహమున కడ్డు
తగిలిన నాతఁడు తత్క్షణము ననుభవింపఁగలఁడు. ఎట్టిప్రబల
సాధనములుగాని, కాముకీకాముకుల గాఢానురాగశృంఖల
ములఁ ద్రెంపఁజాలవు. శైల్యూకేశ్వరుఁడు సూక్ష్మగ్రాహి.
తనరాజ్యమునకు నాబాహుబలము మూలబల మని యాతఁడు
గ్రహించినాఁడు. కాన నాతఁడు మావివాహమునకు నో
రెత్తఁ”డని యనుకొనుచు పాత్రకులుఁడు తనగుడారమునం
దాసీనుఁడై యుండెను. వ్యాకులచిత్తవృత్తిచేతను, దీర్ఘాలో
చనానిమగ్నతచేతను నాతఁడు బడలియుండెను. మోహపిశా
చావేశమున నాతం డస్థిరమానసుఁడైయుండెను. క్షణక్షణ
మున కాతని హృత్క్షేత్రమున నెండ నీడలువలె, సంతాప
సంతోషము లుదయించుచుండెను.

ఇంతలోఁ దిలోత్తమ తలవని తలంపుగా నచటి
కరుదెంచెను. తోడనే యాతఁడు నిండారుమనమున
‘తిలోత్తమా! యేమైన’ దని ప్రశ్నించెను. తిలోత్తమ

యందులకుఁ జిఱునవ్వుతో 'అంత యాతురత యెందులకు? నీకోరిక యొక పండా యేమి, చెట్టునుండి కోసితెచ్చి యిచ్చుటకు?' అని యనెను. పాత్రకులుం డందులకు "హేళిని దండలేని దిన మొకయుగముగాఁ దోఁచుచున్నది. ఏ మైనది?" యని యడిగెను.

"మంగళ మైనది."

"కాయా? పండా?"

"కాయయైనగదా, పండుగావలయు."

"తిలోత్తమా! హేళిని నన్నుఁ బెద్దచూపు చూచి నదా!"

"లేదు. చిన్నచూపు చూచినది."

"తిలోత్తమా! పుండు బాఱియుండు నామానస మును నీచతురవచశ్శరములఁ ద్రుచ్చకుము."

"నీ హృదయతలమున నమంగళబీజమే పడిన నది మొలిచి, పెరిగి, పెద్దదగును గాఁబోలు! నీ కిట్టి సందియమేలఁ గలిగినది?"

"అదేలనోగాని, నామనస్సు సంశయాకుల మై యున్నది?"

"సంశయాత్మా వినశ్యతి యని మాకృష్ణభగవానుని వాక్యము."

"తిలోత్తమా! నీవు మిగుల జాణవు. దానం జేసియే నిన్నీ సంధానమునకు నియోగించితిని."

"అయ్యో! ఈ విషయమున మాత్రము నీవు పొరఁబడితివి. నిన్నే వివాహమాడవలయు నని సహేతుకముగా నామెకుఁ జెప్పితిని. నిన్నుఁ బోలు సమ్మోహనాకారు లీ ధరామండలమున మచ్చునకైనఁ గానరా రని వాదించితిని. నీ పరాక్రమ వైభవ రూపాతిశయములకు, మధ్యందిన మార్తాండుఁడును, మహేంద్రుఁడును, మన్మథుఁడును జాల రని నిర్వచించితిని. ఇంతయు విని, కడ కామె నన్ను 'నీ వేమి బట్టువా?' యని చెప్పినది. 'అతఁడు నీ కేమైన లంచమిచ్చెనా' యని యడిగినది. 'ఇం కొక మా రాతని ప్రస్తావన మొనరించినఁ దగిన శాస్తి యగు' నని బెదరించినది. ఎవ రేమి చేయఁగలరు? 'తెలిసియుఁ దెలియని నరుఁ జెప్ప బ్రహ్మదేవుని వశమా!' యని పెద్దలనుడి."

"అయిన నే నాశాహతుఁడను గావలసినదేనా? నీ వెట్లైన నాకోరికఁ గొనసాగింతువనియు, నందులకుఁ దగిన పారితోషికముచే నాకృతజ్ఞతఁ దెలుపుకొనవలయు ననియు నువ్విళ్ళూరుచుంటిని. అందని మ్రానిఫలముల కఱ్ఱుఁ జాచుట నాబుద్ధిలోపము."

"పోనిమ్ము! ని న్నొల్లకున్న మానె. పితృ మారణోత్సాహి చంద్రగుప్తునిపై మనసు నిలిపి గాసిఁ బడుచున్నది. ఈ సంగతి నెఱుంగుటతోడనే, నాకు నాశ్చర్యము గలిగినది."

తోడనే పాత్రకులుఁడు నిర్విణ్ణుఁ డయ్యెను. ఆతని మేనంతయు మొద్దువాఱెను. ఆతని శిరముపై నొక పెద్ద

శిలపడిన ట్లయ్యెను. ఆతని హృదయారణ్యమున దావాగ్ని పుట్టెను. ఆతని సర్వాంగకములు కోపాతిశయమునఁ గంప మొందసాగెను. కన్నులు చింతనిప్పులవలెఁ బ్రకాశించు చుండెను. ప్రకృతియంతయు నాతనికి శూన్యమై కన్పట్ట సాగెను. "గుట్టును పడఁద్రోయుటగాక, గుంటనుగూడఁ ద్రవ్వినటుల, సన్నిహితసుందరాకారుండ నగు నానెయ్యము నుపేక్షించుటయేకాక, ప్రత్యర్థిపార్థివుం డగు చంద్రగుప్తుని గామించినదా! ఎంతటి ద్రోహము! ఎంతటి కండకావరము! తిలోత్తమా! నీ విఁకఁ బొమ్ము! నీవు నాకొఱకై పడిన యిడుమలకు నా ప్రణామములు. పరిభవానలముచే నా నిలువెల్ల దహించుకొనిపోవుచున్నది. పితృద్రోహినియు, రాజద్రోహినియుఁ, గులద్రోహినియు నగు హేళినికిఁ దగిన ప్రాయశ్చిత్తముఁ జేయునంతదనుక నాతాప మారదు. తిలోత్తమా! నీ విఁకఁ బొమ్ము" అని మిగుల విసుగుతోఁ బాత్రకులుఁ డనెను.

"సోదరా! దిగులొందకుము. నిరాశాధ్వాంతమధ్యమున నింకను నాశాజ్యోతి మినుకు మినుకు మనుచునే యున్నది. నే నూరకుంటి ననుకొంటివా? 'శత్రురా జగు చంద్రగుప్తుని వరింప నీ కేమి పోఁగాల మమ్మా' యని యడిగితిని. 'నీ జనకునిపైఁ గత్తినూఱు మౌర్యునిపై నీమానస మెటుల వ్రాలె' నని యంటిని. 'కాముకులు యుక్తాయుక్త పరిజ్ఞానశూన్యు లనుట యిట్టిదియే' యని నుడివితిని. అన్నింటి నాలకించుచు నామె బెల్లముకొట్టిన ఱాయివలె నుండినది."

“తిలోత్తమా! నాకు మర్మాంతికమని యా నీ యభిప్రాయము?”

“అవును. సత్యమునకును నసత్యము నిలువఁజాలదు. నాయుపదేశ మామెకు నచ్చినదని తలంచెద. దివాకరాస్తమయమునఁ సరసీరుహముపై వ్రాలు తేఁటి చిక్కులఁ బడు విధమున ప్రబల విరోధి శ్రేణి కధ్యక్షతఁ దాల్చియుండు చంద్రగుప్తుని గాంచిన సౌఖ్యము లే దను విషయ మామెకుఁ దెలియఁ జెప్పితిని. అరవిందమును బడయుట యసంభావితంబైన సుగంధ బంధురం బగు కుందంబు నేల పొందరాదు?”

“తిలోత్తమా! నీవు నా కొనరించు సాయమునకు నీ ఋణము నెటులఁ దీర్చికొందును?”

“ఇం దేమి విశేషము కలదు? కలహా పెట్టుఁగఁ జేయుచున్నాను. యౌవనమదమునఁ దప్పుదారి ద్రొక్కుట మానవసహజము. ఎన్ని వంకలు పోయినను, కడకు కావిడి యిల్లుఁ జేరినఁ జాలును. కాల వైపరీత్యమున నొకవేళఁ జంద్రగుప్తుని గలవరించుచున్నను, గడకు నిన్నే వరింపఁ గలదు. అందులకుఁ దగు రీతిఁ బ్రయత్న మొనరించుట నాభారము. ఇఁకఁ బోయి వచ్చెద. పొద్దుపోయినది?”

“తిలోత్తమా! మఱల నా కెపుడు కనిపించెదవు?”

“దాని కేమి యొకవేళ యని యున్నదా? పోయి వచ్చెద” నని తిలోత్తమ వెడలిపోను.

పరిభవము, శోకము, రోషము, సంతోషము అన్నియు మూర్తులఁదాల్చి పాత్రికులువి హృదయతలమునఁ

జిందులాడుచుండెను. వారిజపత్రమునందలి జలబిందువు వోలె, నాతని మానసము చంచలమై యుండెను. మనః క్షోభముచే నాతని కాఁకలి యెక్కడికో పోయెను. "ఆహాహా! తా నొకటి తలంచిన, దైవ మొకటి తలంచు ననుట తథ్యమాయె హేళిని జేపట్టవలయును. భారతీయులఁ బరిమార్చవలయును. సెల్యూకేశ్వరుని మది కెక్కవలయును. హైందవసింహాపీఠి నెక్కవలయును. శ్వశురుని యసువులఁ జోకార్చి, యవనరాజ్య రమాపాణిఁ బట్టవలయును. ........అయ్యో! ఇట్టి యాలోచనలన్నియు మాయమైపోయినవి. ఏ వనలా శిరోమణి, నామానస సామ్రాజ్యమును జయించు నని తలంచి హైందవసామ్రాజ్యమును జయించు నుత్సాహతో నుంటినో; ఏ నవనవోజ్జ్వలాంగి నా హృదయసీమఁ బరిపాలన మొనరించు నని తలంచి యవన హైందవోర్విఁ బరిపాలన మొనరింప నెంతినో; ఏ రాకాచంద్ర నిభానన న న్నానందవార్నిధి నోలలాడించు నని తలంచి ప్రబలప్రత్యర్థిసైన్యమును నాపదంబుధి ముంపనెంచితినో అట్టి హేళీసీరమణి నన్నుఁ గాదనిననాఁడు నా యూహాప్రపంచమునఁ బెనుమంట పుట్టినది. నా సంకల్పసౌధములన్నియు మూలమట్టముగాఁ గూలినవి. నాకోరికలన్నియు గొంతెమకోరిక లైనవి. నా బ్రదుకంతయుఁ బరిహాసభాజనమై పోయిన" దని యాతం డనుకొనుచుండ నంతలో మిహిరుం డరుగుదెంచెను.

అస్థిరమానసుఁడు పాత్రకులుఁడు మిత్రుని రాకచే నానందమొందెను. ధీవిశారదుఁడు మిహిరుఁడు క్షణములోఁ

బా త్రకులుని యాననదర్శనముమూలమున నాతని హృదయ సింధువునందలి కల్లోలమును గాంచి "మిత్రమా! ఏలయింత దీర్ఘాలోచనము? నీముఖ మేల వాడియున్న" దని హెచ్చరించు కొని కూర్చుండెను.

పాత్రి:—మిహిరా! హేళిని కడు సాహసికురాలు. చంద్రగుప్త కంఠలుంఠనో దగ్రమైయుండిన హేళినిచేతినిశాత హేతికోమలకుసుమదామమైనదఁట! వింటివా? మౌర్య నామ శ్రవణమున పదతాడితభుజంగాంగనభంగి బుస్సు మని లేచు రాజకుమారి యిప్పు డాతని గామించి కలవరించుచున్న దఁట!

మిహి:—(ఆశ్చర్యముతో) వినాయకుని జేయఁ బో యినఁ గోతియైనటు లున్నది. ప్రచండప్రతాపభాసురం బగు సింహశాబకము మత్తమాతంగముపై కుఱుకుటకు మాఱు, దానిని జక్షుః ప్రీతిగఁజూచుట మిగుల వింతగాదా! నాఁతుక లతి చపలమతు లనుట కిది యొక ప్రబలనిదర్శనము.

పాత్ర:—యువతు లతిసాసాసురాం డ్రనుటకుఁగూడ నిది సాక్ష్యము. ఇందుల కేమి యపకృతి యొనరించిన నాహృ త్తాపమూరును ?

మిహి :—' స్త్రీ బుద్ధిః ప్రళయంకరీ' యని యార్య వాక్యముకాదా! జనకుని శైబ్యకేశ్వరుని మారణమంత్రమును బఠించు చంద్రగుప్తునివరించుట కామెహృదయ మెట్లొప్పినదో తెలియలేదు.

పాత్ర :—ఈవిషయమువిన్నదిమొదలు నామొడలెల్ల దహించుకొని పోవుచున్నది. ఎటులైనఁ జంద్రగుప్తుని బరిమార్చి హేళినిని నిర్భాగ్యురాలనుగాఁ జేయవలయును.

మిహి:—అవును. నీమాటయుక్తియుక్తము. నీకోర్కె సాగునేని, నొక్కరోకమున మూఁడుపక్షులు గూలినట్లగు. చంద్రగుప్తమారణము, భారతరాజ్యహరణము, హేళినివరణము అన్నియు నొక్కమారె గూడును.

పాత్రి:—మౌర్యుని రణాంగణమున నెదిర్చి, యాతని మడియింపఁజేయుటకుఁ బెద్దకాల మగునట్లున్నది. వితస్తాప్రవంతి పరిపూర్ణప్రవాహయై యుండుటం జేసి, యింతలో నిరువాగుల వారును దలపడుట యసంభవము. నాయభీష్టసిద్ధికి నీకింకేమైన యోచన తట్టుచున్నదా ?

మిహి:—'శుభస్య శీఘ్ర' మనిపెద్దలవాక్యము. ఆలస్యమున నమృతముకూడవిషమగును. కాలము సాగుకొలఁది హేళిని మోహాంకురము పెరిగి పెద్దదై పోవును. ఇపుడు గోటఁబోవు దాని కపుడు గొడ్డలికానలసివచ్చును. చంద్రగుప్తహత్యాయుక్తిసాధ్య మని నాయభిప్రాయము.

పాత్రి:—అవును. మాణిక్యసంగ్రహమునకు మహోరగ మడ్డుండునట్టుల; చంద్రగుప్త మారణమునకుఁ జాణక్యహతకుం డడ్డున్నాఁడు, పరేంగితజ్ఞశిఖామణి చాణుక్యునిముందు మన యాట సాగునా యని నాసంశయము.

మిహి:—నిజము. చంద్రగుప్తునిజంపవలయునన్న ముందుఁ జాణక్యుని జంపవలయును. అది కష్టసాధ్యము. అసాధ్యమని కూడనాయభిప్రాయము. చాణక్యవధోద్యోగమునఁ జన్న మీ రెవ్వరు కృతకృత్యులై వచ్చితిరి ? ఆ మహామహుని కేమిటఁ దీసి

పోవని రాక్షసామాత్యుం డున్నను, నాతం డిప్పుడు సేతుస్నానాభిలాషియై తీర్థయాత్రలఁ బోయి యున్నాఁ డని ప్రతీతి. చాణక్యవచనము విని రాక్షసుఁడు తిరిగివచ్చులోపలఁ జంద్రగుప్తు ననాయాసముగఁ బరిమార్పవచ్చును.

పాత్ర :—అందులకు నుపాయ మేమి ? ఆవిప్రుని బరిమార్చుటకు మాయవనులు చాలరు. కానఁ బ్రాహ్మణమిత్రుఁడ వగు నీతలపై నా కార్యసాఫల్యభారమును మోపుచున్నాను.

మిహి:—సరి, సరి ! పొమ్మనఁజాలక పొగఁబెట్టినట్టు నాయంతమును జూడదలంచి నన్నీ భయంకరకార్యమునకు నియోగించితివి. నీ కంటికి నేను గిట్టను కాఁబోలు ! చాణక్యాచార్యుని మాయాజాలమునఁబడినవా రెవ్వరు తప్పి బ్రదికిరి?

పాత్ర:—మిత్రమా ! హేళినివలె నన్నుఁగూడఁ గప్ప కూ్రరపాముగాఁ దలంచుచున్నావా ! నీవు భారతీయుఁడవు. ఆ బ్రాహ్మణుని జూచిన నిన్నాతఁడు సంశయింపఁడు. సామ్రాజ్యచాణక్యుండవైన నీ కాతని గడతేర్చుట మిగులసులభము.

మిహి:—ఓహో ! ఇప్పుడు తెలిసినది. మిత్రకార్యనిర్వహణమున నా జీవములఁ దూలికలుగాఁ దలంచెద. కృతకృత్యుఁడనైనచో నన్నుమాత్రము మఱచిపోవలదుసుమా !

పాత్ర:—మిత్రమా ! యవన హైందవ రాజ్యసింహాసన పరిగ్రహానంతరము, నిన్నుఁగూడ నాయంతవానిగాఁ జేయకపోతినేని, నాకంటెఁ గృతఘ్నుఁడు వేఱొకఁ డుండునా?

మిహి:—చాణక్యవధోద్యోగము ఈదినమే నా భుజములపై నిడుకొంటిని. చాణక్యుని యమునివీటి కనిపి నేను నీ కడకు వచ్చెద. మనకార్యములకు దైవ మడ్డు పడకుండును గాక! ఇత్రిమా! సంజవేళ కావచ్చినది. పోయి వచ్చెద.

అని మిహిరుం డాతని భోజనార్థ మనిపి, గుడారము వెలికి వచ్చెను. అప్పటి కాకసము మేఘావృతమై యుండెను. "నేడే కదా, యాతఁడు వచ్చెద నని చెప్పెను. ఆ తరుణిం గూడ వెటఁగొని పోవలయు" నని యాతం డనుకొనుచు తనగుడారమునకుఁ బోయెను.

# పదునాల్గవ ప్రకరణము

## ప్రాణదానము

ఎట్టి ప్రతిభావంతునకైనను అవసానదశ కలదని ప్రబోధించు కరణి ననర్ఘ్య తేజోవిరాజితుండై యుండిన మార్తాండుం డస్తమించెను. ప్రభాకరుం డంతరింప నంత తాత్కాలికముగా ప్రకృతికాంత ధరించిన కృష్ణకౌశేయమో యన నాకాశాంతమంతయు నంధకారము వ్యాపించెను. రాజులేని సామ్రాజ్యమున నరాజకము ప్రబలి, ప్రజలకు హాని గావించి, జారచోరులను దమ యిష్టానుసారము దిరుగాడనిచ్చు పగిది, రాజు లేకుండుటచే నంధకారము ప్రబలి సింహశార్దూలాది క్రూర మృగ సంతానము లడవియందు విచ్చలవిడిగా సంచరించు చుండెను. సమధికబలమును, సంక్షోభావసంపన్నంబును నగు రాజద్రోహి సమూహము నెదిరింపలేక చిక్కియుండు రాజోద్యోగినిచయమువలె, నిరంధ్రం బగు నంధకారనికరంబు నడంపలేక, యుడుగణము మినుకు మినుకు మనుచు, రాజాగమనము నెదురుసూచు చుండెను. 'ఆపద లొంటరిగ రాదను నార్యోక్తిని సార్థకపఱచుటకో యన, తలవని తలంపుగా మేఘుండు దండువిడిచి, యా యుడుగణతేజమును డిందుపఱచెను. క్రూరుం డగు మేఘుని రాజ్యము భయావహమై, నరకమును దలపింపఁ జేయు చుండెను. గగనతలమంతయు నిబిడ జీమూతాచ్ఛాదితమై యుండుటచేఁ, బట్టపగలే చీఁకటిగా నుండు నాగహానమునఁ దిమిరము సూచికాభేద్యమై యుండెను. ఇట్లుండ నిం

తలో నా వారిదములు ప్రబలవర్షము కురియసాగెను. కుండలతోఁ గుమ్మరించినటుల నీరు ప్రవహించుచుండెను. విషపన్నగములును, క్రిమికీటకములును, సరీసృపములు నా జల ప్రవాహమునఁ దేలియాడి పోవుచుండెను. ధారాధరముల ధమధమారావములును, వ్యాకుల వన్య మృగ భీకర నినాదములును, ప్రళయ వాతాపహత పాదపముల ఫెళఫెళా రావములును చెవులను జిల్లులు చేయుచు, గుండె నీరు చేయుచుండెను.

అట్టి యెడ, వితస్తాస్రవంతి దక్షిణకూలమునఁ గల యరణ్యము మధ్య నొకయాశ్వికుఁడు మిగులఁ గష్టముతోఁ బోవుచుండెను. అమూల్య దుకూలములు—రక్తనేత్రములు—ఆజానుబాహువులు – ఆతం డొక రాజవంశ్యుఁడనియు, అసమానశౌర్యోన్నతుఁ డనియుఁ జాటుచుండెను. చాలదూరమునుండి పయన మొనరించుటచే నాయాశ్వికుఁడును, అశ్వమును డడిసియుండిరి. నిర్జన మగు నా వనమధ్యమున వనరాశియందుఁబోలె నాతనికిఁ దలఁదాచికొనుట కెచ్చటను దావు దొరకలేదు. ఎడనెడఁ గలుగు విద్యుచ్ఛటా సాహాయ్యమున, నాతఁడు హయమును ముందుకు సాగించుచుండెను. నిశిత కంటక శిలామయ మైయుండు కాననభూమి జలమయమై మిట్టపల్లము లేకముగ నుండెను. అందుచే నా వారువము నాతఁడు మిగులఁ గష్టముతో నడిపించుచుండెను. భీషణారావములతో సంచరించు క్రూరమృగములనుండి యపాయమును శంకించి, యాశ్వికుఁడు సజ్జితకార్ముకధరుఁడై పోవుచుండెను.

వాన క్రమక్రమముగాఁ దగ్గసాగెను. వాన తగ్గుకొలఁది నీటిమీఁదిగాలివలన చలి హెచ్చు పెరుగుచుండెను. ఆశ్వికుం డా పాదమస్తకము చలిచే వడఁకుచుండెను. ఘనారావము లణఁగి రానురాను వియత్తలము తెఱపి గాంచుచుండెను. ఇంత దనుక నిబిడ జలధరాచ్ఛాదితుఁడై యుండిన దోషాకరుం డిప్పు డమందకాంతులతో మింటఁ బ్రకాశింపసాగెను. మన యాశ్వికునకుఁ జంద్రోదయము, మొలబంటి దుఃఖమున మోకాటిబంటి సంతసమునకుఁ గారణమయ్యెను. చంద్రకాంతులచే నాతనికి దారి యించుక సుగమముగ నుండెను. జివ్వ జివ్వున వీఁచు కర్కశమారుతమువలనను, జలమయ మగు నసమతలమున దీర్ఘకాలము పయనమొనరించి యుండుట చేతను వాజేంద్రము బడలిపోయెను. కాని, నచ్చినబంటగు నా గుఱ్ఱము తనయజమానుని మోచికొని యెట్టులో యొక ట్టుల గమ్యస్థానమును జేరఁబోవుచుండెను.

ఇంతలో నొకభీకరశార్దూలము గాండ్రించుచు నక స్మాత్తుగా నా యాశ్వికు నెదిరించెను. పిట్టపిడుగున మూఁడివ యిడుము గాతఁ డధైర్యపడక స్వప్రాణసంరక్షణార్థ మొకశర మున దాని గొట్టెను. కాని యాబాణము గుఱితప్పి దాని యెడ వమ్మయ్యెను. ఆ క్రూరమృగ మాతనిపైకి దూఁకెను. సన్నికృష్టవ్యాఘ్రసంహారమునకు శరము తగదని నిశ్చయించి, యావీరుఁడు కవాలమును దటాలునదివిచి యా క్రూరమృగ ము నెదిరించెను. ఆ యాశ్వికుని ఖడ్గప్రహారముల కోర్చు కొనుచు, తనయాఘాతములచే శార్దూల మాతని నొప్పించు చుండెను. గాసిఁ జెందినగుఱ్ఱ మాపులిదెబ్బల కోర్వఁజాలక క్రిందఁ

బడెను. ఆశ్వికుఁడు ఛంగున నేల కుఱికి, యాపులితోఁ బోరాడ సాగెను. వ్యాఘ్రము వెను కంజవేయక, యాతని చేతిదెబ్బను దినుకొలఁదిఁ రెట్టించినకోపముతో నాతని గదియుచు, దిక్కులు పిక్కటిల్లునట్లు బొబ్బలు వెట్టుచుండెను. చలిచే బాధపడు చుండిన యాశ్వికుఁడు పెద్దకాలము బలసంయుతమగు వ్యాఘ్ర ముతోఁ బోర నసమర్థుం డగుచుండెను. ఖడ్గప్రయోగమున నాతనిహస్తములు బిగువుతప్పుచుండెను. కాని పట్టుదలతో నాతఁడు పోరుచుండును. ప్రత్యర్థివీరుని యసమర్థత నెఱింగినదో యన నాపుండరీకము ద్విగుణీకృతోత్సాహముతో నాతనిపైఁ బడుచుండెను. కడ కాతఁడు ప్రాణములపై నాశ విడిచి తుది ప్రయత్నముగా నాభీకరమృగమును దెగవేయఁ గరవాల మును బైకెత్తి దించునంతలో నెచ్చటినుండియో యొకబాణ మరుదెంచి దానితలను నఱికి వైచెను. మెడనులిమినకోడి వలె నా పులి విలవిలఁదనుకులాడి ప్రాణములఁ బాసెను. ఈ విచిత్రపరిణామమున కాశ్వికుఁ డాశ్చర్యచకితుఁ డయ్యెను. దిక్కులేనివారలకు దేవుఁడే దిక్కనునుడి యాతనికి జ్ఞప్తి వచ్చెను. వ్యాఘ్రమారణ మెటు లొనఁగూడినదో, శార్దూల మారకుఁడు దనప్రాణప్రదాతయు నగు పురుషోత్తముఁ డెవఁడో యాతనికిఁ దెలిలేదు. ఎట్లైన నేమి, తా నీ గండమును గడచినందుల కాతని కమందానందము కలిగెను. భయంకర ఝంఝూనిలాపహతవనరాశిమధ్యంబునఁ దరణి మునుఁగ, నిరాధారుఁడై జీవములకొఱకుఁ దనుకులాడు నావికున కొక దారుశకల మూఁతగా దొరికిన నెంతసంతసము కలుగునో, వన రాశిమయ మగు నా వనాంతరమున వర్షముచేఁ దప్పఁదడిసి,

ఘోరతమిస్రమునఁ బడి, క్రూరమృగవక్త్రమునఁ జిక్కి యస
హాయుఁడై యుండిన యాశ్వికున కా శరాగమమును, దత్ఫల
ముగా మృగ మసువులఁ బాయుటయు, నంతటి యానందము
నకుఁ గారణము లయ్యెను.

అయాచితముగాఁ దనకుఁ బ్రాణదానమొనరించిన మహా
పురుషుఁ డెవరా యనియెత్తుంగ నాతఁడు తమకముతో నుండు
నంతలో, నాతనియెదుటి కొకమానవుం డరుగుదెంచి 'వీరాగ్రే
సరా! భీకరవన్యమృగముతో బాహాబాహిని బెనంగిన నీశక్తి
నిరుపమానము. మృత్యుముఖమునుండి తప్పి బ్రదికినందులకు
ని న్నభినందించుచున్నాఁడ' నని విల్చెను.

ఆశ్వికుఁడు:—పుణ్యపురుషా! అకారణబంధుండ వై,
నాప్రాణములఁ గాపాడిన నీ యుపకారబుద్ధి మిగులఁ బ్రశంస
నీయము. 'దైవం మానుషరూపేణ' యను చొప్పున నిట్టినిర్జన
మును, భీకరమృగసంకులమునగు విపినమున నాజీవములనిలువఁ
జేసిన నీ వెవఁడవో దేవాంశసంభూతుఁడవుగాని వేఱుగాదు.
నీఋణము నే నెటులు దీర్చుకొనఁగలను?

ఆగతుఁడు:—ఓ వీరశేఖరా! నాయొనర్చించినది మిగు
లస్వల్పకార్యము. ఇంతప్రశంసయవసరము. ఈ క్రూరమృగము
ల బారిపడుట కీ కాఱడవి కేల వచ్చితివి?

ఆశ్వికుఁడు:—మృగయావినోదమును సప్తవ్యసనముల
నార్యులనుభవముమీఁద నే చేర్చిరి, వేఁటతమకమున నరణ్యముఁ
జొచ్చి శీతలమారుతముచేతను, ప్రబలవర్షముచేతను వడఁదగిలి
బడలియుండుటచే నీవ్యాఘ్రమునన్నాక్రమింపఁగలిగె. నీరాకచే

నాజీవములు నేఁడు నావైనవి. నాప్రాణ పరిపోషకుఁడ వగు నీయభిధేయ మే యే స్వర్ణమయాక్షరములచే లిఖితములో నే నెఱుంగఁదగునా?

ఆగతుఁడు:—ఓ శూరవరేణ్యా! దాన నీ కగు లాభ మేమి? కారణాంతరముచే నాయభిధేయము గుప్తముగా నుండవలసివచ్చినందుకు విచార మయ్యెను. అసహాయశూరుఁడవు నీవే రెఱుంగఁపచ్చునా?

ఆశ్వికుఁడు:—మహాపురుషా! పరిగృహీతృ నామ మెఱుంగు టంత యావశ్యకము గాదు. నాచారిత్రసంశ్రవణముచే మీకుఁ గల్గెడు లాభ మెద్దియు లేదు.

ఆగతుఁడు:— (చిఱునవ్వుతో) సరియే పోనిమ్ము! మన మిరువుర మిటులే గుప్తాభిధేయులమై యుందము. శార్దూల ప్రహారణముల కోర్చుకోనఁజాలక, సింహాయరాజ మనువులఁ బాసినదికదా! ఇచటి కనతిదూరముననే నాశిబిర మున్నది. యామినీ శేషము నయ్యెడఁ గడిపి, విశ్రమించి, యనంతరము నీదారిఁ బోవచ్చు.

ఆశ్వికుఁడు:—అయ్యా! నీయుపకారవిశేషమునకుఁ గృతజ్ఞుఁడ, ఉపకృతి యేమి గావించి, మీఋణముఁ దీర్చుకొందునో తెలియకున్నది. రెండు మూఁడుకూఁత వ్రేటులదూరమునసనే నాపరిజనము కలదు. వారు నాకై వేచియుందురు.

ఆగతుఁడు:—అయిన నా కింక సెలవు.

అని యాపురుషుఁడు,వచ్చినదారిఁ బట్టి వెనుకకుఁ దిరిగి పోయెను. వారువము మరణమొందుటచే, మనయాశ్వికుఁడు

పారచారియై "ఆ దేశభక్తుని గతి యేమయ్యెనో?" యని యనుకొనుచు గమ్యస్థానాభిముఖుఁడై పోయెను.

మఱలఁ గొంతసేపటి కాశ్వికుని ప్రాణదాత యా ప్రదేశమున కరుదెంచి "చేతఁజిక్కిన పక్షి నెగురఁగొట్టితిని. అతఁ డాప్తుఁడే యై యుండునా" యని యనుకొనుచు "ఓ ధీరాగ్రేసరా! ఓ వీరశిఖామణీ!" యని యెలుంగెత్తి పిలువసాగెను. కారణ మేమియో మనకుఁ దెలియదు. ఆశ్వికుని కాతని పిలుపులు వినఁబడియెనో, లేదోకాఁడఁ దెలియదు. ఆశ్వికుఁడుమాత్రము రాలేదు. "సరియే, కడచినదానికి వగచి యుపయోగము లేదు" అని యనుకొనుచు నాతఁ డా చోటు వాసిపోయెను.



# పదునైదవ ప్రకరణము

## విరహతాపము

ఘంఘుఘంగున శైలశిఖరమునుండి క్షోణీతలమునకు దుమికి వచ్చు శైవలినీమణిని నెవ రడ్డగింపఁగలరు ? నీలజీమూత నికరమునుండి విముక్త శరవేగమున వసుంధర పైఁ బడు వర్షధారల నెవ రెదుర్కొని నిలుప నేర్తురు ? దేనికి బంధనము లేదో అది యప్రతిహతవేగముతోఁ బరుగెత్తును ? దేని కడ్డులేదో అది నానాఁట వృద్ధిఁబొందును. క్షేత్రమున బీజాంకూర మే వేళ నగునో యెవ్వ రెఱుంగరు. పరిసర పరిమళ వాయు సంసేవనముచేతను, వసుంధరాంతర్గతాహారపదార్థ స్వీకారముచేతను, దదంకురము దినదినాభివృద్ధిఁ గాంచి, పుష్పించి, ఫలవంత మగును.

నాఁటేదిన ముద్యానవనమధ్యమున నదటుపాటుగాఁ జంద్రగుప్త సందర్శనమైనది మొదలు, హేళిని వర్తనము నందొకవిధ మగు పరివర్తన మేర్పడినది. ఆమె జీవితచారిత్రమున నొక నూతన ప్రకరణ మారంభించెను. ఆమె హృదయ కుహరము నందలి దూషణ ధ్వాంతము భూషణ భావ దీప్తులచే మాయమయ్యెను చెప్పరాని యొకానొక సంతాపముచే నామె తల్లడిల్లుచుండెను. నిలిచినచోట నామె నిలుచుట లేదు. చేసిన యోచనఁ జేయదు. చూచిన వస్తువుఁ జూడదు. అన్నపానాదులయం దామె కశ్రద్ధ జనించెను. ప్రేమాస్పదము లగు వస్తువు లన్నియు నామెకు విసువుఁ గొల్పుచుండెను. సంతత

మేకాంతవాసము నామె కోరుచుండెను. చెక్కిటఁ జేయిఁ జేర్చి, నిష్కారణముగా నామెకన్నుల నీరిడుచుండెను. సౌఖ్యావహంబగు ప్రపంచమంతయు నామెకు దుఃఖపూరితమై కన్పట్టుచుండెను. పాల్కడలియందు శశాంక కాలకూటములువోలె నా హాట్నితమానసాంబుధియందు సంతోష సంతాపములు జనించి ఘూర్ణిల్లుచుండెను. సకల సౌఖ్యప్రదాయక వస్తుప్రచయము మధ్యనుండియు, నామె కేకారణ్యమున నుండునట్టులు తలంచుచుండెను. ప్రేమావతారమగు సఖీజనమును, కరుణాస్వరూపుఁడగు తండ్రియు నామె కేవిధముననుఁగాని యానందదాయకులగుట లేదు. విరహులకు రేయెండ గ్రీష్మాతపముగ నుండుట సహజము గదా!

ఏమియును తోపమింజేసి, కాలహరణార్థ మామె గ్రంథ మొకటి దీసికొనెను. కనుదోయికి నక్షరసంయోగ ముండియు విషయము బుద్ధిస్థమగుటలేదు. ఆమె నూతన చంచరీకము ప్రేమనందనంబున వికసితప్రసూనముపై వ్రాలి, ఆనంద మకరందాస్వాదన మొనరించుచుండెను. పరాయత్త చిత్తయై, యామె యటు లా పుస్తకమునందలి పుటలను దిరుఁగ వైచుచుండ, నందొక చిత్రపట మకస్మాత్తుగ నామె కంటఁబడెను. తోడనే, పర్వమునాఁటి యుదధి వోలె నామె యుప్పొంగెను. మేనుదీవె చిఱుచెమటలఁ జిప్పిల్లెను. ఎక్కడెక్కడనో యెగురుచుండిన యామె దృక్చంచరీకములన్నియు నొక్కమాఱు గుమిగూడి యా పటముపై వ్రాలెను. ఆమె తదేకదృష్టి నప్పటమును జూడసాగెను. చూచుకొలఁది తమి పెల్లిద మగుచున్నట్లు తోఁచెనేగాని,

తనివి తీరునట్లు కాన్పింపదు. ఆ పటము నా కాముకి వక్షమునఁ జేర్చును. కన్నుల కద్దుకొనును. ముద్దిడుకొనును. ఒడి దాఁచును తన విపరీతవర్తనము బయ లగునో యని, నలునలుకులఁ జూచును. మఱల ఫలకమును గైకొని, యథాపూర్వము వర్తించి తన్మయత్వము చెందును. ఆ రాజకుమారి యిట్టి చిత్తవృత్తి నుండ, తలుపు కిఱ్ఱు మనెను. తోడనే యామె సంభ్రమచిత్తయై యాపటమును యథాస్థానమునఁ జేర్చి పుస్తకమును మూసివేసెను. లోని కెవ్వరుఁగాని రాలేదు. త న్నెవ్వరును జూచినట్లు లేదు. అనిలవశమునఁ దలుపు కదలినటు లుండెను. మఱల నామె యాసుప్తచిత్రము బయటికిఁదీసి, కన్నులకఱవుదీఱఁ జూడసాగెను. ఆమె నయనచకోరము లా చిత్రమునందలి సుందరాకారుని వదన లావణ్యరసము నాప్యాయనముగాఁ గ్రోలుచుండెను. ఆమె చక్షుర్గోళము లానందాశ్రుప్రపూరితము లై యుండెను. తిన్నని యెలుంగున నా నవలాశిరోమణి యా చిత్రపటముతో మంతనము లాడుచుండెను. "ప్రాణకాంతా! ఆహా! 'ప్రాణకాంతా' యని నిన్ను నోరారఁ బిలుచు భాగ్య మెంత కాలమునకుఁ గలిగినది? త్రిలోకసమ్మోహనుఁడవు నిన్నుఁ జూచు నదృష్ట మెన్నిదినముల కొదవినది! మనోనాథా! నే నపరాధినివి. నా యపరాధముల కంతము లేదు. నాకు! గావింపవలసిన శిక్షకుఁగూడ నంతము లేదు. అయ్యో! పవిత్ర మగు నీచిత్రరూపము నహంభావమునఁ జేతులార నెలయేఁటఁ బడవైచి, కలుషీభూత మొనరించిన నా కలుషమునకు శిక్ష యెక్కడిది? కామినీవనవసంతుఁడ వగు నీ

యుత్తమాంగము నుత్తరింపఁ బురికొల్పిన నా పాతకలుషము నకు శిక్ష యెక్కడిది? ధర్మము నాలుగుపాదముల నడువ, రాజ్యపాలన మొనరించు నిన్నుఁ బదభ్రష్టునిగా నొనరింపఁ బ్రబోధ మొనరించిన నా ప్రమాదమునకుఁ బ్రాయశ్చిత్త మెక్కడిది? నోట ననరాని, చెవుల వినరాని దుర్భాష లాడిన నానేరమునకు నిష్కృతి యెక్కడిది? నాపాతకమునకుఁ బారము లేదు. అయ్యో! మనోనాయకా! నా యపరాధ ములు సహస్రములైనను నన్ను మన్నింపవా! కరుణాకరుఁడ వగు నీవు నన్నుఁ గరుణింపవా? కరుణించి నన్నుఁ బాలిం పవా? పాలించి, నాజన్మము ధన్య మొనరింపవా?... అయ్యో! ప్రాణప్రియా! అసమాన రూపలావణ్య రాశివి నీవు, నా జనకుని శత్రుశ్రేణి కధ్యక్షుండ వైతి వేల? విశ్వ మోహనాకారుఁడవు నీవు, నాకు దక్కుట నా పూర్వజన్మ సుకృతఫలమునఁ జేసియే కదా!" యని యామె యే మే మియో యనుకొనుచు, నా చిత్రపటమును గనపల్లవమున నిడుకొని, స్మరశర పరివిద్ధాంగయై, మోహవారాశియందు మునుకలు వేయుచుండెను. అచేతనం బగు నా చిత్రపట ముతో సంభాషించును; మన్నింప వేడుకొనును. కరుణింప బ్రతిమాలును. ఇటులా రాజకుమారి మానస రాజహంస మానందకాసారమునఁ జంద్రగుప్తవదనసరోజముచుట్టుం బరి భ్రమణ మొనరించుచుండెను.

ఇంతలో నా గదిలోనికిఁ దిలోత్తమ తటాలున వచ్చి వికటముగా నవ్వుచు "ఏమమ్మా! హేళిసీ! నీ చర్యలు దురూహ్యములుగా నున్నవి. ఒంటరిపాటున నంతగా నాలో

చించుట కేమి వచ్చిన" దని యామెచేత నుండు చిత్రరూప మును గాంచి మఱింత నవ్వుచుఁ బరిహాససూచకముగ "అప్పుడు నీవు నన్నడిగిన మాటను, ఇప్పుడు నేను నిన్నడుగ వలయును. ఈ చంద్రగుప్త సార్వభౌముని చిత్రపటము నీ కెటుల వచ్చిన"దని యడిగెను.

నెచ్చెలి యైనను, దిలోత్తమ యాగమనముచే హేళిని యుల్లము జల్లు మనెను. ఆమెకన్నులనుండి నీరు గారుచుం డెను. సచేతనం బగు బంగారుబొమ్మవలె నామె యటులే శయ్యపైఁ బరుండియుండెను. హేళినినేత్రము లశ్రుపూరి తములై యుండుటను దిలోత్తమ చూచెను. తన వికృతపుఁ జేష్టలచే నామె మానసము నొచ్చిన దని తిలోత్తమ గ్రహిం చెను. తా నొనరించిన తప్పిదమునకై తిలోత్తమకుఁ బశ్చా త్తాపము కలిగెను. తిలోత్తమ హేళినిప్రక్కన సెజ్జపైఁ గూర్చుండి "ఏలనమ్మా! ఇటులు గన్నుల నీ రిడుకొను చున్నా" వని, పయ్యెదచే నామె నయనము లద్దుచు, చేత నుండు పటమును దీసి పాన్పుపైఁ బెట్టెను.

కలఁకబాఱియుండు మనమును గుదుటఁబఱచుకొని, గద్గదస్వరముతో హేళిని "కంటిని బొడిచి, కన్నీటికిఁ గారణ మడిగిన నే మనఁగలను? తిలోత్తమా! నానాఁటికి నీ హాస్య సంభాషణములు శ్రుతిని మించుచున్న" వని యనెను.

తిలో:—చెలీ! ఉన్నమాట నడిగిన నుండూ రచ్చి రాదనుమాట నిజము చేసితివి. పోనిమ్మ! ఉడుము కేల యూరి లోని పెత్తనము!

హేళిని:—తిలోత్తమా! ఎన్నిమార్లు చెప్పినను, నీ కొంటెమాటలు మానవుగదా! ఈచిత్రమునందలి పుటలను జూచుచుండ నందీపటము గాంచెను. ఏదిం పటమాయని చూచు నంతలో నీవే యడుగుచుంటివి. పరిహాసమును బ్యాతముగాఁ జేసి మాటలాడుట నీకు స్వాభావికము కదా!

తిలో:—చెలీ! నీవింతటి కపటాత్మురాల వని నేనన మనుకొనలేదు. ఇంతకాలముగా నాకుం జెప్పిన నెచ్చెలులు నీకు మఱెవ్వరును లేరని చెప్పితివి. ఔనౌను! అక్కఱతీరినవెనుక...

హేళిని:—నన్ను నిష్ఠురభాషణముల నొప్పించెద వెందులకు? నిన్నుఁ గనుఁగొని నేనేమొనర్చితిని?

తిలో:—హేళినీ! చల్లకువచ్చి ముంతను దాచు టెందులకు? నీకుఁగా అగ్నిసేవి జేసినుండు నాకడ నింత దాపఱికమెందులకు? ఎంతదుర్లభ మైనను నీకామితార్థమును సాధించి నీకానందముఁగూర్ప నడుముకట్టియుండు నాకడ నీకీరహస్యమేల? నీహృదయపేటికను విచ్చి, నీగుప్తార్థముఁ దెలుపుము...... నా యోచన సరియేనా? నీహృదయచోరుఁడు మాళ్వసార్వభౌముఁడే కదా! ...... నీ వెంతటి పుణ్యాత్మురాల వమ్మా!

హేళిని:—చెలీ! నా మనోభీష్ట మొనఁగూడునా?

తిలో:—హేళినీ! నీవు ధన్యురాలవు. పుష్పముల వలన దారము తన కెక్కుడటుల చంద్రగుప్త చక్రవర్తిని జేపట్టుటవలన నీ జన్మము ధన్యతఁ గాంచఁ గలదు. మీ సమాగమము ప్రపంచశాంతిదాయకము కానున్నది. యవన

హైందవ సఖ్యమున కొఱక యబల పునాది వేసె నను గీర్తి దిక్తటములఁ బ్రాఁక నున్నది. నీవు నాటనున్న విత్తనము మొలచి, మొచి పెరిగి, విదిర్చి, పూర్వ పశ్చిమ ఖండములకు నీడపట్టు కాఁగలదు.

హేళిని:—చెలీ! జనకుం డిందుల కిచ్చగించునా? అంతరాయములు పెక్కు నన్నటిమి చూచుచున్నట్లు దోఁచెను. నాకతవిని నాతండ్రి యేమి సేయునోగదా! ప్రియుని యతుతెఁ గూర్ప నాచేఁబూనిన కుసుమమాలికను పాత్రకులుఁడు ధ్వంసము చేయకుండునా? తిలోత్తమా! ఆశాభయములు న న్నూచుచున్నవి సుమా!

తిలో:—బెగ డేల చెలీ! నిష్కళంక ప్రణయము సర్వమును సమకూర్చును. తాళు తాళు. ఇదిగో వచ్చెద.

తిలోత్తమ యేదియో కార్యముపై వెడలిపోయెను. సంజవేళ యయ్యెను. ప్రభాకరుం డపరాద్రిఁ జేరెను. పతంగ మిథునములు తమతమ కులాయములు సేరి, కలకలారావముల వినోదార్థములు తెలుపు కొనుచుండెను. చల్లగాలి వాతాయనమునుండి హాయిగ గదిలోనికి వచ్చుచుండెను. కుసుమములు నెత్తావుల వెదఁజల్లుచుండెను. చీకట్లు క్రమక్రమముగాఁ బర్వెను.

దాసి యొకర్తుక యరుదెంచి, దీపము వెలిగించి వెడలిపోయెను. "ఈ యభినవవసంతుని యంద మే మని వర్ణింతును? ఈతని చంద మేమని వినుతింతును? అయ్యో! ఆర్యకులభూషణా! సద్గుణరాశి వగు నీ కిది భావ్యమా? ఇట్టిమోహన

రూపము నెందులకుఁ దాల్చితివి ? తాల్చితివి పో, నాహృదయము నేల యాకర్షించితివి? పో, నాజనకునితో నేల విరోధించితివి? నాతండ్రిపైనింకనైన శత్రుత్వము విడుము. ప్రియకుమారి నను నన్నాతఁడు నీ కొఱకుగా క్షమింపఁడా? నీహృదయము దయారసపూరితముగదా ! ......అయ్యో ! ఇంకా మహామహుని తప్పిద మేమున్నది ? మాతండ్రి నాశ్రయించియుండు విపరీత రాజ్యకాంక్షయే, మాస్నేహమును విరోధిఁ జేసినది. స్వరాజ్య సంరక్షణార్థమై అతఁడు మాతండ్రిపై గత్తిఁ గట్టెనుగాని, అతనికి మఱియేమి వైరమున్నది ? ... అయ్యో ! పరిపంథిస్నేహవరణమునకై నన్నాతఁడు పితృద్రోహియనియు , రాజద్రోహియనియు శిక్షింపఁడా ...... ఎన్నికడగండ్లుపడిన నేమి, ఈ సుకుమార శరీరుని చెలిమి కలిగినఁజాలు" ననియామె యనుకొనుచుండ, నింతలో గదిలోనికి శెల్యూకేశ్వరుండరుదెంచెను. హేళినియవస్థ నాతఁడు పరాకునఁ జూడలేదు. తండ్రినిఁ జూచినతోడనే యామె చిత్రపటమును శయ్యక్రిందఁ బెట్టి, చదువుకొనుటనభినయించెను. జనకుఁడు తన్నేమైనఁ జూచెనో తనచేతియందలి చిత్రరూపమును గాంచెనో యనుతలంపున, నామెహృదయ ముద్వేగముతో దడదడఁ గొట్టుకొనసాగెను.

"అమ్మా ! హైందవసామ్రాజ్య సంపాదనము మనకిఁక మిగుల సులభ"మని శెల్యూకేశ్వరుఁ డామెతో ననెను.

"ఎట్లు ?"

"మౌర్యుని దక్షిణభుజము నిర్వీర్యము కానున్నది."

"దండోపాయమువలననా ?"

"మిహిరుఁ డిందులకుఁ బ్రయత్నించుచున్నాఁడు"

"రణాంగమున నే, యవనహైందవ వివాదము పరిష్కారము గావలయునా"

"వేరుమార్గము లేదు. ఏకాకియగు మౌర్యునిఁ జిక్కించుకొనుట మిగుల సులభము."

"పురుషకారముపై నాధారపడియుండరాదు."

"పురుషకారము లేకున్నఁ గార్యముగాదు. తర్వాత మాటలాడుకొనవచ్చును. భోజనమునకుఁ బోవుదమురమ్ము."

"నాకాహారముపై నేవగింపుగానున్నది. మీరు పొండు. నేను వచ్చెద."

"రాజవైద్యులఁ బిలిపింతునా ?"

"వలదు. అంత ప్రమాదము లేదు."

అయినఁ బోవుదమురమ్ము ! నన్నేలుతల్లివగు నీవు లేక నాకాహారము హితమగునా ?" అని యాంత్రఁడామెను బిలుచుకొనిపోయెను.

---

# పదునాఱవ ప్రకరణము

## చాణక్యాస్తమయము

ఆహా! విధిచేతలు దురూహ్యములు గదా! అకటా! ఎంతటివాని కెంతటిగతి పట్టినది! నిశాచరుని మద మణఁగించిన ప్రచండమార్తాండబింబము నిశాచరుఁడగు సైంహికేయుని బారిఁబడుననుట నుదుటఁ వ్రాసిన విధాత నేమనుకొనవలయును? పరమపవిత్రమగు విప్రకులమునం దుద్భవమొంది, శమాది గుణపరిధానుఁడైన మహాత్ముని కిట్టి దుర్మరణము కలుగునని యెవ రూహించిరి? అయ్యో! మహాత్మా! నిరాధారుఁడై ని శరణుఁజొచ్చిన, నభయమొసంగి, నీ నిరుపమబుద్ధిబలముచే, రాక్షసాది మహామాత్యుల వైదుష్యపటిమను వ్యర్థముగావించి మహాపద్మనందాది మహావీరవరేణ్యుల నుక్కడగించి, మౌర్య సార్వభౌమేంద్రుని మగధసింహపీఠ నధిష్ఠింపఁజేసిన, నీ ప్రతిజ్ఞా నిర్వాహణకౌశల మెచటికిఁ బోయినది? ఆ సేతుహిమాచలస్థ ధారుణీశ్వరులఁ బరాభూతులఁ గావించి, వారి మణిమయ కిరీటములఁ జంద్రగుప్తుని పాదపద్మములకుఁ బ్రణమిల్లునట్లొన రించిన, నీ ప్రతిభ ఎచటికి వలసపోయెను? అసమానరాజనీతి ధురంధరుండవై చంద్రగుప్తునకు బాసటయై, రాక్షసామాత్యు నకు దక్షిణ భుజమై నిలిచి, ఇంతకాలముగా విరోధివర్గమునకు సింహస్వప్నమైయుండిన నీ ప్రావీణ్య మెచట దాఁగియుండెను! తనకుఁ దానై వలచి వచ్చిన మగధరాజ్యలక్ష్మిని, హస్తగతమై యుండు నఖండైశ్వర్యమును లెక్కసేయక, అస్థిరమును, చంచలమునగు నీపాడు ప్రపంచమును వదలి, తురీయాశ్రమ

ధారివై, శోకోపయోగార్థము వినియోగించు నీ జీవితనౌకను మృత్యుసాగరమున ముంచిన పరమచండాలుని పాతకమునకుఁ బ్రాయశ్చిత్త మున్నదా? అయ్యో! నీ సుగుణగణము లగణ్యములు. నీ చతురుపాయప్రావీణ్య మనుపమానము. నీ మాతృభక్తి నిష్కళంకము. నీ వియోగము దుస్సహము.

ఇం కేమున్నది? బుద్ధిమదగ్రగణ్యుఁడు చాణక్యాచార్యుం డస్తమించినాఁడు. ఉదయమున కంతయుఁ జాణక్యుఁడు మరణించియుండెను. ఈ దుఃఖ సమాచారముతో భారతీయులకుఁ జెల్లవాఱెను. పవిత్రాసనము నలంకరించు చాణక్యోపాధ్యాయుని పవిత్రశరీరము, పుష్పితాశోకమువలె రక్తప్లావితమై యుండెను. హృదయమునఁ దగిలిన యొక్క ఖడ్గ ప్రహారముచేతనే, యాతని ప్రాణములు లేచిపోయెను. గాఢసుషుప్తిఁ జెందియుండు నా యాచార్యోత్తముని దుండగీఁడు లెవరో, దొంగపోటునఁ బెద్ద నిదురఁబుచ్చిరి. పరమకారుణికోత్తముఁడును భూసురవంశ ప్రదీపకుఁడును, అప్రతిమాన ప్రతిభాశాలియు, అజాతశత్రుఁడును, సార్వభౌమునకుపాధ్యాయశేఖరుండును నగు చాణక్యుని యకాలమరణమున కందఱు వగచుచుండిరి. హైందవ సామ్రాజ్య మంతయుఁ గలఁగఁ బాఱిన యుదధిఁబోలి, యల్లకల్లోలమై యుండెను. పళ్ళెరములోని పాదరసము పగిది సైనికు లెల్లరి మూల కామూలకుఁ దిరుగుచుండిరి. భారత హితైషిణి యగు ప్రకృతికాంత, భారత పుత్రరత్న మరణమునకై వంతనొంది రాల్చు దుఃఖాశ్రువులోయన, వృక్షాగ్రముల

నుండి హిమాంబుకణములు చిటుకు పొటుకు మని రాలుచుండెను. మ్లేచ్ఛరాజగురు చాణక్యుని మరణమునకై దుఃఖితుఁడై యుండు భారత మ్లేచ్ఛరాజు వెలుకబాఱెను. భారత సైనికుల వదనాంబుజములు చాణక్య వియోగ వ్యధాక్లిన్నములై యుండెను. క్రోధ పరితాప నిరాశ ముకుళితాననుఁడై సార్వభౌముఁడు మూర్తిఁగైకొనిన శోకసాధ్వి దేవతయో యనఁ జాణక్యాసనముకడ నాసీనుఁడై చెక్కిటఁ జేయి చేర్చియుండెను. అమాత్యులును, యువరాజు బిందుసారుఁడును, సేనాపతి భాస్కరాయణుఁడును నాసనముకడఁ గూర్చుండి, చింతానిమగ్నులైయుండిరి. హృద్వేదనము గావించు నీ పరిస్థితులకు, వారి కేమియుఁ దోఁపకుండెను. ఇటుల భారత శిబిరమంతయు ధూమధామమై వన్నెవాసి యుండెను.

చాణక్యహంతకుం డెవ్వఁడైనది, యింతవఱ కెవ్వరికిని దెలియదు ఆ వ్యసనసాగరమునఁ జాణక్యమారకు నెఱుంగుట కెవ్వరికిఁగాని మనసుపోలేదు. నిరుపమరాజభక్తి సముపేతులును, నిష్కళంక మాతృభక్తి సమన్వితులు నగు హైందవు లెవ్వరుగాని, యిట్టి హేయమును నవమానకరమునగు కార్యమునకుఁ గడంగియుండరని యందఱకు విదితము. సైనికులు తల కొక కీర్తిఁ దలంచుచుండిరి. సదాచారసంపన్నునిఁ జాణక్యుఁ బోకారుపఁ బోగాల మేమని వాకొనుచుండిరి. పరిపంథి మన్మకోవిదుఁడు చాణక్యుం డెట్టి లీ దుర్మరణము వాతఁ బడియె నని యనుకొనుచుండిరి. పరోపకార పరాయణుఁడు చాణక్యాచార్యునిపైఁ గత్తి

నెత్త నా హంతకునకుఁ జేతు లెట్లొగినవని చెప్పుకొను చుండిరి. బ్రహ్మహత్య కొడిగట్టిన నా క్రూరు నేమిచేసి నను దోషములేదని దూషించుచుండిరి. సంవత్సరమయ సము ద్రంబు భంగి నచట మూఁగియుండు భారత చమూ సమూ హామునఁ జొరఁబడి చాణక్యుని బిలుకుమార్చిపోయిన హం తక శిఖామణి ప్రతిభాతిశయమునకు నివ్వెఱపడుచుండిరి. అక్షత శరీరముతోఁ దిరిగిపోయినవానినిఁ బట్టుకొని శిక్షింపఁ జాలనందులకుఁ జింతించుచుండిరి. నిన్నఁజూచినది నేఁడుండ దనియు, నేఁ డుండునది రేపుండదనియు, ప్రపంచమే యొక మాయానాటకరంగమనియు వివిధ ప్రాణు లా నాటకము నందలి పాత్రములనియు వేదాంతవిచారణ మొనరించుచుండిరి.

ఇటులే రెండు మూఁడు గడియలు గడచెను. ప్రాణ రహితమగు శరీరమును బెద్దకాలముంచుట తగవుగాదను యోచనలు బయలుదేరెను. వర్ణాశ్రమాచార విహిత ముగఁ జాణక్యశవమును స్థాపిత మొనరించవలయునని తీర్మా నించిరి. పవిత్ర సలి లావగాహను లైన ధరణీదేవులు యథాక్రమముగఁ జాణక్యశవమును స్నానముచేయించి, కాషాయాంబరములచేఁ గప్పిరి. నిశ్చేతనమయ్యు చాణక్య శరీరము, అగ్నివిబోలి వెలుఁగొందుచుండెను. విప్రవరు లాపవిత్ర శరీరమును, భుజముల నిడుకొని బయలుదేరిరి. సార్వభౌముఁడును, మంత్రిశేఖరులును, సైనికులు నవనత వదనములతోఁ బాదచారులై వెనువెంట నడచుచుండిరి. ఈ శోక మయ దృశ్యమును జూడఁజాలక కాదంబినీ చే

లాంచలమునఁ బరిభాకెపుఁడు తన నేత్రముల నద్దుకొనుచుండఁ జాఱు దుఃఖాశ్రుప్రవాహము, క్షోణీతలమునఁ టప్పటప్పుని వర్ష బిందువులు పడుచుండెను. ఆ దుఃఖసమయోగము నిలుచుటకు మనకు దుష్కరము. అనుకొన్నట్లు, చాణక్య శపథము భూస్థాపిత మొనరించెనని మాత్రము చెప్పినఁ జాలును. పూజ్యమగు పూర్వ శైలేంద్రమునం దుద్భవమొంది, క్రమక్రమముగాఁ జెరిగి, పెద్దదై వసుమతీదేవికిఁ బరోపకారపరాయణత్వముచే నెనలేని సౌఖ్యమును గల్పించి, దోషాకర హృదయశల్యమై యుండిన లోకబాంధవుఁ డస్తమించినట్టుల చాణక్యుం డంతర్హితుం డయ్యెను.

పరస్పర విరోధ గుణ భూయిష్టముగదా, యీ ప్రపంచము! సూర్యాస్తమయము, పద్మినీకాంతకు వంతఁ గూర్చును. కలువకాంతకు చింతఁ బాపును. సూర్యోదయము ఉలూకమునకు ఖేదకారియగును. చక్రవాకమునకు మోద మొనరించును. భారతీయులకు హృదయవిదారకమగు విషయము, గ్రీకులకుఁ బ్రమోదకారణమైనది. చాణక్యాచార్యుని దుర్మరణము, యవనులవీనులఁ బడియెను. సెల్యూకేశ్వరుని యానందమునకుఁ బరిమితి లేకుండెను. ఎట్టులైన నేమి? మగధసింహాసనమునకుఁ గల మార్గమునందలి ప్రబలకంటకము పెకలించివేయఁ బడినందుల కాతఁడు ప్రముదితాత్ముం డయ్యెను. భారత సామ్రాజ్య రసాలమును జుట్టియుండు విషపన్నగ మంతరించినందులకు, సెల్యూకేశ్వరుని సంతసమున కంతము లేకపోయెను. నది కావలి కూలమున, మ్లేచ్ఛులు గుమిగూడి, భారతీయుల పరితాపవదనముల నవలోకించుచుండిరి. శ్రవణానందముగ వారి

దుఃఖదీనాలాపముల నాలకించు చుండిరి. చాణక్య హత్యా విషయమును విని, పాత్రకులుం డానందోత్ఫుల్లలోచనుం డయ్యెను. పట్టినదంతయు బంగారమగుచున్నదని తలంచి, యా సేనాని యాకసమున మేడలుకట్టసాగెను. వీనుల విందుగ, విజో దంతమును దెలిసికొనుటకై, మిహిరున కేమైనం దెలియునేమో యని, యాతని బిలువంబంచెను. నిమిషములో మిహిరుం డరుదెంచి 'మిత్రమా! ఎట్టులో యొకట్టులం గృతకృత్యుండ నైతి'నని నవ్వుచుం గూర్చుండెను.

పాత్ర:—మిహిరా! చాణక్యుని జంపినది నీవేనా?

మిహి:—ఈనాంటికి మిత్రకార్యనిర్వహణ మొనరించి, కృతార్థుండనైతిని. చాణక్యరుధిరపాన మొనరించిన నాఖడ్గరాజ మింకను రక్తకాంతుల వీడలేదు.

పాత్ర:—మిత్రమా! నీ వాతని నెట్లు చంపంగలిగితివి?

మిహి:—నా ప్రాణములను దూలికలుగానెంచి, అర్ధరాత్రమున హైందవవేషమున నొక తెప్పసాయముచే, నదిను త్తరించి భారతశిబిరమును బ్రవేశించితిని. స్కంధావారము నందలి సైనికులందఱు, గాఢనిద్రాసక్తులై యుండుటచే, సచట నిశ్శబ్దముగా నుండెను. ఒకచోటమాత్ర మిరువురు కాపరులు నెగళ్ళముం దాసీనులై యుండిరి. నిశ్చయముగా వారికడకుం బోయి వారిని నేను హెచ్చరించుకొంటిని. వారికి నా కిటుల సంభాషణ జరిగెను.

"నీ వెవరవు? ఇటు లొంటరిగ నర్ధరాత్రమున నెందులకు వచ్చితివి?"

"ఓయీ! నూతనపురుషుఁడనని నన్నేల సంశయించి, మాటలాడెదరు? భారత గూఢచారాధ్యక్షుని కడనుండి నే నరుదెంచుచున్నాను. అవసరకార్యములఁ జాణక్యోపాధ్యాయునితో మాటలాడవలయును. ఆతని గుడార మెద్ది?"

వారు నా మాటల నమ్మి చాణక్యుని గుడారమును జూపుడు వ్రేలితోఁ జూపిరి. ప్రాణముల నఱచేతఁ బట్టుకొని, నే నా బ్రాహ్మణుని గుడారమును దూసితిని. ద్వారపాలకులు నిద్రించుచుండిరి. అందుచే నా ప్రవేశ మింకను సులభసాధ్యమయ్యెను. చాణక్యుఁడు కృష్ణాజినముపై, దక్షిణ హస్త ముపధానముగాఁ బరుండి నిద్రించుచుండెను. పిల్లియడుగులతో నే నాతని డాసి, యొక్కసారిగా నీ ఖడ్గముతో నాతని హృదయమునఁ గ్రుచ్చి తన్నుకులాడు నా బ్రాహ్మణు నటులే కదల మెదల నీక యొత్తిపట్టితిని! చూడఁగా నాతని ప్రాణానిలము లెప్పుడో లేచిపోయి యుండెను. చూచితివా? అసంపూర్ణ మగు నీ లేఖకూడ నాతనికడఁ బడియుండెను.

"భైరవనాయకా!

అవిద్యావంతుఁడ వగు నాటవికుఁడవైనను, నీ చారిత్ర మెంతయు స్తుతిపాత్రము. సెల్యూకేశ్వరుని నీ మాయాజాలమునఁ జిక్కఁజేసిన నీ ప్రతిభ యప్రతిమానము. ఇంటిదొంగను ఈశ్వరుండైనఁ బట్టఁజాలఁడు కదా!

మహానాటకమునకు చరమరంగము సమీపించుచున్నది. గ్రీకుసృగాలములు హైందవజాలమునఁ బడఁగలవు. తప్పించుకొనుట యబద్ధము; చావు నిజము.

మలయకేతువునకు, మనకు సంబంధ మే మున్నది? యవను లీ విషయమునఁ బొరఁబడిరి. మన కాతనితో నిమిత్త మనవసరము. అపరిచితుఁ డగు నాతనితో మన కెట్టి జోక్యము లేదు. నీవు మాత్రము.........."

అని మిహిరుం డా యసంపూర్ణ మగు లేఖను జదివెను. పాత్రికులుఁడు తన చెవులను దాను నమ్మలేక పోయెను. దిగాల్పడి యాతఁడు మిహిరుని జూచుచుండెను. హైంద వోర్వీయం దడుగిడినది మొదలు దమకు బాసటయై నిల్చి యుండు భైరవుం డిట్టి ద్రోహకర్ముండగునా యని యాతఁడు శంకించుచుండెను. 'మిత్రమా! నిజముగా భైరవుం డిట్టి క్రూరాత్ముఁ డగునా? ఆతఁడు చంద్రగుప్తుని గూఢచారిగా నుండునా?' యని పాత్రకులుం డనెను.

మిహి.—ఏమో? ఏ పుట్టలో నే పామున్నదో యెవరి కెఱుక! దొంగయు మానవుఁడేకదా! మూఢజనశిఖామణి భైరవునికడ మాన్యవర్తన మెటు లుండును? ఆతఁడు తృణావృతకూపమని యీ లేఖ చెప్పుచున్నది కదా!

పాత్ర.—ఈ విషయము విచారణీయము. ఆ ద్రోహికిం దగురీతి బుద్ధిఁ జెప్పవలయును. నా ఖడ్గమున కాతని మస్తకమును గాన్కగా నొసంగవలెను.

మిహి.—త్వరపడుచున్నాఁడవు. కార్యమునకుఁ గడంగుటకుముం దొకటి రెండుమారు లోచింపవలయును. ఇట్టి విషమసమయమున భైరవునితో విరోధము మనకు వినాశ హేతువు. మన కీ విషయము తెలియనట్లు వర్తించు టాత్మ

వచ్చును. కాని దృఢసత్త్వుఁడుగాఁ గన్పట్టుచుండెను. సన్నిహిత బంధు మరణము చేతనో, పురాకృత కర్మానుభవము చేతనో, మానవు లున్మత్తు లగుచుందురు. ఆ వెఱ్ఱివాఁ డర్థవిహీనము లగు మాటల నాడుచుండెను. వికటస్వరమున నభినయ పూర్వకముగాఁ బాటలఁ బాడుచుండెను. చూపఱ వెక్కిరించుచు, వినోదముఁ గలుగఁ జేయుచుండెను. ఆ పిచ్చివాని వికృతపుఁ జేష్టల కందఱు నవ్వుచుండిరి. వానియునికి సైనికులకుఁ బ్రమోదకరముగా నుండెను.

“కాలము చాలనప్పు డప్పుడన్నియుఁ గష్టములు గల్గుచుండును. ఏ వేళ యెట్లున్నదో యెవ్వఁ డెఱుగును? ఏ గాలి కాచాప. ఇంటికన్న గుడిపదిలము. వినాయకుని జేయుదువా కుమ్మరీయనిన, వాని యబ్బనుకూడఁ జేయుదునని, లింగము చేసినాఁడఁట. పిల్లికిఁ జెరలాటము, ఎలుకకుఁ బ్రాణసంకటము. కుట్టినఁదేలు, కుట్టకున్న గుమ్మరపురుగు. ‘చెప్పులోనిఱాయి, చెవిలోని జోరీగ, కంటిలోని నలుసు, కాలిముల్లు’ చూచుటకింతయైన, వానిబాధ యింతింతగాదు. గుంట్రాయిని దాఁచినఁ గూతురుపెండ్లి యాగునా? ఱాతి బొమ్మకుఁ జక్కిలిగింత లేమిటి? పాలొల్లని పిల్ల యున్నదా? ఎద్దుపుండు కాకికిముద్దా? కట్టెవంకర పొయ్యిగాని తీర్చదు. తీపుండుచోటు బెల్లముండును. దీప ముండుచోట వెలుతురుండును. ఇచటనుండిన వీరు నన్ను వదలరు” అని యా వెఱ్ఱివాఁడు నోటికి వచ్చినట్లు మాటలాడుచు, గంతులు వైచుచు నిటునటుఁ బరుగెత్తుచుండెను. ఉన్మత్తునిమాటలకు, మాటలకుఁదగిన చేష్టలకు, యవన సైనికులు కడుపు

చెక్కలగునట్లు నవ్వుచుండిరి. మిహిరుఁడు పాత్రకులునితో "మా గ్రీకులకీ యుద్ధతంత్రము క్రొత్తయైనను, నాకు మాత్రము చిరపరిచితము. పాప మీ క్షత్రియుఁడు మిక్కిలి సాధువు. అన్నపానములు లేక యీతఁ డిట్లే తిరుగుచుండు" ననెను. అందులకుఁ బాత్రకులుఁ డాతనితో "క్షత్రియుఁ డెవరి సేవ చేయును? అట్టివాఁ డొకఁడు మనకడ నుండినఁ బ్రొద్దుపోవుచుండును. మన మిఁక శైల్యకేశ్వరునికడకుఁ బోవుదము ర" మ్మని సైనికులకు నాశ్వికదళములకుఁ బోవ నాజ్ఞఁజేసి, మిహిరునితో వెడలిపోయెను.



# పదునేడవ ప్రకరణము

## పరాభవము

రమారమి రాత్రి పదిగంటలయ్యెను. గ్రీకు స్కంధావారమంతయు నిశ్శబ్దమైయుండెను. సైనికులందఱు హాయిగ నిద్రించుచుండిరి. అమృతకరుఁడు కళాప్రపూర్ణుఁడై, కువలయమున కానందమును నొడఁగూర్చుచుండెను. కాని, మోహాతురులకు హితాహితములు విపరీతములుగదా! కావున హిమధాముని యెడ విరహులకు మచ్చరమేల? ఆతని యమృతప్రసాదమును విరహులు హాలాహలముగా భావింతురు. పాత్రికులుం డట్టి విపరీతభావమునకు గుఱియై, వెన్నెలఁ బచారొనరించుచుండెను. అతని భావనాప్రపంచమున ననేకయోచనావిద్యుద్దామములు మెఱసి పోవుచుండెను. భీకరమగు తుపానుచే నాతని మానసాంబుధి కల్లోలమైయుండెను. "ఈ రాయబార మెన్నాళ్ళు? సమ్ముఖమున రాయబార మెందులకు!" అని యాతఁడు తరలి, హేళిని యుద్యానవనాభిముఖుఁడై నడువసాగెను. వానినడకయే, వాని మధుపానోన్మత్తతను దెలుపుచుండెను. ఈప్సితము దిన్నగా నాతనిని గమ్యస్థానమునచేర్చెను. ఆతఁడు హేళినిని వెదక మొదలిడెను.

ఒక్కొక్కప్పుడు, బుద్ధిహీనులను భాగధేయ మనుసరించుట మనము చూచుచుందుము. రూపొందిన శృంగారమువోలె, హేళిని యొంటరిగ నొకసైకతతలమున నాసీనయైయుండెను. ఆ మోహనాంగినిజూచిన తోడనే, పాత్రికులుండతులితానందము నొందెను. హేళిని పాత్రికులునిఁ జూడ

లేను. హాస్యమునందును చంద్రగుప్త చిత్రపటమునందు తదేకఁ ధ్యానముతో నామె చూచుచుండెను. ఆనందబాష్పవారికణములు రెండుకన్నులనుండి చిత్రపటముపైఁ బడి, చంద్రకాంతులయందు మిలమిల మెఱయుచుండెను. పాత్రకులుండా తన్వంగి యెదుట నిలువఁబడి, తనమనోహారిణిఁ గన్నులు కఱవుదీఱఁ జూడసాగెను. అనిర్వాచ్యమగు హర్షము నాతం డనుభవించుచుండెను. ఎంతయో కాలము వారిరువురు సాలభంజికలభంగి చేతనారహితు లైయుండిరి.

ఎందులకో హేళిని తలయెత్తెను, పాత్రకులుం డెదుటఁ గాన్పించెను. ఆమె యులికిపడెను. అబలాసహజమగు భీతి యామె మది నుదయించెను. కాని యాభయము క్షణములో సమసెను. కోపముచే నామె నయనము లెఱ్ఱవాఱెను. అధర ప్రవాళ మదరసాగెను. ఆమె చివాలునలేచి" సేనానీ! ఒంటరి పాటుననుండు మానవతులకడ కిట్లు, వేళగాని వేళఁ బర పురుషులు రాఁగూడదని తెలియదా ?" యని శూలములఁ బోలు మాట లడిగెను.

పాత్రకులుం డందులకు మందహాస మొనరించుచు "రాజకుమారీమణీ! క్రోధారుణితమయ్యు, నీమోముఁదమ్మి సుందరమైయున్న" దని సవిలాసముగఁ బ్రత్యుత్తరమిచ్చెను. అందుల కామె యించుక కర్కశస్వరమున 'పాత్రకులా! సేనాని కిట్టి స్వైరప్రవర్తనము భావ్యముగాదు. కంచెయే చేను మేసినఁ జెప్పెడి దేమున్నది ? న్యాయభర్తలు న్యాయహర్తలగుట ధర్మువుగాదు. మచ్చింతను మాని పొమ్ము" అని

యామె యాతని గసరి కొంటివెనుకకు జరిగి నిలుచుకొనెను. పాత్రికులుండు కదలక నిలిచియుండెను.

పాత్ర:—హేళినీ ! అపరిచితునిబోలె, ఇట్లు మాట లాడెదవేల ? నాయం దన్యభావముంచు టెందులకు ?

హేళిని:—పరిచితుండైనను, వేళకానివేళ మానవతుల యేకాంతమునకు రాం బాడిగాదు.

పాత్ర:—తరుణీమణీ ! ఎఱింగియెఱింగి యేల యిట్టు లాడెదవు ? ఎంతవేడినను దయరాకున్న నేమిసేయుమని యెదవు ?

హేళిని:—సేనానీ ! నీయసంబద్ధపుం బ్రలాపములంగట్టి పెట్టి,వచ్చినదారిం బొమ్ము ! ఓంగము లాలోచింపక ప్రవర్తించుటవలనం గలుగు పర్యవసానము నాలోచింపుము.

పాత్ర:—రాజకుమారీమణీ ! ఉపాసితదైవము ప్రత్యక్షమై నిలిచి, కామితసుఖము లనుగ్రహింపనుండ, నూరక వెనుకకుం బోవు టెట్లు ?

హేళిని:—పరమోహిల్లోలుండవై యీవిధమున, మానవతులం గారింప సమకట్టియుండు నీకు, వరప్రసాదన మెక్కడిది ? ఉల్కాపాతమునంబోలె, శాపముచే నుపహతుండవై, చేసేతం జేసిన నేరమునకుం బరితపింతువు.

పాత్ర:—మోహనాంగీ ! నీకరుణావలోకన ప్రసారము కొఱకు నే నెటులా హరనిద్రావిసర్జితుండనై పరితపించునదియు తిలోత్తమ నీకెఱింగించియేయుండును. నీవే సర్వమనియు, నీతోడిదే లోకమనియు. నీవులేక నా కీప్రపంచము సున్న

యనియుఁదలంచి, నిండుమనంబున నిన్నుఁ బలవరించుచుండుట తిలోత్తమ నీకుఁ దెలిపియే యుండును. సర్వకాల సర్వావస్థల యందును, నే నెట్టుల నీకరగ్రహణమహాభాగ్యమున కువ్విళ్ళూరుచుంటినదియుఁ గన్నులారఁ నీవే చూచియుందువు. నీ గుణముల నేనెట్టుల ప్రస్తుతించుచుండునదియుఁ జెవులార విని యుందువు. అట్టినన్ను, నిరాకరించుట నీకు భావ్యమా!

హేళిని:—ఓయీ! ఒక్కమాట. నన్నేలు ప్రభువు నీకు జనకసమానుండుకదా! అట్టివాఁడు నాతనితనూజాతనగు నేను, నీకుఁ గూఁతుస్సోదరి నగుదును. నీ వెట్టుల నాపై వలపు నిలిపి పరితపించు టేటి వావి? నా యుపదేశముఁ గొమ్ము, పొమ్ము.

పాత్రి:— హేళినీరమణీ! నీవు అసమాన చాతురీధురీణవు. సమస్తకళాకుశలవు. పిల్లిని మల్లిగను, మల్లిని పిల్లిగను నిముసములోఁ జేయఁగలవు. అవకతవక సంబంధములను గల్పించి, నన్నాశాహతునిగా నేల చేసెదవు? నీటముంచినను, పాలముంచినను నీదే భారము. హేళినీ! నవ్య నవనీత సమానమగు నీ హృదయము, నా యెడ శిలాకర్కశముగా నేల?

హేళిని:—నీ గ్రహచారము.

పాత్ర:—నిజముగా నా గ్రహచార మనుకొనవలయు. నిన్నుఁ జెట్టఁబట్టి యఖండైశ్వర్యములఁ దులతూఁగవలయునని యుంటిని. నీ సఖ్యతరణిసాయమున, సుఖసాగరమునం దోలలాడనెంచియుంటిని. నాకోరికలన్నియు స్వప్నప్రాయములై

నవి. నా భావనాప్రపంచమంతయు కూలిపోయినది. నేను నిర్భాగ్యుఁ డనైతిని. హేళినీ! నా దురదృష్ట మేమి? అచ్చర లేమలను మించు మించుబోఁడు లెందఱో నా చెలిమి నభిలషించుచుండ, నీవు నిరాకరించుటకు నాతప్పిద మేమి?

హేళిని:— నీ తలవ్రాఁత.

పాత్రి:—దుస్సహమగు నిట్టి తలవ్రాఁతను వ్రాసిన దైవము కఠినహృదయుఁడు.

హేళిని:—ఓయీ! దుష్కర్ముఁడవై దైవము నెందులకు దూఱెదవు? భక్తపరులకు దైవముగాని, దుశ్చింతకులకుఁ గాదు. బుద్ధిశూన్యులు మాత్రము నీ వన్నట్లు చెప్పుదురు.

పాత్రి:—ప్రియామణీ! నిక్కవముగా నేను బుద్ధిశూన్యుఁడను. నాకు బుద్ధిమాంద్యము జనించినది. నా తెలివి తెల్లవాఱినది. అయినను, నీ మోహనరూపము నాకు నయనోత్సవముఁ జేయుచున్నది; నీ శరీర లావణ్యము నా యెడ సమ్మోహనాస్త్రమువలె నున్నది. ఆహా! హేళినీ! నిన్నుఁ బోలు మోహనాంగు లీ భూమండలమునఁ గలరా? నీ యధర సుధాప్రసాదముచే, నాబుద్ధిమాంద్యముఁ బాపుము. నీ యపాంగ సుధావృష్టిచే నాతాప మార్పుము.

అని పాత్రికులుండామెకడ కేగి, యామెను కౌఁగిలింపఁ జేతులఁ జాపెను. హేళినికిఁ దనసౌశీల్యరక్షణోపాయ మేమియును దోఁపలేదు. ఆగ్రహోదగ్రమానసయై యామె, భయంకరకాళికామూర్తినిఁ బోలుచు "ఛీ! నోరుమూయుము! పాపాత్మావలను. సాధ్వీమణులఁ బరిభవింపనెంచు నీవు,

నాశన మగుదువుగాక! మానిని యన నబల యనుకొంటివా? అబలయగు మానినియే సబలయై నిన్ను హతమార్పఁగలదు. నీకు మారి కాఁగల" దని యామె యాతని శీఘ్రముగఁ దూలనాడెను.

పాత్ర:—మూసిన ముత్యమువలె నేల మాటలాడెదవు? మౌర్యుని నీవు వరింపఁజాలవు; వరింపఁగూడదు. మౌర్యుం డధమాధముఁడు. గ్రీకువిరోధి. మౌర్యవరణముచే నీవు పితృఘాతకురాలవైతివి. నీ రాజద్రోహమున కంతములేదు. నీ దేశద్రోహమున కంతములేదు. నీయపరాధములకు శిక్షయే లేదు. నీవు హతాశవై పోయెదవు. నీ యౌవనమంతయుఁ గానన చంద్రిక యగును. నీ రూపము బూడిఁబోసినపన్నీ రగును. హెళినీ! నీ వెవనికొఱకై పరితపించుచున్నదానవో, యాతని శిర మనతికాలముననే నీ పాదముకడఁ బొరలాడఁగలదు... అయ్యో! హెళినీ రమణీ! నా వాక్పారుష్యమునకు మన్నింపుము.

అని యాతఁడు కామోద్రిక్తుఁడై యామెను డాసెను. అసహాయ యగు రాజకుమారి యటులే 'హా' యని సైకత తలమునఁ గూలఁబడెను. పాత్రకులుఁడు, చిఱునవ్వుతో సవిలాసముగ నామెకడ కేగెను. "ఛీ! చండాలుఁడా! దుర్మార్గుఁడా! ఎంతటి సాహసమునఁ గొడిఁ గట్టితివిరా? అయ్యో! నా మానధనము రక్షించు పుణ్యాత్ములు లేరా?" యని యా కన్యామణి దీనముగా వాపోవుచుండెను. శిలాకఠినహృదయుఁ డగు పాత్రకులుం డే మాత్రమును యోచిం

పక "ప్రియా! మోహనాంగీ! హేళినీ!" యని యామె కడఁ గూర్చుండెను. దుర్భర దుఃఖ వివశత్వమున నామె యా క్రూరుని చెయిదముల కోర్వఁజాలక క్రిందఁ బడెను. పాత్రకులుం డా మోహనాంగియవస్థ కించుకయైనఁ జింతిల్లక, యామె మోమును మోమునఁ జేర్చి ముద్దాడ నుండ "క్రూరుఁడా! మానినీమానాపహారుఁడా! ఇదిగోరా ముద్దు" అని, యొక వీరశ్రేష్ఠుం డచట సాక్షాత్కరించి, యాతని చెంపపై 'ఛెళ్ళీ' యని యొక పెట్టుఁ బెట్టి, కాలితో నొక తన్నుఁదన్ని, యొక గ్రుద్దు గ్రుద్దెను. ఆఁకొన్న సింగము పైకుఱుకఁ గ్రిందికొఱగు సింధురముమాడ్కి పాత్రకులుం డా వీరుని తన్నునను వెనుకకు విరుగఁబడెను. ఆగంతకుఁడు 'వెడలి పొమ్ము' అని గద్దించెను. వ్రాయుట కింతయైనదికాని, సంగతు లన్నియు క్షణమంతఁ దటిల్లతావేగమున జరిగిపోయెను. పాత్రకులుఁడు భీతచిత్తుఁడై, కాలికి బుద్ధిఁజెప్పెను. పోవునప్పు డచటఁబడియుండిన హేళినిచేతి చిత్రపటమును హరించుకొని పోయెను.

ఆ పురుషపుంగవుండు హేళినిప్రక్కనఁ గూర్చుండి, యామెకు శైత్యోపచారము లొనరింపసాగెను. కుటిలాలకము లా కుందరదన వదనాంబుజముపైఁ జెల్లాచెదరుగఁ బడి యుండెను. ప్రాతఃకాల తుషారావృతాంబుజమువలె నామె యాననము ఘర్మబిందువులచే నిండియుండెను. ఆ పురుష శేఖరుఁ డా యోషిద్రత్నోత్తమాంగము నంకతలమున నిడికొని, యామె ముఖముపైఁ బడియుండు శిరోజములను సరిఁ జేయుచుఁ జేలాంచలమున, నామె ముఖమును దుడుచు

చుండెను. గగనతలమునుండి మహీంధరముపై జారిపడిన సౌదామినిగనో యన, నా రామామణి యా మహాశయుని యంకతలమునకు బ్రవాహించుచుండెను. తన్మోహితుండాత్మ హృదయాధిదేవత మంజులాకారమును గనులపండువుగాం జూచుచుండెను. అతని నిర్నిమేషములగు నీలమణి సర్వాంగకముల స్పృశియించుచుండెను. మనోహరుని సహస్యలచే, హేళిని కొక్కమారుగాం దెలివికలిగెను. మూర్ఛగాం దన చెక్కిళులపై నాతని కరాంగుళులు సంచరించుచు, అధర ప్రణాళములం దడియుచుండెను. పులకిత శరీరయై, యావని తాలలాము లేచి కన్నుంగానప్పటి కామెలనాగశేఖర మా పురుషశేఖరుని బాహుబంధమునం జిక్కిపోయెను. "ఇంకొక మాట్రిట్లు చేయకుండు" అని యామె యాతనినుండి తప్పించుకొని యనతిదూరమున నిల్చుండి, మందమధుర స్వరమున "ముందు వెనక లాలోచింపక, మీ యట్టి సార్వభౌమచంద్రులు, వైరిశిబిరమును జొరవచ్చునా?" యని యనెను. అందుల కా పురుషసింహుండు ప్రత్యుత్తరమిచ్చునంతలో నా ప్రేమమయరంగమునకుం బిచ్చివాం డరుదెంచి యే మేమియో పెద్దగా నటువ మొదలిడెను.

ఉన్మత్తునియాగమన మా యువతీయువకుల ప్రేమ ప్రవాహమున కడ్డుతగిలెను. వా రిరువు రాతనివైపు నిర్విణ్ణులై చూచుచుండిరి.

"హరహర! మహాదేవ! కడవయంతటి గుమ్మడి కాయ, కత్తిపీటకు లోకువ. స్థానబలిమిగాని, తన బలిమి

లేదు. చెఱకు తీపియని వ్రేళ్ళతో నములుటా? ఆఁకలియని అయఃపిండమును మ్రింగుటా? పరుగెత్తుచుఁ బాలుత్రాగుట కంటె, నిలిచి నీరుత్రాగుట మేలు!

పడినగండిన పడి పాఱెడునీరు
చెడిన కార్యము; చక్కఁజేయంగ లేవు.
కడియంబులకు పులిగాని డాయంగఁ
గడిగి నిన్నది మ్రింగుఁగాదె బ్రాహ్మణుఁడ!
కన్ను మిన్నెఱుగక కార్యంబొనర్చి
యున్నండవై, కీఁడు కీఁడన నేల?"

అని యా వెఱ్ఱివాఁ డర్థవిహీనములగుమాటల నాడుచుండెను. మాటలకుఁ దగిన చేష్టలఁ జేయుచుండెను. హేళినీ చంద్రగుప్తు లాకరికడ నౌకరు సెలవు దీసికొని, చెరియొక వైపు వెడలిపోయిరి. పిచ్చివాఁ డచటనే యెగురుచుండెను.

కొంతసేపటి కంతయుఁ బాత్రకులుం డచటి కరుదెంచెను. ఆతని నయనములు కోపముచే నెఱ్ఱవాఱి యుండెను. ఆతనివెంటఁ గొందఱు సైనికు లుండిరి. అందఱును జేరి హేళినీ చంద్రగుప్తుల వెదకసాగిరి. వారియెదుటఁ బిచ్చివాఁడు "కుక్క కాటుకు చెప్పుదెబ్బ. పిట్టపిట్టపోరు పిల్లి తీర్చినది" అని యఱచుచు గంతులు వైచుచుండెను. వనమంతయు ననుచరులును దానును వెదకియు విఫలప్రయత్నులగుటచేఁ బాత్రకులుం డా పిచ్చివానిని "ఇచట స్త్రీపురుషు లిరువు రుండిరి. వా రే దారినఁ బోయినది తెలియునా?" యని ప్రశ్నించెను.

# పదునెనిమిదవ పరికరణము

## ప్రతీకారము.

ఉదయార్క బింబమువలె, శెల్యూకేశ్వరుని ముఖాంబుజము జేవురించియుండెను. ఆతని క్రోధవిస్ఫులింగములు, తదీయ దక్షిణ హస్తగత చంద్రగుప్త చిత్రఫలకముమీఁదఁ గురియుచుండెను. పాత్రకులుఁడు, మిహిరుఁడు నాతనియెదుట నాసీనులై యుండిరి. శెల్యూకేశ్వరుఁడు సేనానిఁజూచి "పాత్రకులా! వంటయిల్లుచొచ్చిన కుందేటి నీ విధమున విడిచి పుచ్చెద వని తలంపనుగదా! అట్టియెడ నీ కించుకేనియు సమయస్ఫూర్తి యనునది లేకపోవుట మిపులశోచనీయ" మని యనెను. పాత్రకులుం డందులకు "ప్రభువరేణ్యా! ఆ సమయమున రాజకుమారి జోక్యముఁ గలుగఁజేసికొనకుండిన, నీపాటి కా మౌర్యహతకుఁడు చాణక్యునిగతిఁ బట్టియుండెడి వాఁడు. చంద్రగుప్తుని యుత్తమాంగము నుత్తరింప నాయత్తమైయుండిన నాచేతి నిశాతహేతిని హేళిని పట్టుకొని కార్యవిఘాత మొనరించిన"దని విన్నవించెను. పాత్రకులుని ప్రత్యుత్తరముచే శెల్యూకేశ్వరుని యాగ్రహపిశాచము మఱింత చెలరేగెను. "ఏమేమీ? హేళిని యంతటి ద్రోహినియైనదా? గుట్టుమ పడఁద్రోయుటయేగాక, గుంటను గూడఁ ద్రవ్వినదా? ఎంతసాహసము! ఎంతద్రోహము! చేఁజిక్కినపక్షి నెగురఁగొట్టిన నా కులపాంసన నేమి చేసిన నాపగ తీఱు?" నని యఱచెను.

మిహిరుం డాతనితో "రాజేశ్వరా! కయ్యమునకు, వియ్యమునకు, నెయ్యమునకు సమతయుండవలయును. శాసనకర్తయే శాసనోల్లంఘన మొనరించిన నింకఁ జెప్పెడి దేమి కలదు! శౌర్యాధికులగు గ్రీకులెక్కడ? భీరుజనాగ్రగణ్యులగు హైందవు లెక్కడ? పర్వతాగ్రమునకుఁ బాతాళమున కెక్కడి సామరస్యము? మత్తేభమునకు మశకమునకు నెక్కడి సామ్యము? పశ్చిమ పూర్వదిశల కెంతటి దూరము! సార్వభౌమా! హైందవోపపతి యవనశిబిరమున దొంగవలెఁ జొరబడి దొంగవలెఁ బోయినాఁడు. మించినపనికిఁ జింత నొందిన యుపయోగమేమి? కృతఘ్నురాలై హేళిని యాతనికిఁ బ్రాణదాన మొనరించినది. లేకున్న నాతఁ డీపాటికిఁ జచ్చియుండెడివాఁడు. మనము కృతకృత్యులమై యుండెడివార" మని మండెడు మంటలో మఱింత నేయిని బోసెను.

సెల్యూకేశ్వరుని కన్నుల నిప్పు లుప్పతిలుచుండెను. బొమలు ముడివడెను. కటము లదరసాగెను. కోపము నాపఁజాలక యాతఁడు "పామునకుఁ బాలువోయ విషవృద్ధియగు నట్లు, చిన్ననాఁటనుండియు నల్లారుముద్దుగఁ బెంచఁగాఁ గడకు నాకే యెసరుపెట్టినది. ఈ విషవృక్షమును సమూలముగాఁ బెకలించివైచినఁగాని నాకోప మోపశమించదు. "ఓరీ! ఎవ్వరురా అక్కడ?" యని యొక కేకవేసెను. తోడనే సేవకుం డరుదెంచి 'చిత్త'మని వినయాంజలియై నిల్చెను. నీ వీ క్షణమునఁబోయి—సరియే, వలదు—నేనే పోయెద' నని యాతఁడు లేచి, హేళిన్యంతఃపురశిబిరాభిముఖుఁడై గబగబ నడువసాగెను. పాత్రికుల మిహిరు డాతని వెంబడించిరి. మార్గ

మధ్యమున వారితో శెల్యూకేశ్వరుఁ డేమియుఁ బలుకలేదు. అతని కుడిచేయి యొక్కసారి ఖడ్గముపైకిఁ బోయెను. ఎందులకో యాతం డా ఖడ్గమును దీసి మిహిరుని చేతి కిచ్చెను.

హేళిని శిబిరమున కాతఁడు పోవునప్పటి కామె యొక దివ్యమంగళ విగ్రహమును గుసుమములచే నలంకరించి పూజించుచుండెను. భక్తిపదముల నామె పలుకుచుండెను. తలవని తలంపుగా నరుదెంచిన తన తండ్రిని, నాతని రౌద్రరూపమును గాంచిన వెంటనే యామెకు మనోవిభ్రమము కలిగెను. అలసానిల వలమాన వల్లికామల్లి వలె నామె వణఁకసాగెను. పాత్రకులుని గాంచి యామెయభిప్రాయము దృఢమయ్యెను. పాత్రకులుని దురాచారము లామె కిదివఱకే తెలియును. చకచకఁగా నామెకడ కేగి, శెల్యూకేశ్వరుఁడు "కులపాంసనా! దుశ్చింతలన్నియు నిర్విఘ్నముగాఁ గొనసాగుట కిటిపూజనము లొనరించుచున్నదానవా?" యని యొకవిషపునవ్వు నవ్వి ప్రక్కనుండు నానుడుకుర్చీపైఁ గూర్చుండెను.

జనకుని విపరీతభాషణము లామెమానసమును గలంచెను. ఆతని భయంకరాకార మామె బాష్పావృత నేత్రగోళములఁ బ్రతిఫలించుచుండెను. ఆమె మేను మొద్దుబాఱెను. అటులే యామె తండ్రిసమక్షమునఁ గూర్చుండియుండెను.

శెల్యూకేశ్వరుం డామె యవస్థనుఁ గాంచి "కులటా! దొంగయేడ్పు లేడ్వకుము. నీ కిల్బిషమునకు నిష్కృతి లేదు.

నేత్రానంద దాయక మగు ప్రసూనము వెనుకనే శీకరవ్యాళి మున్నదని యీ నాటికే దెల్లమైన" దని కోపకలుషితస్వాంత మునఁ బలికెను. ఇప్పటికి హేళిని యించుక ప్రతిభఁ దాల్చె. కన్నీటిఁ గొనగోట మీటుచు "తండ్రీ! నాపై నింతటి కోప మూనుటకు నాయపరాధ మేమి?" అని బాష్పనిరుద్ధకంఠ మున నడిగెను.

శెల్యూ:—(కోపముతో) దుర్జాతా? దుర్మతీ! నీకు నేను తండ్రిని గాను. నీవు నాకుమారివి గావు. నీవు నాకు మారివి. నా యైశ్వర్యమునకుఁ జెదపురుగువు. నా ప్రాణములకు మృత్యుదేవతవు. మనబాంధవ్యము నేటితో తునాతునక లైనది. మన ప్రేమపాశ మీ క్షణమునుండి రెండై పోయినది. దుశ్శీలా! రహస్య మెల్లకాలము దాఁగియుండు నని తలంచితివా?

హేళిని:—జనకా! నిరపరాధిని. నా నేర మేమి? ప్రియకుమారికను నన్నేల మీ కోపానలమున కింధనముఁ జేసెదరు? అయ్యో! నే నెంత క్రూరకర్మురాలను!

శెల్యూ:—నిక్కముగా నీవు క్రూరకర్మురాలవు. శాత్రవుం డనియైనఁ దలంపక, పితృమారణోత్సాహి యని యైన యోచింపక, చంద్రగుప్తహతకుని వరింప, నీ కేమి పోఁగాలము దాపురించినది? రాకాసీ! తెల్లని పాలవెల్లి యందు నల్లని కాలకూట ముద్భవిల్లినటుల నిష్కళంక మగు యవనజాతియందు నీ యట్టి కులట పుట్టినది.

హేళిని:—అయ్యో! తండ్రీ! సకలనీతికోవిదుఁడవు నీ విట్లు తలంపనగునా? నిశాపతిలేని యామినీకాంత సోయఁగ

మెటు లుండును? సంప్రాప్తయౌవనయగు కన్యకకు స్వయంవరనిర్ణయాధికారము లేదా?

శెల్యూ:—ఛీ, నోరుమూయుము. నన్నుఁ బ్రతిఘటింతువా? చేసేఁత జేసిన తప్పిదము నొప్పుకొనక, నాతోఁ దర్కప్రతర్కము లొనరించెదవా? దేశద్రోహమునకు, పితృద్రోహమునకు, రాజద్రోహమునకుఁ గడంగిన నిన్నేమి చేసెదనో చూడుము.

జనకుని కఱకు మాటలకు హేళిని కించుక కోపము కలిగెను. ఆమె మనమును కొంచెమువిటవుపఱచుకొని "ఒంటరిపాటునఁ జిక్కిన కన్యామణుల మానధనమును గొల్లగొట్ట సమకట్టిన దుష్కర్ములు సర్వనాశ మౌదురుగాక! జనకా! ఆ మౌర్యరాజకంఠీరవుఁడు విన్నటిరేయి, నన్నీ పాతకులాధముమండి రక్షింప కుండిన నాప్రాణములఁ గోల్పోయియుండెడిదానను. నీకుఁ బుత్రికాభిక్షము నొసంగిన యా మధ్యమలోకమందారునితో సాటి యెవ" రని యామె పాత్రకులుని జురచుర చూడసాగెను. కలరూపునంతటిని, హేళిని తెలుపుటచేఁ బాత్రికులుఁడు భయపడెను. శెల్యూకేశ్వరుని క్రోధాగ్నిజ్వాల లిప్పుడు పాత్రకులునిపైకిఁ దిరిగెను. యవనరాజేశ్వరుని క్రోధానలము తన్ను దహించివేయు నని యాతఁడు దిగులొందెను. ఆ విషమావస్థనుండి తప్పి బయటఁబడుట కాతనికి వెఱవేదియుఁ దోఁపలేదు. మిహిరుండా క్లిష్ట పరిస్థితులఁ దనమిత్రునకు సాయపడ నెంచి "రాజేశ్వరా! అవాచ్యమగు పాపకృతి యనక, జనకుని జంప

నుకించు మౌర్ఖ్యునిపై వలపు నిలిపి యుండుటవలన దేనికిఁ జాలను? ఇట్టి కల్లమాటలచే. నిన్ను వంచించి, తాను తప్పించుకొని తప్పిదమునంతయు సేనాధీశునిపైఁ బెట్ట నెంచు చున్న" దని యుక్తియుక్తముగా మాటలాడి సమయస్ఫూర్తి నుపయోగించెను.

శెల్యూకేశ్వరుఁడు వెంటనే హేళినిపై మండిపడుచు "హేళినీ! నీ వింకఁ జంద్రగుప్తహతకుని మఱచిపోవలయును. తెలిసితివా? అతనిపేరైన నెత్తరాదు. లేకున్న రిపునృపాలుని గామించిన రాజద్రోహమునకు నీవు శిక్షనొందుట సత్య" మని నిర్ధారణగాఁ జెప్పెను. హేళిని దీనాననయై "తండ్రీ! ఏల నన్నిట్లు గాసిఁ బెట్టెదవు? ప్రియజనకుఁడవు. మదీయ క్షేమైకలాభాకాంక్షివి. ప్రత్యక్షదైవమవు. నీకుఁగీడెంతునా? చంద్రగుప్తసార్వభౌముని వరించినంతమాత్రముననే, నీకు నెగ్గుఁ దలంతునా? నే నంతటి కృతఘ్నురాలనా?" యని బతిమాల సాగెను.

శెల్యూ:—ఈ శృంగనీతులఁ గట్టిపెట్టుము. తలచుట్టము, తోఁక వగయు వలదు. నీ వా నీచుని మఱువవలయును.

హేళిని:—జనకా! స్వలాభాపేక్షాపరుండవై నా యౌవనమును నీ యిష్టదేవతకు బలిగా నెందుల కొసంగెదవు? ఈవిధమునఁ బ్రచండకోపము వహించి, నా మంజులాకారము నడవిపాల్సేయు టెందులకు?

శెల్యూ:—అడవిపాలు సేయు టెందులకు? సౌఖ్యపడ నెంచెదవేని, సర్వలక్షణ సంపన్నుం డగు పాత్రికులున్

వివాహమాడుము. మౌర్యుని మఱచిపొమ్ము. నా మాట విని, నా కానందము గూర్చుము.

తనపై శెల్యూకేశ్వరునకుఁ గలిగిన యకారణ వాత్సల్యమునకుఁ బాత్రకులుం డమందానంద మొందెను. హేళిని ప్రత్యుత్తరమునకై కాతఁడు మిగులనాతురతో వేచియుండెను. మిహిరుం డా సమయమున శెల్యూకేశ్వరునితో "రాజవరేణ్యా! హేళీని సేనాపతుల కళ్యాణ మత్యంత సంతోషావహము. పాత్రకుల వరణమున రాకుమారి ధన్యురా లగును. ఆమె యానందడోలిక నూఁగులాడఁగల" దని యనెను. తండ్రి మాటల నాకర్ణించి హేళిని రోషమున "నీచమూపతినీచుఁడు. దుశ్శీలుఁడు. దుర్మార్గుఁడు. రాజసాధముఁడు. కాకిముక్కునకు దొండపండు నెందులకుఁ గట్టెదవు? మాణిక్యమును మసిగుడ్డయం దేల యునిచెదవు? మర్కటముచేతి మందారకుసుమ మేమగతిఁ బట్టును? వేయిజన్మలకైన నే నీ పాత్రకులాధముని గన్నెత్తియైనఁ జూడఁజాల. ఈ జన్మమునఁగాకున్న మరుజన్మమునందైన మౌర్యకులపావనుఁడే నాకుఁ బతియు గతియు నగుఁగాక" యని యామె నిశ్చయముగాఁ బలికెను.

నిర్లక్ష్యముగా హేళిని ప్రత్యుత్తర మిచ్చినందులకు శెల్యూకేశ్వరుని కోపమునకుఁ బరిమితిలేకపోయెను. "కులటా! ఈ జన్మముననే కాదు—మరు జన్మముననేకాదు—నూరుజన్మములకైన నీ వా చంద్రగుప్తుని బెండ్లాడఁజాలవు. నీ వీ పాత్రకులునే వివాహ మాడవలయును. ముమ్మాటి కిది నిశ్చయము. నా యానతి నుల్లంఘించితివేని, నిన్ను ముప్పుత్రిప్పలఁ బెట్టి

మూఁడు చెఱువుల నీరు త్రాగించెద. నా శాసనము జరుగ వలయును, జరుగును, జరిగితీరును. నామాట నాదరింపక, నీవు మౌర్ఖ్యము వదలవేని, నెంటికిఁ జెడఁగ నేవడిగతిఁ బట్టెద” వనెను.

అదే తడవుగ హేళిని, పదతాడిత భుజంగాంగనవోలె రోజుచు, రోషావేశమున “ఔనా? కాఁగలదా? నా కనంత సంతాప మొదవింతువా? నా కంఠమున కురిపోయుదువా? నా జీవితప్రసూనవృంతమును గిల్లి వేసెదవా? నీవు నాకు జనకుఁడవా? నా మారకుఁడవు? ‘కలకంఠికంట కన్నీరొలికిన, సిరి యింట నిలువనొల్లునా?’ నీ ముఖావలోకనము పాప హేతువు. పొమ్ము! అనుభవింతువు పొమ్ము. మదీయాశ్రు ప్రవాహమునఁ గొట్టుకొనిపోయి, పరితాప సముద్రమునఁ బడుదువు” అని యాతని దూలనాడెను. శైల్యకేశ్వరుం డా మాటలకుఁ గన్ను లెఱ్ఱజేసి, పటపట పన్నులు కొఱుకుచు “ఛీ! చండాలినీ! ఏమి వదరెదవు? నన్నే దూషించుచున్నదానవా? మానవీరూప దానవీ! నీకు మంచి కాలము లేదు. ఎవరురా అక్కడ? రాజసుత యని వెనుదీయక, యీ దుశ్చరితను గారాగృహమునఁ ద్రోయుఁడని భీకరముగ నాజ్ఞఁజేసి యట నుండి పోయెను. తండ్రి యానతి నాలకించుట తోడనే, హేళిని దురంత దుఃఖమున ‘హా’ యని ఛేదితమూలం బగు కదళీకంబమువోలెఁ గ్రిందఁబడి మూర్ఛిల్లెను. ఆమె నేత్రద్వయి సాయంసమయమునందు శతపత్రమువోలె ముకుళించెను.



# పంచదశపరిచ్ఛేదము

## కుతంత్రము.

పాత్రకుల మిహిరులు శైల్యూకేశ్వరునివెంట నాతని గుడారమునకుఁ బోయిరి. గర్భశాత్రవుం డనియైన యోచింపక, హేళిని చంద్రగుప్తునే కామించినందులకై కలిగిన క్రోధరోష ములును, గూర్మిపుత్రి కారత్నమున కటుల కరుణలేక కారాగారవాసము గలిగించినందులకుఁ గలిగిన శోకపరితాప ములును శైల్యూకేశ్వరుని హృత్క్షేత్రమునఁ జిందులు ద్రొక్కు చుండెను. మనోవికలత్వముచే నాతనికి వెఱ్ఱియెత్తి నటు లుండెను. "సేనానీ! జయాపజయములతో నిమిత్తము మన కింక వలదు. నానాటికి వితస్తానదియందలి నీరుకూడ తీయుచున్నది. యుద్ధమున కనుకూలపరిస్థితు లేర్పడుచున్నవి. గెలుపోటములకు దైవముపై భారమువైచి త్వరలో హైందవు లతోఁ దలపడవలయును. అోటిలోఁ దలదూర్చి, అోక్కటి పోటున కేల వెఱవవలయు" నని శైల్యూకేశ్వరుఁడు నిప్పుల విసుపుతో ననెను.

మిహి:—ప్రభుశ్రేష్ఠా! దూర మాలోచించిచూడ, హేళిని చంద్రగుప్తుని గామించుట, యవనుల కొకవిధమున సాహాయ్యకారిగా నాకుఁ దోఁచుచున్నది. ఈ పరికరముచేఁ జంద్రగుప్తుని మనవలయందుఁ జిక్కించుకొనవచ్చును.

పాత్రి:—మిహిరా! మాకు నీ వకారణబంధుండవు. భారతీయుఁడవయ్యు, మ మ్మనుసరించి మాకుఁ జేయూత

యొసంగుటచే నీవు న్యాయైకపక్షపాతి వని తెలియుచున్నది. మోసగాఁడగు చాణక్యుని జనునింటికంపి, నీవు మాకు సంతసమును గూర్చితివి.

శైల్యు:—మిహిరా! కంటక ద్రుమముల నడుమ చందనవృక్షమువలె, దుర్జనులగు భారతీయులందు నీ యట్టి సజ్జనుఁడు తప్పఁబుట్టెను. మౌర్య్య మారణ మెట్టులైనఁ గావలయును. ఇందుచే దుర్జాత యగు నాకూఁతురు విధవ యైన నగుఁగాక !

పాత్రి:—చంద్రగుప్తు నెట్టులైన మట్టుపెట్టవలయును. చంద్రగుప్తహత్య మనల హైందవసింహాపీఠికడకుఁ గొనిపోఁ గలదు. మిహిరా! నీయుక్తి యేమి ?

మిహి:—రాజేంద్రా! అవధరింపవలయు. చంద్రగుప్త సంహారమునకు నా కొక చక్కనియుక్తి తోఁచుచున్నది. ఇందులకుఁ దిలోత్తమసాయ మత్యవసరము. దానఁ గార్యము నిర్విఘ్నముగా నెఱవేరును.

పాత్రి:—అ దెంతపని? తిలోత్తమ మనచేతి కీలుబొమ్మ కదా! మన యిష్టానుసార మామె నడచును. ఆమెవలన మన కగుపని యేమి ?

మిహి:—హేళిని తనకై యహోరాత్రములు పరితపించుట, మౌర్యునకిప్పటికే తెలియును. దూతికవై, తిలోత్తమ యాతని జేరి, యీ విషయము లన్నింటిని, నలుసును నగముగాఁజేసి చెప్పవలయు. వాక్చాతుర్యముచే నాతని హృదయమును గరగింపవలయును. హేళిని వ్రాసినటుల మన

మొకలేఖను వ్రాసి, తిలోత్తమచే, హేళిని పంపినటు లాత్త నికిఁ బంపవలయును.

పాత్ర:—ఏమని వ్రాయవలయును?

మహి:—వ్రాసి వినిపించెదను. ఇంతలోఁ దిలోత్తమను బిలువ నంపుడు.

మిహిరుఁడు జాబువ్రాయ మొదలిడెను. పాత్రకులుం డొక సేవకుని బిలిచి రాజాజ్ఞగా సత్వరము తిలోత్తమను గొనిరా నానతిచ్చి, శెల్యూకేశ్వరునితో "అకారణబాంధవుఁ డగు మిహిరునివలన, భారత సామ్రాజ్య సింహపీఠి దినదినము నకు సామీప్య మగుచున్నది. ఇఁక నీ యుక్తిచే నది మనకుఁ గరగతము కాఁగల" దని మిహిరుని గొండాడెను. ఇంతలో మిహిరుఁడు లేఖను లిఖించి, యిటుల వారికి వినిపించెను.

గ్రీకు శిబిరము.

మనోహరా!

త్రిలోకసమ్మోహనం బగు మీ మనోహరాకారము, నాకనుల కానందముఁ గూర్చుచున్నది. మీరూప మను నయఃకాంతశలాకకు నా మానసము సూచీప్రాయమై, పాయ నేరకున్నది. మీ ప్రియభాషణములు నా కర్ణపేయము లగు చున్నవి. ఈ చిలుకలకొలికిఁ గావఁ దమరుతప్పఁ బెఱవారు లేరు.

మనఃకాంతా!

మీ సందర్శనభాగ్యమును బ్రసాదించిన, భారతమాత కరుణ యపారము. ఈ నాటికి మీ పాదపద్మములు నన మనఃపీఠిపై నునిచి, నిరంతరము ధ్యానమొనరించుచు, మీచిత్తె నన్ని యున్నది.

కాని, ప్రాణప్రియా!

ఇది పొసఁగు టెట్లు? శత్రుపక్షమున కధ్యక్షుండవై యుండు నీవు, వెనుక ముందు లాలోచింపక, పరిపంథినృపు శిబిరమును జొరఁబడుట, నీ యట్టి రాజనీతిజ్ఞులకుఁ బాడి కాదు. క్షేమమును గాదు. కాన, నీ వీ నాఁ డర్ధరాత్రమున శ్రీకృష్ణమందిరమున కరుదెంచిన, నే నచట నిన్నుఁ దప్పక కలిసికొనఁ గలను. మహారాజాధిరాజచంద్రుల రగు మీ కొక యబల, యాజ్ఞ యొనరించుచున్న దని యలుకనొందవల దని ప్రార్థన.

మీ ప్రియమణి.

హేళిని.

లేఖా సంశ్రవణమాత్రముననే, శెల్యూకేశ్వర పాత్రకులులు మిహిరుని యుక్తిని గ్రహించిరి. 'సెబాసు! సెబా' సని వారు తలలూపిరి. మిహిరుఁడు కుతంత్రకుశలి యని పాత్రకులుఁడు మేలమాడెను. ఇంతలో నచటికిఁ దిలోత్తమ వచ్చి వారల కభివాదన మొనరించి, శెల్యూకేశ్వరు నవలోకించి, శోకాకులితస్వరమున "అయ్యో! రాజేంద్రా! నాకూర్మి నెచ్చెలి కట్టి దుఃస్థితి నెందులకుఁ గల్గించితిరి? కరుణమాలి, యామెకుఁ గారాగారవాస మేల విధించితిరి? 'అకటా!

మృదుశయ్యలఁ జేరియుఁ గందువారెడు నా రాకుమారి సుకుమార శరీరము కటికినేలనెటుల పరుండ నేర్చు" నని వాపోవసాగెను.

శైల్య:—తిలోత్తమా! ఆమె కట్టి దురవస్థకుఁ గారకులెవరు ?

తిలో:—ఆమెయే. అంతయు స్వయంకృతాపరాధ ఫలము. దీని కంతయు నామె దుర్బుద్ధియే కారణము. అయ్యో! ఆ మౌర్యుం డామె కెచట దాపురమాయెను? పోయిపోయి, యాతనిపైననే, యామెమానస మెటుల వ్రాలెను? అకటా! ఎంతకోమలి కెంతగతి పట్టినది?

పాత్ర:—తిలోత్తమా! ఆ చంద్రగుప్త హతకుఁడు హతుఁడైన, నీచెలి బంధవిముక్తురాలు కాఁగలదు.

తిలో:—ఆ కార్యము, మీ బాహుధీశక్తులకు మించినదా? అయ్యో! నాకూర్మి నెచ్చెలిని జెఱసాలనుండి **దీసి**కొని రా నా కానతిండు.

మిహి:—తిలోత్తమా! మౌర్యమారణము నీచేఁ గావలసియున్నది. ఏ మనెదవు ?

తిలో:—అయ్యో! జగదేకవీరుఁ డనిప్రసిద్ధికెక్కియుండు చంద్రగుప్తుని జంపుట కొకయబల కెట్లు సాధ్యము? ప్రాణహరణోద్యోగమున, హార్యకుమును డాసిన హరిణి, సఫలీకృత మనోరథ కాఁగలదా?

మిహి:—తిలోత్తమా! ఈ లేఖను జూడుము.

అని తాను వ్రాసిన జాబు నామె కొసంగెను. తిలోత్తమ దాని నామూలాగ్రముగఁ జదివెను. తోడనే యామె యాననాబ్జము విస్మయభయాంకురముల కాలవాల మయ్యెను. ఆమె చేతియందలి కమ్మ, గజగజ వణఁకుచుండెను. "అయ్యో! హేళిని కేటి దుర్బుద్ధి పుట్టినది ? ఇంత నాపైఁ మాతని కెందులకు ? తండ్రి కెందుల కిట్లు తిరస్కరించుచున్నది ? అకటా ! ఈ జాబు మీచేతి కెట్లు చిక్కినది ? రాజశేఖరా ! హేళిని యపరాధమును నాకొఱకైనను మన్నింపుఁ" డని యామె వారల వేఁడుకొన సాగెను.

ఆమె యవస్థను వారు నవ్వుకొనుచుండిరి. "తిలోత్తమా ! ఎందు కిట్లు వాపోయెదవు ? నీ కేమైనఁ బిచ్చియెత్తినదా ?" యని మిహిరుం డామె నడిగెను.

తిలో:—నా కెందులకుఁ బిచ్చిపట్టును ? నిజముగా హేళిని వ్రాసినది కాదా, యీ జాబు?

పాత్ర:—హేళిని వ్రాసినటుల మిహిరుఁడు దీనిని వ్రాసెను.

తిలో:—అయిన, హేళిని యక్షరములకును దీని యందలి యక్షరములకును నావంతయేని భేదము లేదు. మీ రామె నిటుల మోసముచేయుటవలన, మీకు వచ్చెడి లబ్ధి యేమి ? లేనిపోని నేరముల మోపి, నాచెలి నెందులకు విప త్సాగరమునఁ ద్రోసెదరు ?

మిహి:—తిలోత్తమా! మౌర్యుని మారణమున కిది ద్వితీయ సోపానము. నీ వీ జాబును గొనిపోయి మౌర్యునకుఁ జేర్పవలయును. సమక్షమున నియ్యవలయును. నీవాక్కౌశలము నంతటిని వినియోగించి, చంద్రగుప్తుని గృహమందిరమునకుఁ దోడ్కొనిరావలయును. ఏకాకివై వచ్చునట్లు నొక్కి చెప్ప వలయును. హేళిని యాతనికై నిద్రాహారముల విసర్జించి పరిత పించుచున్నదని నచ్చఁజెప్పవలయును. రహస్యమును గాపాడ వలయును. ఇంతవఱకు నీ సాయము. ఏమనియెదవు?

తిలోత్తమ యించుక సంశయించుచున్న ట్లగపడెను. మిహిరుం డది గ్రహించి "తిలోత్తమా! అంత యాలోచన మెందులకు? జన్మముచే మన మిరువురము హైందవులము గాని, నాఁటినుండి నేఁటివఱకు శెల్యూకేశ్వర సార్వభౌముని యుప్పుఁ దినుచున్నారము. ఆ మహాశయుని యుపకార విశేష ముచేఁ బెఱిగిన వీ దేహములు. కాన, నా ధారుణీశ్వరుని యెడఁ గృతఘ్నతాబుద్ధి గలిగియుండుటకంటె వేరు కిల్బిష మే మున్నది? ఆ పార్థివేంద్రుని యాజ్ఞాకుసుమమును వహాళిఁ దాల్చి తదనుసారము వర్తించుటకంటె కర్తవ్యమును, బుణ్య ప్రదమును నగు కార్యము మఱియొం డేమి కలదు? యవన హిత కార్య నిర్వహణము మనకు శ్రేయోదాయక" మని యామెను బలవంతపెట్టెను. అందుల కామె "ధారుణీశ్వరా! అవశ్య మట్లులే మీ యానతి శిరసావహించి, కార్య సానుకూల్య మొనరించి, నా చెలిని చెఱసాలనుండి విడిపించెద" ననెను. సమ్మతిసూచకముగా, శెల్యూకేశ్వరుఁడు తలయూఁచెను.

ఆ జాబును భద్రపరచుకొని, తిలోత్తమ వెడలి పోయెను. తనపన్నాగము సాగినందులకు మిహిరుం డానంది తాంతరంగుడై "సార్వభౌమశేఖరా! మోహాతురులు క్రిందుమీదు లరయక ప్రవర్తింతురు; యక్షపతికి బోటులు సామాన్యము. కామాంధుడగు చంద్రగుప్తు డా జాబును జూచినంతనే— తిలోత్తమ మధుర సుధాసమాన సందేశ సరసాలాపముల నాకర్ణించినంతనే—శ్రీకృష్ణమందిరమునకు దప్పక రాగలడు. మన మాయాజాలమునకు బడగలడు. కాని యొక మనవి. ఈ విషయ మొరులకు దెలియ గూడదు. గడపదాటిన గోటదాటును. జన స్తోమ మేమాత్ర ముండినను, దప్పించుకొను టకు మౌర్యునకు వీలుండును. కావున మనము ముగ్గురము మాత్రమే మౌర్యు ననాయాసముగ బట్టవచ్చు"నని చెప్పెను. పాత్రకులుం డందులకు "ఈ యోచన సమంజసము. చంద్ర గుప్తుని మిగుల జాగరూకతతో బట్టవలయు"నని యనెను.

శెల్యూ :—మిహిరా! చంద్రగుప్త హత్యానంతరము భైరవునిపని బట్టవలయును. వానికి దగురీతి బుద్ధి జెప్పవలయును. వాడు త్రవ్విన గోతియందు, వానినే పూడ్చవలయును.

మిహి :—అప్పటికి దానికి మఱియొకదారి బోవుదము. మన పన్నాగములను మెగాస్తనీసు మొదలగు

సమాత్యులతోఁ జెప్పరాదు. పూర్వాచార పరాయణు లగు వారింకుల కియ్యకొనరు. వారివలన, మన కీ విషయ మున నగు సాయ మేమియు లేదు.

పాత్రకులుం డాతని యభిమతము నంగీకరించి "యీ విషయమై తగు ప్రయత్నము లొనరింతము ర" న్మని శెల్యూకేశ్వరునికడ సెలవుగొని, మిహిరునితోఁ దనగుడారమునకుఁ బోయెను.



# ఇరువదియవ ప్రకరణము

## ఎత్తునకెత్తు.

ఆశాపాశబద్ధులై యాకసమున మేడలఁ గట్టువారలకుఁ గాలము కడు నిడుపై కన్పట్టుచుండును. క్షణములపై నిముసములు, నిముసములపై గడియలు, గడియలపై యామములు విశ్రాంతి యనునది లేక పడుచున్నను, వారికి మాత్రము మార్తాండబింబము పరిభ్రమణవిహీనమైయుండున ట్లగపడుచుండును. కార్యాతురత, భావి సుఖైక జీవితము, వారి కటులఁ దోపింపఁ జేయుచుండును.

మిహిరుని యుపదేశము కార్యరూపము దాల్పవలసియుండెను. ఫలమని భ్రమించి దీపమును జేరు శలభముల మాడ్కి, శైల్యకేశ్వరాదులు చంద్రగుప్తవధార్థమై శ్రీకృష్ణమందిరమును జేర సంసిద్ధులై యుండిరి. ఎప్పుడెప్పుడు సూర్యాస్తమయ మగునా, ఎప్పుడెప్పు డరాతి రాజ్యలక్ష్మీ హరణసమయ మాసన్నమగునా యని వారువ్విళ్ళూరుచుండిరి. భవిష్యత్కార్యఫలోచితాలోచనము లొనరించుచు, వారు గుజగుజలు వోవుచుండిరి. మిహిరుని ధీప్రభావవిశేషాదులకు వారచ్చెరు వందుచుండిరి.

భానుం డింతలో గుభాలున నపరాంబుధి దుమికెను. ఆతని ప్రచండపాతముచేఁ బైకెగిరిన ఫేనశకలములో యన, నాకసమంతయు నక్షత్రము లలరారుచుండెను. నభోమణి జారి క్రిందఁబడ, వచ్చి వెదకుచున్న నీలాంబరమో యన నంధకారము భూమండలమంతయు వ్యాపించెను. ఇంతలోఁ

జంద్రోదయమయ్యెను. గగనమునం దక్కడక్కడ మేఘములు పయన మొనరించుచు, చంద్రుని కాంతుల మందగింపఁ జేయుచుండును.

బాణ బాణాసనధారులై, ప్రచండకృపాణ పాణులై నిర్ణీతసమయమున వారు మువ్వురు మాత్రము శ్రీకృష్ణ మందిరమున జేరిరి. వారి కృతిమపు టాలోచనములు మఱెవ్వరికిఁగాని తెలియవు. తమ మాయావాగురలయందుఁ జంద్రగుప్త విహంగేంద్రము తప్పక పడునని వారు నమ్మి యుండిరి. ఆవులించినఁ బ్రేవు లెన్ను చాణక్యుఁడు హతుఁడై నందునఁ దమయుపాయములన్నియు నిరాఘాటముగా సఫలము లగుచున్న వని హర్షించుచుండిరి. శ్రీకృష్ణమందిరాంతర్భాగమునఁ గూర్చుండి వారిటుల మాటలాడుకొను చుండిరి.

శెల్యు:—మిహిరా! ధీవిశారదున కసాధ్యము లేదు. ఇందులకు నీవే తార్కాణము. నీ యసమానచాతురీ మహిమ యనతికాలముననే చంద్రగుప్తునిమద మణఁగింప నున్నది. నీ యుపకారవిశేషమును మే మెప్పుడును మఱువఁ జాలము.

మిహి:—రాజేశ్వరా! నా చాతుర్య మంత ప్రస్తుతి పాత్రము గాదు. భృత్యుఁడు తన స్వామియెడఁ గృతజ్ఞుండై, సర్వదా యాతని క్షేమమును గోరియుండు టాతని విధ్యుక్త ధర్మము. తిలోత్తమ నమ్మకమైనబంటు. చంద్రగుప్తు నామె తప్పక పిల్చుకొనిరాఁగలదు. ఆతఁడు తప్పక మనచేతఁ జిక్కును.

మృత్యువదనగహ్వరమునఁ జొఱఁబడినవానికి బ్రదుకెక్కడిది? సాధ్యమైనంతవఱకు కారాజన్యుని సజీవునిగాఁ బట్టుకొనఁ బ్రయత్నింపవలయును. దాన మన కమూల్యమగు మేలున్నది.

పాత్ర :—మిహిరా! అదియు నిజమే. ఆ కాలకాకోదరమును నోటఁ బూడఁ బెఱికి, కష్టార్ణవముల నీఁదవలయును. ఆతనిపేరు విన్నమాత్రమున నాయొడ లుడికి పోవును.

అని వా రనుకొనుచుండఁగా, వారి కెచటనుండియో గుఱక వినఁబడెను. మానవుం డెవఁడో యచట నిద్రించుచుండెనని వారు సంశయించి, సాయుధహస్తులై, యాదేవాలయప్రాంగణమున వెదక మొదలిడిరి. అచట నొకమూల మానవుం డొకఁడు పరుండి గుఱకపెట్టుచు నిద్రించుచుండెను. పాత్రకులుం డాతనికడ కేఁగి తట్టిలేపెను. తోడనే యాతఁడు వికృతాకారమున "పుట్టుకతోఁ బుట్టిన బుద్ధి పుడకలతోఁ గాని పోదు. చోరులకు జారులకు సందేహములు సహజములు. అల్పున కైశ్వర్యము వచ్చిన నర్ధరాత్రమున గొడుగుపట్టుమనినాఁడట. మీ రంద ఱెవరు? భక్తులా? భక్తాగ్రగణ్యులా? అర్ధరాత్రమునఁగూడ శ్రీ కృష్ణ పరబ్రహ్మ సందర్శనౌత్సుక్యమున వచ్చిన భక్తాగ్రేసరచక్రవర్తులా? మీ కెంత తెలివితక్కువ? మీ కెంతబుద్ధిమాంద్యము! మీబుద్ధి గడ్డితినినదా? మంచి చెడ్డలు చూడవలదా? సమయాసమయములు పరిగణింపవలదా?

లాభాలాభములు యోచింపవలదా? సత్యాదేవితో సరస సల్లాములఁ దవిలియుండువేళ—అష్టపత్నులతో నానందడోలిక నూఁగులాడువేళ—పదునాఱువేల భార్యలతోఁ బ్రణయసాగరమునం దోలలాడువేళ — శ్రీకృష్ణుఁడు మీ నికృష్ట వస్త్రములను గన్నెత్తియైనఁ జూడఁడు. 'ఇద్దఱు నొకచోట నేకాంతమాడంగ, వద్దఁ జేరినవాఁడు వట్టివిధవ' పొండు పొండు" అని యావెట్టివాఁ డర్థరహితముగ నఱువ మొదలిడెను. చిరపరిచితుఁడగు పిచ్చివాని ప్రలాపములు వారి కిదివఱకే విదితము. వారాతనియఱుపులకు నవ్వుచుండిరి. పాత్రకులుం డాతని ""ఓరీ! ఈ గహనాంతరమునందలి దేవాలయమునం దొంటరిగ నెందులకుఁ బరుంటివిరా?"' యని ప్రశ్నించెను.

వెట్టివాడు :—నీకు హాలాహలమైనది నా కమృతము. నా కైశ్వర్యకరమైనది నీ కష్టదరిద్రకరము. నాకు మోదావహమైనది, నీకు ఖేదావహము. నీకు శత్రుఁడు, నాకుమిత్రుఁడు. 'కౌపీనసంరక్షణార్థమయం పటాటోపః'. తెలివితక్కువరాజుకు, బుద్ధితక్కువ మంత్రి. దూడగడ్డికి టెంకాయ చెట్టు నెక్కవలయునా?

పిచ్చివానిమాటల కంతములేక విసువుగొలుపుచుండెను. ఉన్మత్తునియునికిఁ దమకుట్రి కేమైన భంగము కలుగఁ జేయునేమో యని శంకించి, పాత్రకులుం డాతనితో "ఓరీ! నీ విచట నుండరాదు. పవిత్రమగు దైవసదనము, నీయునికిచేఁ గలుషీకృత మగును. ఇటనుండి పొమ్ము" అనెను.

అందుల కాయున్మత్తుఁడు వికటాట్టహాస మొనరించుచు "పిచ్చికపై బ్రహ్మాస్త్రమా ? ఇలులేదు వాలులేదు, కొడుకుపేరు సోమలింగమంట. అంభములోఁ గుంభము, ఆదివారములో సోమవారము. గేదెను బట్టి దూడ. అబ్బను బట్టి కొడుకు. అమ్మను బట్టిఁ కూఁతురు. స్వామినిబట్టి సేవకుఁడు, రాజును బట్టి రాజ్యము. ఊరివారిబిడ్డలను నగరివారు కొట్టిన, నగరివారిబిడ్డలను నారాయణుఁడు గొట్టును" అని యనసాగెను. సింహాచలుఁడు "పశుపతీ ! నీ వాతని జోలికిఁ బోకుము. అతనివలన నుకు కెట్టి యంతరాయము గలుగదు. పిచ్చివాఁడు; వానల నేమిచేయఁగలఁ" డని యనెను.

సింహాచలుని యుపదేశానుసారము, వా రాతని విడిచి దేవాలయాంతర్భాగమునకుఁ బోయిరి. అచట కటికచీఁకటి. సూచికాభేద్యంబై యుండెను. వా రచట నక్కి నిశ్శబ్దముగాఁ గూర్చుండి యుండిరి. దూరమున విపినాంతరమునందలి గోమాయువుల వికృతారావములును, వినుపింపఁ జను కీటకవులకఠోర నినాదములును అంధకారబంధురమగు నా దేవాలయమున వినుటకు భయము గొలుపుచుండెను. నిముసనిముసమునకు, వారు చంద్రగుప్తు నెదురుచూచుచుండిరి. ఎట్టి యలుకుఁడైనను చంద్రగుప్తుఁ డరుదెంచుచున్నాఁడని వారు సన్నద్ధులగుచుండిరి. ఇటులే, కాలము జరిగిపోవుచుండెను.

కొంతసేపటి కంతయు, నాప్రాంగణమధ్యమునకు స్త్రీ పురుషు లిరువురు ప్రవేశించి, దేవాలయాభిముఖులైనడవసాగిరి. ఎలుకకై పొంచియుండు పిల్లులవలె నా దుష్టత్రయము, వారి రాకకై నిశ్శబ్దముగా వేచియుండెను. తిలోత్తమ చంద్రగుప్తుని

మోసపుచ్చి యచటకిఁ గొనివచ్చినందులకు వా రానందించిరి. చంద్రగుప్తుం డామెను "మీచెలియెచ్చట?"యని ప్రశ్నించెను. "మహాశయా! మీరాయాగమనము నామె కెఱింగించి వచ్చెద" నని చెప్పి యామె దేవాలయమువైపునడువసాగెను. శెల్యూకేశ్వ రాదు లంతయుఁజూచుచు వినుచుండిరి. తిలో తమ దేవాలయ ముఁ బ్రవేశించెను. మిహిరుండామెనచటనేయుండ నియమించి, శెల్యూకేశ్వరునితో "మహారాజా ! నేను ప్రాంగణకుడ్యమును దూకి, ద్వారముకడ నిలిచియుండెద. మౌర్యుండొక వేళ ద్వార మునుండి పలాయన మొనరించిన, నే నాతని బట్టుకొనియెద. మీరిద్ద ఱొక్క పెట్టున నాతనిపైఁ బడుఁడు. సాధ్యమైనంత వఱ కాతని సప్రాణునిగా బంధింపుఁడు. మీఱివచ్చినఁ బ్రాణ ములఁ దీయుఁ"డని ప్రాకారము నుత్తరించి, ద్వారముకడ కేగి నిల్చెను.

ఆ హంతకద్వయము పిల్లియడుగులతో నడటుపాటున నా రాజకంఠీరవునిపై దుమికెను. త న్నటుల తటాలున నడ్డగించిన వైరులఁగాంచి, యా వీరవరేణ్యుం డేమాత్రముఁ జకితుఁ డుగాక, మొలనుండు కరవాలమును బెఱికి, ప్రళయకాలరుద్రుని వలె వారలపైఁబడెను. శెల్యూకేశ్వరపాత్రకులు లాతని బ్రతిఘటించి పోరాడుచుండిరి. పరస్పరసంఘర్షణమునఁ గరవాలములు పటపటారావము లొనరించుచుఁ జంద్రకాంతులయందుఁదళతళ మెఱయుచుండెను. పదతాడనముల భూతలము దడదడ యని యదరుచుండెను. అరిద్వయ మా రాజన్యుని బంధింప సర్వవిధ

ములఁ బ్రయత్నించుచుండెను. మోహోన్మత్తుఁడై హేళిని వరణమున కరుదెంచిన చంద్రగుప్తుని మృత్యుదేవత కామించు నట్లు వారు ప్రయత్నించుచు నాతని గవయుచుండిరి. కాని యా ధీరాగ్రేసర చక్రవర్తి వారల లెక్కఁగొనక పరవిక్రమవిహార మొనరించుచుండెను.

ఆ పోరాటమునంతయు వ్యాఘ్రముకడనుండి మిహిరుం డవలోకించుచుండెను. అతఁడు మందిరాభిముఖుఁడై నిలువఁ బడియుండ నాతని వెంటనే వెనుకనుండి కొందరో బంధించి వైచిరి. 'ఓ' యని యఱచునంతలో, నాతని నోరదిమి పట్టిరి. మిహిరుని యవస్థ పులుల సదృశమై యుండెను. బంధితుఁడు మిహిరుఁడు వనాంతరములకుఁ గొనిపోఁబడెను.

మౌర్యునిసాహాయ్యార్థ మప్పుడు కవచాయుధులగు సైనికు లరుదెంచిరి. చూచుచుండఁగనే భారతసైనికు లనేకు లచటఁ బ్రత్యక్షమైరి. శెల్యూకేశ్వర పాత్రకులుల కూపిరిఁ ద్రిప్పుకొనుటకుఁగూడ వీలులేకుండెను. శాత్రవుని సద మదింప సమకట్టియుండువారే, విధివశమున నాతనిచేతులఁ బడునటు లుండెను. దైవము ప్రతికూలమైనదని వారు చింతించు చుండిరి. భయాధీనస్వాంతుఁడై శెల్యూకేశ్వరుఁడు ప్రాణ మందలి తీపిచే కాలికి బుద్ధిఁ జెప్పఁ బ్రయత్నించుచుండెను. పాత్రకులుఁడుగూడఁ బలాయనసూత్రపఠనమునకు సమయము వెదకసాగెను.

నిద్రించుచుండిన హెలీనాఁ డీ యల్లకల్లోలమునకు లేచి యచటికిఁ బరుగెత్తెను. అతఁ డా రంగమునంతయు గంతులు

వైచుచు "అత్యాశ యధికనష్టదము. ఏ విత్తు కా వృక్షము ఏ కర్మ కా ఫలము. ఈ చేత చేఁత, ఈ చేత ననుభవము. బూల రువ్విన వానిని బూల రువ్వరు. గోవునుజంపి చెప్పులుదానము చేయుటా! కాకులనుగొట్టి గ్రద్దలకు వేయుటా? పిల్లిశాపము లకే యుట్టి యూడిపడునా! మంత్రములకే మామిడికాయలు రాలునా! మోక్షమున కనిపోఁగా మొసలి లాగుకొనిపోయి నది" అని యఱచుచుండెను. అచటి కావల నిలువఁబడి తిలోత్తమ యీ నాటకమునంతయుఁ జూచుచుండెను. భయానకబీభత్సదృశ్యమయ్యు, నా యబల కెట్టివికారమును గొలుప లేదు. విషయపరిణామముల కామె వెఱఁగందలేదు.

ఇఁక నిచ్చట రణాంగణము. భారత సార్వభౌముఁడు వెన్నుఁదీయక వారితోఁ బోరాడుచుండెను. శూరాగ్రేసరుఁడు చంద్రగుప్తుఁడు, ధనుర్విర్ముక్తాశుగముపగిది జివ్వుజివ్వున శెల్యూకేశ్వరునిపైకిఁ బోయి, యొకపెట్టున నాతని నిరాయుధునిజేసి బంధించెను. జిత్తులమారియుఁ బిఱికిపందయునగు పాత్రకులుఁడు నిశ్చేతనుఁడై నిలిచెను. అతని సర్వాంగకములు గడగడ వడఁకుచుండెను. రాజాజ్ఞచే నాతఁడుకూడ బంధింపఁబడెను. బందీకృతుఁడై యుండిన శెల్యూకేశ్వరుని కరాంగుళియందలి రాజముద్రికఁ గైకొని, చంద్రగుప్తచక్రవర్తి యెచటికో పోయెను. తిలోత్తమ యాతని ననుగమించెను. శెల్యూకేశ్వరపాత్రకులుల్ఁ దీసికొని భారతసైనికులు తమ శిబిరమునకుఁ బోసాగిరి. పిచ్చివాఁడు వారిని వెంబడించి,

"పులిఁ జూచి పిల్లి యచ్చుపడి మున్నేని
అలమట నాహార మంగట నేమిటికి ?
వతనంబునకు పక్షిరాజును జేరి
ఆత్మభయంకరదంష్ట్రిమాత్రిఁ గూల నేల ?
పాలని భ్రమసెంది భ్రాంతిమై విసము
గ్రోలి ప్రాణంబులఁ గోల్పోవ నేల ?
అని యఱచుచు పోవుచుండెను.

# ఇరువదియొకటవ ప్రకరణము.

## విమోచనము 1.

ఆగర్భ శ్రీమంతురాలును, నవ శిరీష కోమలాంగియు నగు హేళిని కటికష్టదశను గల్పించిన తండ్రి నామె దూఱుచుండెను. శోకాతిశయముచే నుష్ణాశ్రువు లామెనయనముల నుండి జాలువాఱుచుండెను. వినాళనలిని విధమున నా రాజకుమారిమోము వన్నె వాసి యుండెను, వానలేని వల్లిక గతి నాతరుణిమేను వాడియుండెను. ఆమె చెఱసాలఁ గూర్చుండి వినువీథిఁ జను హిమాంశునివంక వాతాయనము నుండి చూడ్కి నిగిడించుచు జిత్తరువుపోలె చేష్టలఁ దక్కి యుండెను. ఆమె హృదయమున నెన్నియో యాలోచనలు ప్రభవమొంది యంతర్హితములగుచుండెను. అట్టియెడ నామెకు గవాక్షముకడఁ దలుపులుదీయుశబ్దము వినఁబడియెను. ఆమె యా వైపుఁ జూచునంతలో నచటికిఁ దిలోత్తమ యరుదెంచి, 'హా' యని హేళిని నాలింగనమొనరించుకొనెను. ప్రియసఖి యవస్థ నామెచూడఁజాలకపోయెను. హేళినియెడ నానియుండు తిలోత్తమహృదయనవనీత మామె వేడి నిట్టూర్పులచేఁ గరఁగి యశ్రురూపమున బొటబొటఁ బడుచుండెను. వారిద్దఱటు లేడ్చుచుండిరి. హేళిని యించుక తెలివితెచ్చుకొని, "అమ్మా! తిలోత్తమా! నే నిపుడు రాజకుమారిని గాను. నావలె నీవుకూడ దరిద్రదేవత నింటికిఁ జేరంటమున కెందులకుఁ బిలిచెదవు! పొ"మ్మని గద్గదికతో ననలేక యనెను.

"హేళినీ! నీ విభుఁడు రాజకుమారుని గాంచన్న మానె. నాకేమాత్రము కూర్మి చెప్పెలిని గానా! అయ్యో! నీ కెంతటి గతి పట్టినది!"

"తిలోత్తమా! నేను మందభాగ్యురాలను. అడవి యందే పుట్టి, అడవియందే పెరిగి, అడవియందే వ్రస్గిపోవు పుష్పరాజమువలె, నా జీవిత మింటుల నిరర్థకముగ నశించి పోవలయు నని విధివిధాన మైయుండ, వేఱువిధి యెట్టు లగును?"

"హేళినీ! సంతాపమున కిది సమయము గాదు. నీ బంధవిమోక్ష మిప్పుడే కాఁగలదు. నిన్ను నీ ప్రియునికడకుఁ గొనిపోయెద రమ్ము. లెమ్ము. పతివ్రత యగు కాంతకుఁ గాంతుని బాసి యుండుటకంటె వంత యే మున్నది?"

"చెలీ! కాలకింకరులవలె మన ప్రాణముల వెన్నాడు కారాగృహరక్షకుల నెట్లు కనుమఱుగించెదవు?"

"అమ్మా! మాటలకు నాలోచనల కిది కాలముగాదు. అంతయు స్వయముగఁ జూతువు. నడబొమ్మవలె నావెంట రమ్ము."

తిలోత్తమ యుపదేశానుసారము హేళిని మాఱు మాటాడక లేచి, యామెవెంటఁ దరలెను. ద్వారముకడఁ గారాగారరక్షకులు కునుకుపాట్లు పడుచుండిరి. వారా సఖీ ద్వయమును జూచి, యొదిగి నిల్చిరి. హేళినీ తిలోత్తమలు, యవనశిబిరమును వీడి, వితస్తానదీకూలముననే నిర్భయముగా నెంతయో దూరము నడచిరి. అచట నదీజలముల

నొకపడవయందుఁ జంద్రగుప్తసార్వభౌముఁడు కూర్చుండి యుండెను. పిచ్చివాఁడుకూడ నచట నొడ్డుననే నేమియో పలుకుచు, నీ తట్టునకా తట్టునకుఁ దాఁ గాడుచుండెను. తిలోత్తమ తనచెలితో నాపడవనెక్క సంజ్ఞ చేసెను. మంత్రముగ్ధవోలె హేళిని యాతరణి నధిరోహించి చంద్రగుప్తుని ప్రక్కఁ దలవాంచి కూర్చుండెను. ఆత్మహృదయాధిదేవత ప్రత్యక్షమై యెదుట నుండుటఁ జేసి, చంద్రగుప్తుఁ డానంద పరవశుఁ డయ్యెను. హేళినినయనములనుండి యానందాశ్రుకణములో—దుఃఖాశ్రుకణములో—జారి క్రిందఁబడుచుండెను. బాష్పనిరుద్ధము లగు చంచలేక్షణములచే నామె మనోహరుని జూచుచుండెను. చంద్రగుప్తుఁ డామెయవస్థను జూచి చకితుఁడై "మనోహారిణీ! గాంధర్వమున నిన్నుద్వాహమాడ నమకట్టిన నాసాహసమును మన్నింపు" మని సానునయాలాపము లాడెను. ఆనందాతిశయముచేతనో, దుఃఖభరము చేతనో హేళిని తనమస్తకము నాతనిభుజముల నానించి, అరమోడ్పు కన్నులతో సార్వభౌముని ముఖమును జూచుచుండెను. చంద్రగుప్తుఁడు పడవ నడపసాగెను. అటులా నూతనవధూవరులఁ దీసికొని, యా తరణీరత్నము వితస్తాతరంగిణియందా యానందమయసమయమున హైందవస్కంధావారమున కభిముఖముగాఁ బోసాగెను.

ఉన్మత్తుఁడును, తిలోత్తమయు నచటనే నిలిచి వారి జూచుచుండిరి. వెనుకకుఁ దిరిగి, తిలోత్తమ యవనశిబిరము వైపు పోవ మొదలిడెను. పిచ్చివాఁడుకూడ నామెననుసరించెను.

ఆతం డామెతో నేమియో సంభాషించుచుండెను. అర్థవిహీనములును, హాస్యరసమిశ్రితములును నగు నా పిచ్చివాని మాటల కామె యెంతవెడ నవ్వు నాపుకొనఁజాలకపోయెను. కొంతదూరము మాత్ర మామెను వెంబడించి, వెనుకకుఁ దిరిగి పరుగెత్తును. తిలోత్తమ యతనిశిబిరమును ప్రవేశించి, మలయకేతువు గుడారమునకుఁ బోయెను. అప్రమత్తుఁడై, ద్వారము కడఁ గూర్చుండియుండు ద్వారపాలకుం డామెను జూచి

"తిలోత్తమా ! వేళకానివేళ నెందులకు వచ్చితి" వని ప్రశ్నించెను.

"ఓయీ ! రాజేంద్రుఁడు మలయకేతువును సత్వరము పిల్చుకొనిరా నా కానతిచ్చెను."

"అంత యవసరకార్య మేమి వచ్చినది?"

"ఏమో ? బికారుల మగు నీకును నాకును జెప్పుదురా ? కాని, సూర్యోదయములోపల, మలయకేతువునకు దాస్యవిముక్తియో, దేహవిముక్తియో కాఁగల దని మాత్రము చెప్పఁగలను. అనవసరప్రసంగములచే న న్నడ్డగింపకుము."

"సరియే, రాజకీయములతో నాకు నిమిత్త మేమి ? మహారాజునాజ్ఞ నే నెఱుంగు టెట్లు ?"

"ఇదిగో యాతని యంగుళీయకము. చాలునా?"

"ఔను ! రాజశాసనమున కడ్డేమి కలదు!"

నిద్రితుఁడు మలయకేతు మహారాజునకీ సంభాషణచే మెలఁకువ వచ్చెను. తిలోత్తమ తనకడ కరుదెంచుచున్నదని యాతఁడు గ్రహించి, ద్వారమువైపు చూచుచుండెను. గది యందలి దీపము బాగుగా వెలుఁగుచుండెను. తిలోత్తమ యాతనికడకుఁ బోయెను. ధీరురాలగు నామె కెందులకో మలయకేతువును జూచుటతోడనే సిగ్గు కలిగెను. "తిలోత్తమా! సంగతి యేమి! ఎందుల కిట్టి సమయమున నీరాక?" యని యాతఁ డడిగెను. తిలోత్తమ యాతనితో రహస్యముగా మాటలాడ సన్నఁ జేసెను.

తిలో:—రాజేంద్రా! భీకరపంచాస్యమును బంధించిన భయంకరకిరాతుఁడు చిక్కినాఁడు. రమ్ము! నీకు బంధవిముక్తియైనది.

మలయ:—తిలోత్తమా! శెల్యూకేశ్వరుఁడు బంధింపఁబడెనా? ఎట్లు? చంద్రగుప్తసార్వభౌముఁడే బంధించెనా? బంధించు టెందులకు? ఆ దుర్మార్గు నేల నాఁమహా ర్యుఁడు హాత మొనర్పలేదు?

తిలో:—కారణము దురూహ్యము. శెల్యూకేశ్వర పాత్రికులులు బంధితులైరి. మిహిరుఁడు స్వస్థానముఁ జేరెను. ఆ దుష్టత్రయముకథ యిది. తెల్లవారునప్పటికి యుద్ధము. అరక్షితులను, అనాథులు నగు యవనులపైఁ బ్రొద్దుపోడుచు నప్పటికంతయు భారతీయులు పడఁగలరు. నీ విపుడు స్వరాష్ట్రమునకు టెక్కెలపైఁబోయి టెక్కెలపైఁ జతురంగబలము

లతో హైందవులకు సాయమొనరింప రావలయును. రమ్ము ! మాటల కిది సమయము గాదు; స్థలము గాదు.

మలయ:—అవును; భైరవుని విషయము ?

తిలో :—హైందవప్రతిభాస్త్ర మాతనిపైఁ బ్రయోగింపఁబడినది. ఆ యస్త్ర మాతని నాశ్రయించి యుండిన, యాశాభూతమును జంపివైచినది. అతని కఠినహృదయమును గఱిగించినది. ఇప్పుడు గోకులును, భైరవుఁడును పరస్పరమారణోత్సాహులై యున్నారు. భారత రాజనీతి యాతనికి మాతృపాదసంసేవనభాగ్యమును బ్రసాదించినది. నరకమునుండి నాకమున కెగఁ జిమ్మినది. పరిస్థితులు తలక్రిందు లై పోయినవి. ఇం కేమి కావలయును ? రాజకంఠీరవా ! రమ్ము ! పోవుదము.

మలయ:—తిలోత్తమా ! నీ పలుకు నిజమైనది భేదోపాయప్రయోగముచే భైరవునకు బుద్ధివచ్చినది. అతఁ డిఁక సన్మార్గవర్తి కాఁగలఁడు. అటవికజననాయకుం డగు నాతని సాయము, భారతీయుల కిట్టి సమయమున మిగులనమూల్యము.

తిలో:—మీవిషయ మే మనిమెదురు ? వ్యవధి లేదు. ఆనతి యిందు.

మలయ:—తిలోత్తమా ! మాతృదేశారాధనాతత్పరుండగు చంద్రగుప్తసార్వభౌమునకు నాచేనైనంత సాయ మొనరించి, విపత్తుల నుక్కడగించుటకంటె పుణ్యప్రద

మును, బ్రమోదావహమును, గర్తవ్యము నగు కార్యము వేఱొం డేమి కలదు ?... ...కాని, తిలోత్తమా ! చెప్పుటకు సిగ్గగుచున్నది. ధీరుఁడ నై పుట్టి, ధీరాతిధీరుఁడ నై పెరిగి, ధీరాగ్రేసరచక్రవర్తి యని శత్రుస్తవమును బడసిన నే నిప్పుడు దొంగనై, తుచ్ఛప్రాణేచ్ఛచే మానమునకు హస్తోదకముల విడిచి ఒక్క స్త్రీసాహాయ్యమునఁ దప్పించుకొని పోవుటకు నా మానస మొప్పకున్నది.

తిలో:—భూమీశా ! మోసమును మోసముచేతనే జయింపవలయును. చోరులై యదటుపాటున మీ స్వేచ్ఛాధనము నపహరించిన గ్రీకులకుఁ దగురీతి బుద్ధి చెప్పవలదా ? రాజచంద్రా ! మౌర్యరాజేంద్రునికడనుండి దూతికనై మీకడ కరుదెంచినదానను. మీ రిందుల కన్యథా తలంప వలదు. సకలరాజనీతికోవిదులరు; మీకు నాయట్టి యబల చెప్పెడి దే మున్నది ? మీకుఁ దెలియని దేమున్నది ? ప్రస్తుతము పరిస్థితులు మన కనుకూలముగ నున్నవి. అదృష్టదేవత మిమ్ములఁ గూవెట్టి పిలుచుచున్నది. మాతృదేవత ప్రబోధించి పలుకుచున్నది. అనతిదూరమున మీకొఱకై యుత్తమాశ్వ మాయత్తముగ నున్నది. పొండు, మీ రాజ్యమునకుఁ బోయి మఱలి రండు. స్వేచ్ఛాగిరిశిఖరమునుండి, దాస్యాఘాతమునకు దొర్లనుండు భారతభాగ్యదేవత నుద్ధరింపుడు !

తిలోత్తమా ప్రబోధముచే మలయకేతువు నిరుత్తరుం డయ్యెను. "తిలోత్తమా ! నీ వింత చెప్పవలయునా ? కాని యొక్క విషయము ! మాతృదేశ సముద్ధరణ ప్రయత్న

మును నే నీచెఱసాలనుండి పరుగెత్తిపోయిన నీవదనేందుసందర్శనాభావమునఁ బరితపించితిని గదా బాలా! ఇందుల కేమి యుపాయ" మని మందహాసాంచితవదనమున మలయకేతు వనెను. అందులకు దిలోత్తమ యించుక నవ్వుచు "రాజకంఠీరవా! జాగుసేయకుము. పరిహాసముల కిది వేళగాదు. త్వరలో నీయభాగ్యురాలు తనపునర్దర్శనభాగ్యము నపేక్షించుచున్న" దని పోవుటకు ముందున కడుగిడి 'లేచి రా' మ్మని యాతనికి సన్నఁజేసెను. మలయకేతువు లేచి యామె ననుగమించెను. తిలోత్తమ ముందును, నతం డామెవెనుకను నడుచుచుండిరి. రాజాజ్ఞానిబద్ధు లగు ద్వారరక్షకులు వారిజోలికి రాలేదు. క్రమముగ వారిద్దఱు గ్రీకుసంధావారమును విడిచి, గహనాంతరమునఁ బడిపో మొదలిడిరి. మలయకేతు వామెను జమత్కారముగా "తిలోత్తమా! నీ వబలవా? సబలవా?" యని యడిగెను. తిలోత్తమ యందులకుఁ జిఱునవ్వుతో "సబల యగునబల" యని ప్రత్యుత్తర మొసంగెను. ఇంతలో నెచ్చటినుండియో యున్మత్తుం డరుదెంచి వారలఁ గలిసికొనియెను. ఉన్మత్తుని మాటలచే విసుగుఁజెందియుండు మాపాఠకశేఖరుల కింకను, నాతని యనుచితభాషణముల వినిపించు టంత సమంజసము గాదు. యథారీతి నాతం డేమియో మాటలాడుచుండెనని మాత్రము చెప్పెదము. అచట నొకచెట్టునీడ నశ్వము కట్టఁబడి యుండెను. తిలోత్తమ యా గుఱ్ఱమును మలయకేతువునకుఁ జూపి "దేశభక్తాగ్రేసరా! నీకొఱకై యీ సైంధవము సిద్ధముగ నున్నది. దీని నెక్కిపోయి క్షణములో రావలయును. చంద్ర

గుప్తుఁడు వి న్నదుల్లు చూచుచుండు” ననెను. తిలోత్తమ వాక్యానుసార మాతఁ డాతురంగము నధిరోహించి, చూచుచుం డఁగనే యదృశ్యుఁ డైపోయెను. కర్తవ్యము నేదియోయాలోచించుకొనుచు తిలోత్తమ వెనుకకుఁ దిరిగెను. పిచ్చివాఁ డామె ననుగమించెను.

---

# ఇరువదిరెండవ ప్రకరణము

## విమోచనము 11.

ఇంకను బ్రొద్దుపొడువలేదు. శెల్యుకేశ్వరుఁడును, పాత్రకులుఁడును హైందవకారాగారమున బద్ధులై యుండిరి. శెల్యుకేశ్వరునియవస్థ యిప్పుడు కరము శోచనీయంబై యుండెను. ఏమి కావలయును? చిన్ననాఁటినుండి నిండుగోముగఁ బెఱిగిన ప్రియకుమారి శత్రు వయ్యెను. భారతదేశదండయాత్ర కాహ్వానించి యింతకాలము సంధిభాజనుఁడై నిలిచియుండిన భైరవనాయకుఁడు కాలవైపరీత్యమునఁ దనకు సాహాయ్యమొనరింపకుండుటయే గాక, మార్పుఁజేసి తన్ను మట్టుపెట్ట నున్నాఁడు. అశేషశేముషీ బలముచేఁ దమవ్యూహముల కుపాయములఁ బన్నుచుండిన మిహిరునిగతి యేమైనదో తెలియదు. స్వామిభక్తియుతుఁడును, సేనానియు నగు పాత్రకులుఁడుకూడఁ దనవలెనే చెఱసాలఁ జిక్కియున్నాఁడు. ఒకటి యనుకొనిన మఱియొకటి యైనది. త్రెక్కలఁదెగిన పక్షులవలె, కోఱలూడిన నాగములవలె— వారిప్పుడశక్తులై యున్నారు. ఇట్టి యూహాలచే శెల్యుకేశ్వరుని మానసవీధి నిండ, నతఁడు చెఱసాలయందుఁ గటగటాలు పట్టుకొని నిలిచి, వియత్పథమునఁ జరించు తారాపతివంకఁ గన్నార్పక చూచుచుండెను. హరిణాంకుఁడు తన్నుఁ జూచి నవ్వుచున్నాఁడని యాతఁడు భావించుచుండెను. తనజీవితచారిత్రమంత పరిహాసభాజనమైనందులకు, శెల్యుకేశ్వరునిమానసము శోకరోషాకులితమైపోయెను. త్రెప్పవాల్పక నాఁడు చంద్రబింబము నన

లోకించుచున్నాఁ డనియేకాని, ఆతనిచూనసము మానసము నం దుండలేదు. అది యెక్కడెక్కడనో తిరుగులాడుచుండెను. ఏమేమియో పరివర్తనములఁ బొందుచుండెను. ఒక్కసారి, తనప్రక్క గ్రుడ్ల నీరు గ్రమ్మఁ గ్రిందఁజూచుచుఁ గూర్చుండి యుండు పాత్రకులు నాతఁ డవలోకించెను. దుఃఖద్యోతకము లగు చూపుల నాతఁడు శెల్యూకేశ్వరునిపైఁ బఱపెను. దుర్భరావమానముచేతను, గారాగృహబంధనము చేతను పాత్రకులుని హృదయముకూడఁ గలఁతఁబారి యుండెను. శెల్యూకేశ్వరుం డాతని జూచుట నూని, మరల నాకసమువైపుఁ జూడసాగెను. శశాంకుఁడు మేఘశకలాచ్ఛాదితుఁడై మరల విడివడుచుండెను. శెల్యూకేశ్వరుని హృదయముగూడ స్నేహబలముచేతనో, మఱెందుచేతనో దుఃఖబంధురమయ్యెను. ఆ శోకాంధకారమున నేమియు నగుపడుట లేదు. అంతయుఁ జీఁకటి. చిమ్మచీఁకటి. ఎందును బోవుటకు లేదు. ఏ ప్రక్కనే ముండునదియుఁ దెలియుట లేదు. ఆతనినయనవారిదములు బాష్పజలకణముల వర్షించి కొంతవడికి తెఱపిఁ గాంచెను. ఱాతిబొమ్మవలె నాతఁడు కూర్చుండియుండెను. పాత్రకులుఁడు తనప్రభువుని దురవస్థను గాంచి లేనిధైర్యమును దెచ్చికొని "రాజేంద్రా! ఎందు కిటుల దుఃఖించెద" రని మంద స్వరమునఁ బ్రశ్నించెను.

తోడనే శెల్యూకేశ్వరుఁడు రౌద్రరూపుఁడై చివాలున నాతనిపైకి లంఘించి "దురాత్మా! నావంశవృక్షమునకు నీవు వేరుపురుఁగవు. ఈ యనర్థమున కంతటికిని నీవే కారణ మని తూలనాడెను.

పిలిచితిని. నీవు తేనెఁబూసిన కత్తివి ? ఇచటనుండి పొమ్మా వల ! నీ వెదుటనుండుటవలన నాశరీరము మండిపోవుచున్నది."

"తండ్రీ ! నాపై నింత కోప మెందులకు? నీహితకారిణి నగు నావిన్నప మాలకింపుము."

"కులనాశకారిణీ! ఱంకులాఁడి ! బొంకులాఁడి! నాతో సపహాస్యము లాడెదవా ! అంగిట విషమును, నాలుక బెల్లము నుగల చెనటీ ! నాతో మాటలాడవలదు. నాయెదుట నుండ వలదు. పొ మ్మావల."

"జనకా ! నిష్కారణముగ నేల దూరెదవు ? నా మనవిని వినుము. కామిలావ్యాధిచే బాధపడువానికిఁ బ్రపంచమంతయు పసుపుగాఁదోఁచునటుల కుటిలక్రూరమానసుఁడవగు నీ కీ లోకమునందలి మనుజులపై వైరభావ ముదయించుచున్నది. మౌర్యరాజమణి దీనమందారుఁడు. ఆతని తోడి మీసఖ్యము ప్రపంచశాంతికారణము."

"ఛీ ! ఛీ ! స్థలాంతరమునకుఁ బొమ్ము ! సత్వరము పొమ్ము ? నీ యునికి నాకు దుస్సహముగ నున్నది. ఎంతటి యవమానము ! ఎంతటి కండకావరము ! ఎంతటి సాహసము ! నీ సదుపదేశాకర్ణనమున కిట నెవ్వరు లేరు. నీకుఁ దండ్రి నగుటచే నా జన్మము హీనమైనది. నా బ్రదుకు నిరర్థకమైనది. నాచారిత్రము నవ్వులపా లైనది. నాకుఁ బిచ్చి యెత్తినది. నన్ను మృత్యువు దఱియుచున్నది. ఓ మృత్యుదేవతా ! నాకడనుండి పొమ్ము ! ఇచట నిలువ వలదు."

"తండ్రీ! ఇఁక నా ప్రయత్నము లేదు. ఇనుముఁ జేరిన వేడివేలుపుగాకు సమ్మెటపెట్లు. సడ్డితోఁ బట్టకూడ నెండ వలయును. దురాశాపరులును, దుర్మదాంధులును, ముఖస్తుతి పరులు నగు నిట్టి పాత్రకులాఘములనంటి నారికే యిట్టి యవస్థ ప్రాప్తించినది. తండ్రీ! నాపితృభక్తి యనంతము. నిష్కళంకము. నిరాతంకము. ప్రాణముకంటెఁ బ్రాణముగఁ జిన్ననాఁట నుండియుఁ బెంచి, పెద్దఁ జేసిన మీయందు వైరభావ ముంతునా? ఏ యనుగ్రహించిన నీ దేహముతోడనే మిమ్ముల నాపదంబుధి ముంచుదునా? మీకుఁ గీడెంతునా? నా మనవి యాలింపుము. యవనసైన్యసఖ్యముచేఁ బ్రపంచశాంతి చేకూర్పఁగలదు. శాంతిసౌధము చిరస్థాయిగా నిలిచియుండఁ గలదు. భువనైకసుందరమూర్తి, జగదేకవీరుఁడు, సద్గుణఖని, చంద్రగుప్త సార్వభౌమచంద్రుఁడు మీకు జామాతయగు భాగ్యమొదవఁగలదు. మీయల్లుని సంధి కొడంబడునటుల చేయుభారము నాభుజములపై నిడుఁడు. దేశక్షోభకరంబగు బనరంబు నాపి, అనంతకోటిప్రాణికోటులఁ గాపాడి, పుణ్యముఁ గట్టికొనుఁడు."

"రాక్షసీ! నీ యుపన్యాసము వెల్లిఁగలిపిన చింత పండైనది. నీవు మారిపి. మానముపోయిన ప్రాణము నిరుప యోగము. వేళ కిన్ని మెతుకులు గతికి తిరుగాడుకుక్కగూడ తన యజమానియెడ విశ్వాసముతోఁ బ్రవర్తించును. బుద్ధిలేని గాడిదకూడ స్వామిభక్తికిఁ బేరొందిన జంతువు. నీవు కుక్క

కంటె నీచురాలవు. గాడిదకంటె నధమాధమురాలవు. నీ వా హైందవుని గామించినదినమే నా పుత్రిక చచ్చె ననుకొంటిని. మొలబంటిగుంటలోఁ బాతిపెట్టితి ననుకొంటిని నీ వింక నిచట నిలువకుము. పొమ్ము."

"జనకా! కరకర ప్రొద్దు పొడుచునప్పటికి, హైందవులు యవనులపైఁ బడఁగలరు. మీచమూసమూహ మంతయు హతమైపోఁగలదు. భైరవనాయకుఁడు మీ కిపుడు గర్భశత్రు వయ్యెను. ఈ విధమున మీరు పట్టినకొమ్మ ఫెళ్ళున విఱిఁగినది.మలయకేతువు బందిగమునుండి తప్పించుకొనినాఁడు. భారతీయులకు బానిసలమై యాతం డరుదెంచి, యెప్పుడో పోనుండు యవనరాజ్యలక్ష్మి జీవముల నిప్పుడే పోకార్ప నున్నాఁడు. నాయత్నము లేదు. మీగర్భమున నుద్భవమొందుటచే, మీ క్షేమకాంక్షిణినై నావలన నైనంతసాయము చేసితిని. కాని యంతయు నిరుపయోగమైనది. ఎవ రేమి చేయఁగలరు? 'నొసటఁ వ్రాసిన వ్రాఁతకన్నఁగలదె నూఱేండ్లు చింతించినన్' అని యార్యవాక్యము. కాని, మీ సర్వసైన్య మంతరించినను, మీపైమాత్ర మీఁగమైన వ్రాలకుండఁ జూచుకొనుట నా భారము. స్థానభ్రష్టతకలిగినను, మీకు సౌఖ్యభ్రష్టత మాత్రము గలుగకుండునట్లు చూచుకొనియెద. మీగర్భమునఁ బుట్టినందుల కింతమాత్రము నా యొనరించు సేవ."

హేళిని గిఱ్ఱునఁ దిరిగిపోయెను. పాత్రకులుం డింతసేపుగా, వారిసంభాషణము నాలకించుచు బెల్లముకొట్టినఱాయి

వలెఁ గూర్చుండియుండెను. శెల్యూకేశ్వరుని దృష్టి యటునిటు మరలక హేళినియందే నిలిచియుండెను. అసంతృప్త యగు దివ్యాంగనవోలె, ద్వారమువాటి హేళిని చూపు మఱుఁగై పోయెను. "హతవిధీ!" యని శెల్యూకేశ్వరుఁడు ఫాలమును మోఁదుకొనుచుఁ గూలఁబడెను. అతని హృదయాబ్ధియందు దుఃఖతరంగములు ఘూర్ణిల్లసాగెను. అధోవదనుఁడై యాతఁడు కూర్చుండియుండెను.

తలుపులు తీయబడ్డ మాత్రనికి వినవచ్చెను. వెంటనే పురుషుఁడొకఁడు లోనికివచ్చి, గవాక్షమార్గప్రసృతప్రత్యూష ప్రభాంకురము లతనిపై వ్రాలునట్లు నిలిచెను. సమవిభక్తాంగక మగు నతనివిగ్రహము, బలపరాక్రమనిలయముగాఁ దోఁచుచుండెను. అతని సహజతేజోవిశేష మున్నతవంశాభిజాత్యమును సూచించుచుండెను. అతం డట్లు నిలిచి "పార్థివేంద్రా! నీవంటి ధరాధిపుని బందిచేసిన రాజనీతి, మిగుల నిష్ఠురమైనది కదా!" యని యనెను.

శెల్యూ:—నీ వెవరవు?

ఆగంతుకుఁడు:—రాజేంద్రా! యువరాజును. పేరు బిందుసారుఁడు.

శెల్యూ:—(రోషముతో) ఓయీ! మీతండ్రి మోసగాఁడు. మాయలమారి. నాచంద్రహాస మాతని రుధిరస్నానమునకై తమకపడుచున్నది.

బింను:—అగునుగాక! శ్రేణీభూతహృదయుల కిట్టిప్రలాపములు సహజములు. జనకుఁడు దుష్టుఁడైన, తనయుఁడు సజ్జనుఁడు కారాదా! ఇది ప్రకృతికి విరుద్ధమా?

శెల్యు:—మీతండ్రికిఁ గన్నులు గానరావు. చేసేతఁ జేసిన కార్యఫలము నాతఁడు త్వరలో ననుభవింపనున్నాఁడు.

బింను:—రాజేంద్రా! కాలము విపరీతమైనయెడ, తృణము వజ్రమగును; వజ్రము తృణమగును. గుండులు తేలును, బెండులు మునుఁగును. కృతజ్ఞత ప్రేరేప, మీకు మేలొనరింపవచ్చితి. వేఱుగాఁ దలంపకుఁడు.

శెల్యు:—కృతజ్ఞతకుఁ గారణము?

బింను:—ఇప్పుడు నేను చెప్పరాదు. మీరు వినను రాదు. చెప్పవచ్చినసంగతి వినుఁడు. సంధి కియ్యకొనుఁడు. కారుణికోత్తముఁడును, శాంతిప్రియుఁడు నగు భారతసార్వభౌముఁడు మాతండ్రి, మీతోడి నెయ్యమునకు ముందంజ వేయఁగలఁడు. ఇదియే రాజనీతిజ్ఞుల సమంజసాభిప్రాయము. మీపక్షమున నీ సంధివిషయమై, వాదోపవాదము లొనరించి కృతకృత్యుఁడ నగునట్లు న న్నాశీర్వదింపుఁడు. మీకు సౌఖ్యముగూర్చుట కన్న వేఱుతలఁపు నాకు లేదు. ప్రాణదాతకు మీ కీ ప్రత్యుపకృతి నొనర్పనున్నాఁడ. ఏ మనియెదరు?

శెల్యు:—పూలమ్మిన యంగడియందే కట్టె లమ్మవలసి వచ్చినది. ఇంతకంటె సంతాపకర మొండు గలుగదు. నా కూఁతురు ద్రోహమతి యైనది. నారాజ్యలక్ష్మి నన్ను విడనాడినది. నాసుఖపరంపరలు మాయము లైనవి. నాయైశ్వర్య మడుగంటినది. నామానము నీటఁ గలిసినది. సిగ్గులేక ప్రాణము

లింకను, ఈ దేహము నాశ్రయించి యున్నది. నేను జీవచ్ఛవమైతిని, ఓయీ! నీయుపకారబుద్ధికి, నీకృతజ్ఞతాతిశయమునకు నాప్రణామములు. మీ జనకుని నాయెదుట ప్రస్తావింపకుము. కర్మఫలము ననుభవింపకమానను. మనియున్న, మగటిమి మెఱయించి రాజ్యలక్ష్మిని గైకొనుము. నీ విఁక నీయుపన్యాసము చాలించి పొమ్ము.

బిందు:—అయిన నీకు రెండు మూడు గడియలలో, యవన పరాజయ వృత్తాంతమును, హైందవ విజయోదంతమును వినుము. సేనానీ! నీ వైన నీ ప్రభుశేఖరునకు హితవు వచింపరాదా?

అని బిందుసారుఁడు పాత్రకులునివైపు తిరిగెను. అతని వెనుకనే శెల్యూకేశ్వరుఁడు నిలిచియుండెను. అదటుపాటున నాతఁడు కరిపైకి లంఘించు కంఠీరవము పగిది, బిందుసారుని పైకి దూఁకి తనయుడుపుల నడిపఱకే నుప్తపఱచుకొనియుండిన చిక్కటూరితో నాతని వీపున గ్రుచ్చెను. ఆ యాఘాతముచే బిందుసారుఁడు దబాలున బోరగిలఁబడెను. సర్దుకొని, లేవఁబోవులోఁగా, పాత్రకులుఁ డాతనిపై కుఱికి, తనకత్తిచే నాతనివక్షమునఁ బొడిచెను. బిందుసారుఁడు వెలికిలఁ బడెను. కత్తిపోటువలన నాతని కించుక స్మృతి దప్పెను. అది యేతడవుగా కెల్యూకేశ్వరపాత్రకులులు, చెఱసాలనుండి బయటికిఁ బరుగెత్తిరి.

కారాగారవిముక్తులై సంరంభమున ద్వారమువైపు బరుగెత్తువారి నిరుపుర, నిదురమత్తున నుండు ద్వారపాలుం

డవలోకించెను. ఆతఁడు వారిగతి కభ్యంతరము గల్గించుటకై కైదువులు దూసి వారి కెదురు జనెను. కాని దృఢప్రతిజ్ఞులై తెగఁబడియుండు వా రొక్కపెట్టున నాతనిపైఁ బడి, యొక్క దెబ్బతో నాతనితల నెగురఁగొట్టిరి. పాపము! ద్వారపాలకుఁడు విలవిలఁ దన్నుకొనుచుఁ బ్రాణముఁ బాసెను. అడ్డులేనిదారిఁ బడి, వారు పాఱిపోయిరి. వారి నెవ్వరును జూడలేదు. ఈ విషాదాంతనాటకఖేలన మెవ్వరికిఁగాని తెలియదు. చెఱసాలయందు బిందుసారుఁడు రక్తప్రవాహమునఁ దోఁగియూఁగుచుండెను. ఖండితశిరస్కుఁడు, ద్వారపాలుని మృతకళేబరము కారాగృహప్రాంగణమునఁ బడియుండెను. ఇంతలో బల్లునఁ దెల్లవాఱెను.

---

# ఇరువదిమూఁడవ ప్రకరణము.

## తగిన శాస్తి.

కర్మసాక్షి తూర్పుకొండపై కెక్కి లోకమునంతటిని దేదీప్యమానముఁజేయుచుండెను, హైందవ శిబిరముల రణదుందుభులు దిక్కులుపిక్కటిలువార మ్రోఁగుచుండెను. సాయుధులు భారతసైనికులు సింహనాదము లొనరించుచుండిరి. వారి మోముదమ్ములు గాంభీర్యసదనములై, వైరిహృదయభీకరములై యుండెను. రక్తవర్ణాంబరధారులును, రక్తకుసుమహారశోభితకేశులును, రక్తోద్రిక్తనేత్రులును, రక్తపానాతురకరవాలధారులును నగు వీరభటులు పంక్తులుదీరి, సక్రమముగ సవిలాసముగ నిలిచియుండిరి. అరదములు, ద్విరదములు, తురగములు, సాదియోధవీరసహితముగ వరుసలు దీరియుండెను. సువర్ణాస్తరణాచ్ఛాదిత మగు భద్రదంతావళము, ప్రస్థానభేరీనినాదమునఁ గాఁబోలు! తొండమును బైకిఁ జాచుచు నత్యుత్సాహమున నిలిచియుండెను. అదియే, చంద్రగుప్త సార్వభౌముని పట్టపు టేనుఁగ. ఇంకను జక్రవర్తి రాలేదు. కంచుకోష్ణీషపాదుకసమరాలంకారవిలసితగాత్రులు దళవాయులు హయముల నధిరోహించి, సైనికపంక్తుల దిరుగుచు, సర్వసైన్యాధ్యక్షుని కొఱకును, సార్వభౌమేంద్రుని కొఱకును వేచియుండిరి. పెద్దకాలమునకు దమభుజముల కండూతితీఱు కదన మొదవినందులకు — భారతీయవిక్రమప్రదర్శనసమయ మబ్బినందులకు_సంతసించుచు, సైనికులొండొరుల హెచ్చరించుచుండిరి. ఉత్సాహవాక్యసారములచే, సైనికుల హృత్సరో

వనములు నిండి పొంగి పొరలుచుండెను. అందఱును గయ్యమునకుఁ గాల్దువ్వుచుండిరి. ఎవ్వరును జివ్వకు వెనుదీయుట లేదు. పిఱికిపంద మందునకైన నగపడుట లేదు. ఈవిధమున హైందవ చతురంగబలమంతయు మార్తురఁ బరిమార్ప ముందంజవేయుచుండెను. అందఱును సార్వభౌమునియాగమనమును నిరీక్షించుచుండిరి.

సేనాని భాగురాయణునితోడను, మంత్రిశేఖరుల తోడను దనగుడారమున సార్వభౌముఁడు మంతన ముండెను. ఆనంద రసాలవాల మగు నా పార్థివేంద్రుని యాననాబ్జము నయనానందదాయక మైయుండెను. ఆకర్ణాంతములగు నారాజశేఖరుని నయనములనుండి ప్రసన్నవిలోకనములు వెలువడుచుండెను. విజయదామమును గైకొని విజయలక్ష్మి యదృశ్యగా, సార్వభౌముని ముంగల నిలువఁబడియుండెను. భారత జనయిత్రికూడఁ బ్రమోద మధుర కంఠస్వరమున 'జయీభవ విజయీభవ' యని యాశీర్వదించుచుండెను. అటులా రాజకంఠీరవుఁ డొకనూతనపురుషుని మనవులఁ జెవియొగ్గి వినుచుండెను.

"ప్రభువరేణ్యా! రాజసేవనము, మాతృపాదరాజీవ సంసేవనము నా ప్రాణముకన్న నెక్కువ. మీయాశీః ప్రభావమున—మీయాజ్ఞాబలమున—నెట్టులో యొకట్టుల కృతకృత్యుఁడ నైతిని. మోసమును మోసముచేతనే జయింపవలయు నను చాణక్యోపాధ్యాయునినీతి సార్థకపఱచితి. కాలవ్యాళము కోఱలూడఁదీసితి. శెల్యూకేశ్వర పాత్రకులులు మనబందీ

లైరికదా!" యని యాతఁడు విన్నవించుచుండెను. రాజశేఖరుం డాతనికిఁ బ్రసన్నుఁడై "చందనదాసా! నీచరిత్ర సంస్మరణీయము. పుణ్యప్రదము. నీభక్తి యాదర్శప్రాయము. నీ చేయు సేవ యమూల్యము. అనుపమానము. కొండంత దేవునకుఁ గొండంత పత్రిఁ దేఁజాలము. ఇదిగో నీ బహుమాన" మని తన కంఠసీమ నలంకరించి యుండు రత్నహారమును దీసి, యాతనికిఁ గానుకగా నొసంగెను. ఆతం డద్దాని 'భాగ్య' మని గ్రహించి కన్నుల కద్దికొని కూర్చుండెను.

భాగురాయణుఁడు నిలువఁబడి "సార్వభౌమా! సస్యశ్యామలమై, పుణ్యనదీతోయ పవిత్ర చారిత్రమై, అనర్ఘ మణిమయ ఖనియై, సంపత్తరంగముల నోలలాడు భారతవర్షము నావరించియుండిన విపన్మేఘపరంపర లీ నాఁటితో, భారతీయ నీతిఝంఝూవాతముచేఁ బటాపంచలైనవి. రాక్షసామాత్యుని వైదుషీపటిమవలన గ్రీకురాజ్య మల్లకల్లోలమైనది. ఆ మంత్రిసత్తముఁడు వారిసామ్రాజ్యమును గ్రిందు మీఁదొనరించుచున్నాఁడు. దురదృష్టుఁడు శెల్యూకేశ్వరుం డత్యాశచే నింటికూటికి నెలికూటికి వెలియై, మనచేతఁ జిక్కినాఁడు. ఇప్పట్టున నసహాయులగు యవనుల మ్రందించుట మిగుల సులభము. హైందవసైన్యదావాగ్నిమధ్యమునఁ జిక్కిన యవనశలభములు మాడిపోఁగలవు. యుద్ధమున కనుజ్ఞ నియ్యవలయు" నని ప్రార్థించెను. చందనదాసు సార్వభౌమునితో "అవధరింపుము, దేవా! యుద్ధప్రసక్తి తన కే మాత్ర మిష్టము లేదనియు, యవనహైందవసఖ్యము తప్పక యొనఁగూడవలయుననియు, అది తనశాసన మనియు,

తనశాసనము తప్పక జరిగి తీరవలయుననియు, చాణక్యాచార్యుఁడు నాకాజ్ఞ యిచ్చియుండుట తమకుఁగూడఁ దెలిసియే యున్నది. అఖిలార్థతత్త్వసంవేది యగు చాణక్యు నాజ్ఞ మనకు విధియై యున్న” దని యనెను. ప్రసన్నభావమునఁ జంద్రగుప్తచక్రవర్తి “భాగురాయణా! పరిస్థితులు మన కనుకూలముగా నున్నవి. గురునానతి నేల నిర్వహింపరాదు? సగౌరవముగ, శైల్యకేశ్వరుని నీ విటకుఁ గొనిరావలయు” ననియెను.

‘భాగ్య’ మని భాగురాయణుఁడు పోఁబోవులోఁగా నచటికి బిందుసారుం డరుదెంచి నిలువఁబడెను. ఆతని యొడలెల్ల రుధిరమయ మైయుండెను. చూడ్కిని దైన్యముదోఁచుచుండెను. నిజకుమారుని వికృతాకారమును గాంచి చంద్రగుప్తుఁడు భయకంపితుఁ డయ్యెను. “రాజకుమారా! సంగతి యేమి?” అని యప్రత్నముగా భాగురాయణుని వక్త్రము నుండి ప్రశ్న బయలువడెను. ఏమియో బదులు చెప్పఁదలఁచియు, బిందుసారుఁడు చెప్పఁజాలక, దైన్యవిలోకనంబులను దండ్రివంక సారించుచుండెను. “కుమారా! ఏ మిట్లున్నావు? ఈ వేష మేమి?” అని సార్వభౌముఁ డడిగెను. బిందుసారుఁడు గద్గదస్వరమున “బందీలిద్దఱుతప్పించుకొని” రని చెప్పెను. ఆమాట సార్వభౌమునకుఁ బిడు గయ్యెను. చందనదాసు వెలవెలఁబోయెను. భాగురాయణుఁడును, సభ్యులు నిర్విణ్ణులైరి. బిందుసారునకుఁ దలకొట్టినటు లుండెను. క్రోధాతిశయమున సార్వభౌముని కటము లదురుచుండెను. బొమలు ముడి

పడెను. ఇం కే మున్నది? ఈ విషయ మెవ్వరికిఁ దెలియదు. శెల్యూకేశ్వర పాత్రకులుల పలాయన మెవ్వ రెఱుంగుదురు? భారతీయుల ప్రబలప్రయత్నములన్నియు భగ్నములైనవి. మ్లేచ్ఛసామ్రాజ్యరాక్షసుని వాయువ్యపట్టునఁ గొట్టిన దెబ్బ, నిష్ఫలమై నిరుపయోగమై పోయినది. శాత్రవుని బంధవిముక్తికిఁ గారకు లెవరు? మృత్యువును వలచి, యింటికిఁ జేరంటమునకుఁ బిలిచినవా రెవరు? పితృభక్తిభూషితుఁడును, నిష్కళంక మాతృభక్తి సమన్వితుఁడును, ధరిత్రీసార్వభౌమశేఖరుఁడు నగు యువరాజకుమారుని కీర్తిసాహసాగ్రమున కొడిఁ గట్టి యుండునా? వైరివిమోచనమునకుఁ గారణుఁడగు రాజద్రోహి నెటుల శిక్షించినఁ గసితీఱును? ఖైదీలను విడిచిపెట్టిన రాజద్రోహి నెత్తింగి, యాతనితోఁ జోరాపట్టులతో బెందు సారుని శరీరము రుధిరమయ మైనది కాఁబోలు! కారాగారమునుండి పరుగెత్తిపోవు బంధితులగతి కనరోధము గల్పించి, వారలతోఁ దలపడినందున నిటుల యువరాజు క్షతగాత్రుఁడై యున్నాఁడు కాఁబోలు! ఇట్టి యూహాలు చక్రవర్తిమానసము నిం చెను.

సార్వభౌముఁడు సమవర్తి యగుట నెల్లరకు విశదము. ఆ రాజశేఖరునిదృష్టియందు పిన్నపెద్ద లను తారతమ్యము లేదనియు, ధనికదరిద్రు లను భేదము లేదనియు, శత్రుమిత్రు లను హెచ్చుతగ్గులు లేవనియు నందఱకుఁ దెలియును. లోకక్షేమంకరుఁడు, శాంతిప్రియుఁడు నగు యువరాజకుమారున కిం దెంతమాత్రము సంబంధ మున్నదో యని సభ్యులు తల్లడ

మందుచుండిరి. సార్వభౌముఁడు సమాహితచిత్తుఁడై "బిందు సారా! ఇందు నీ కెంతవఱకు సంబంధము కల"దని యడిగెను.

బిందు:—అంతటికి నీ మందభాగ్యుఁడే కారణము!

సార్వ:—అకలంకరాజభక్తియుతుఁడవు; ఇట్టి రాజ ద్రోహము నేల తలపెట్టితివి?

బిందు:—రాజపరమేశ్వరా! ఈ శరీరమునఁ బ్రాణము లుండునందాక—ఈ శరీరనాళములఁ బవిత్రమగు భారతరక్తము ప్రవహించునందాక—మ్లేచ్ఛపీడిత లగు పతివ్రతామతల్లుల దుఃఖదీనాలాపములు చెవిసోకుచుండునందాక—యిట్టి రాజ ద్రోహమును మనసునఁ దలపెట్టనెనఁ దలపెట్టఁగలనా? రాజేంద్రా! ప్రత్యుపకారబుద్ధి యిన్ని కడగండ్లకుఁ గారణ మయ్యెను.

సార్వ:—ప్రత్యుపకారమా? ఎట్లు?

బిందు:—కొలఁది దినములక్రిందఁ జందనదాసుతో మాటలాడి మరలి వచ్చుచుండ ప్రబలవర్షము పట్టెను. గుఱ్ఱముతోడ నేనును నట్టడవిఁ జిక్కి త్రోవ తప్పి తడిసితిని. అట్టియెడ నొక పెద్దపులి భీకరముగ నాపైఁ బడెను. ఇద్దఱమును దల పడితిమి. పుండరీకపదనఖప్రహారములచే హాయ మనువులఁ బాసెను. క్రూరమృగమును నేనును బాహాబాహిని బెనఁగు చుంటిమి. కాని ప్రబలసత్త్వసంపన్నం బగు నా మృగరాజము బలహీనుఁడనై యుండిన నన్ను, బోఁబఱచుకొనఁ గలిగెను. అట్టితఱి యొకపురుషశ్రేష్ఠుం డచటఁ బ్రత్యక్షమై, దానిని

జంపి నాకుఁ బ్రాణములు ప్రసాదించెను. ఇరువురము గుప్తాభిధేయులముగాననొండొరులఁ దెలియము. కటికిచలి మమ్మందు నిలువనీయలేదు. పులిని బలిగొన్నశరము నాచేఁజిక్కెను. అందు శెల్యూకేశ్వరునిపేరు చెక్కఁబడియుండెను. ఆతఁడే నాప్రాణరక్షకుఁ డని గ్రహించితిని.

సార్వ:—నీప్రాణదాతను విముక్తిఁజేసి, కృతజ్ఞతఁ జూప నెంచితివా?

బిందు:—కలనైన నటు లెంచలేదు. ఆతనికి భారత సార్వభౌమునికి సఖ్యముగూర్పఁదలఁచి యచటకుఁ జనితిని. నాతలంపు తెలిపితిని. అది యాతనికి రుచింపలేదు. అంతట తిరిగివచ్చుచున్న నన్నాతఁ డదటుపాటునఁ బొడిచెను. ఆవ్రేటు వడికిఁ గ్రిందబడి, తెప్పిఱిల్లి లేచులోఁగా పాతకులుఁదు మరలఁ బొడిచెను. వివశుఁడనై నేలఁ గూలితిని. వా రుఱికఁ బాఱిరి. చెఱసాలరక్షకుఁ డడ్డగించెఁగాఁబోలు! వారిచే నిహతుఁ డయ్యెను.

సార్వ:—ఆశయము శ్లాఘ్యమయ్యు, దేశానర్థకరమయ్యెను. అపరాధివైతివి. కారుణ్యమునకుఁ గఠిన మగు రాజశాసనమునకుఁ గడుంగడుదూరము.

బిందు:—సార్వభౌమా! హైందవరాజనీతి పక్షపాత మెఱుఁగదనుట నాకుఁ గ్రొత్తకాదు. నామందబుద్ధి మన ప్రయత్నముల నన్నింటిఁ దలక్రిందు చేసెదను. మహాపరాధినైతిని.

సార్వ:—ఈశ్వరప్రతినిధినై, ప్రజాసౌఖ్యమునకుఁగా నీ పరమపవిత్రసింహాపీఠ మధిష్ఠించియున్నంతకాలము ధర్మప్రతిపాలనమునఁ దారతమ్యములు గలుగవు. యువరాజు నగుటమాత్రాన, ధర్మమునకు నతీతుఁడవు గాఁజాలవు. యథార్హశిక్ష విధించుట నావిధ్యుక్తము. రాజద్రోహమునకు మరణదండనము స్మృతినిబద్ధము.

బిందుసారుం డధోవదనుం డయ్యెను. సార్వభౌముఁడు తలవంచుకొనెను. శిక్షావిధానము విన్నంతనే సభ్యులు నిర్విణ్ణులైరి. సార్వభౌముని న్యాయబుద్ధికి నాశ్చర్యపడిరి. జగజ్జేగీయమానయశోవిశాలుఁడును, గమనీయగుణగణ భరితుఁడు నగు యువరాజకుమారుఁడు భవిష్యత్సార్వభౌముఁ డనియైనఁ దలంపక, వానికి మరణశిక్ష విధించిన చంద్రగుప్తుని శాసనము మహాకఠినముగా వారికిఁ దోఁచెను. కాని, సార్వభౌముని యెదుట నిలిచి, యాతనిశిక్షావాక్యముపై వ్యాఖ్యానమొనరించుట కెవ్వరికిఁగాని ధైర్యము చాలదు. భాగురాయణుం డెట్టకేల కేమియో విన్నవింపనుండెను. అంతలో నచటి కొక విప్రయువకుం డరుదెంచి, జాబొకటి చక్రవర్తి కందిచ్చి పోయెను. సభ్యులచూపులు మహాతురతతో నతని వంక మఱలెను. వ్యాకులహృదయుఁడు సార్వభౌముఁ డా లేఖను సాంతముగ నవలోకించి, దానియర్థమును గ్రహింప నసమర్థుండై యుండెను. అతఁ డా లేఖను భాగురాయణునిచేతి కిచ్చి చదువుమనెను. భాగురాయణుఁ డా కమ్మ నిట్టుల చదివెను.

"వృషలా !

ఒకటిఁ దలంచిన మఱొకటి యైనది. బిందుసారుని యాశయము నాకు సమ్మతము. అది నిష్కళంకము. నిరుపమానము. కాని శాస్త్రవ్యసనవిమోచనమున కాతఁడే కారణము. శిష్టస్మృతి నియమానుసారమాతఁడు మరణదండనార్హుఁడు.

బిందుసారుఁ డనేకదేశభక్తుఁడు. నిష్కళంక చరిత్రుఁడు. సాహసౌదార్యసంపన్నుఁడు. ఎల్లరకుఁ దలఁదాల్పఁదగినవాఁడు. శిరమునం గైసేయు ప్రసూనమును మంట వేయ గాదుగదా!

ఇఁక యుద్ధము నిశ్చయము. విజయలక్ష్మి ధర్మైక పక్షపాతిని. ధర్మమో ఆర్యాశ్రయము. సెల్యూకేశ్వరుని శిర మర్పించి, బిందుసారుఁడు తనతల దక్కించుకొనవలయు.

ఇది యొకబడుగు బాపని మనవి. నెచ్చెలి యుపదేశము. గురుని యానతి.

నీ హితైషి."

లేఖావృత్తాంతము సభ్యులను సంతోషసాగరమున ముంచెను. ఎవరు జాబు వ్రాసినది, వారు గ్రహింపఁజాలకుండిరి. సార్వభౌమునకు హితమును గఱపఁగలంతవాఁడు—ఆజ్ఞఁజేయఁగలంతటివాఁడును నగు చాణక్యాచార్యుం డస్తమించె నని వారినమ్మకము. "నందితుఁడా! ఏ మనియెదవు?" అని సార్వభౌముఁడు ప్రశ్నించెను.

బిందు:—సార్వభౌమా! ఆజ్ఞ వేఁడెద. యవనాధముని రుధిరపానమునకై నా ఖడ్గము తీంట్రించుచున్నది. ఆత్మప్రాణములకై యాచించువాఁడను గాను.

సార్వ:—బిందుసారా! ప్రతిజ్ఞను జెల్లించి, కళంకముఁ బాపుకొనుము. పొమ్ము. భాగురాయణా! సైన్య మిఁక యవనులపైకి నడువవచ్చును.

చక్రవర్తి న్యాయవిచక్షణాబుద్ధికి సభ్యులానంద మొందిరి. దుర్దాంతవిక్రముఁడు యువరాజకుమారుం డన్నంతపనిఁ జేసిగాని, సమరభూమినుండి తిరిగిరాఁ డని యనుకొనుచుండిరి. సార్వభౌము నానతికి బిందుసారభాగురాయణులు 'భాగ్య' మనిరి. సభయంతయుఁ గరతాళధ్వనులతో నిండెను. సైన్యమంతయు జయజయధ్వానములతోఁ బ్రతిధ్వనించెను. సపరివారముగ సార్వభౌముఁడు లేచి సైనికులఁ గలిసికొనెను.

---

# ఇరువదినాలుఁగవ ప్రకరణము.

## యుద్ధము.

హైందవకారాగారమునుండి తప్పించుకొని నిజసైన్యములఁ జేరిన శెల్యూకేస్యేనుఁడు క్రోధోద్రిక్తమానసమున సైన్యసమేతముగా జయజయారావము లొనరించుచు వితస్తానదిను తరింప మొదలిడెను. స్వరాజ్యరక్షణ దీక్షాబద్ధకంకణులై యుండు హైందవసైనికులు 'యశోవా మృత్యుర్వా' యను సంకల్పముతో గ్రీకులతోఁ దలపడి వారి నడగించుచుండిరి. రానురాను పోరు ఘోరము కాసాగెను. యవను లెందఱో భారతవీరులశరాఘాతములచే, వితస్తా తరంగిణీగర్భమున లీనమై పోవుచుండిరి. తెగిన తలలు, చేతులు, కాళ్ళు, మొండెములు నా ప్రవాహమునందుఁ గొట్టుకొనిపోవుచుండెను. ఆ స్రవంతీ వినిర్మలోదకము రక్తారుణమై, బాలభానుని రశ్మిప్రసారమున మఱింత మెఱ్ఱవాఱుచుండెను. ప్రాణములఁ గోల్పోవుచున్నను గ్రీకుదళము తెగించి, క్రమక్రమముగ నదినిదాటఁగలిగెను. ఇప్పు డిరువాగులవారును, బాహాబాహిని బోర మొదలిడిరి.

రణదుందుభీధ్వానములును, యోధుల హుంకారనినాదములును, నిస్సాణధణధణాత్కారములును, సైనికులపరస్పర ధిక్కారవాక్యములును, బట్టుల జయపదములును భూనభోంతరాళముల బ్రిద్దలుసేయుచుండెను. కత్తులన్నియునెత్తుటం దడిసి మెఱ్ఱగాఁ బ్రకాశించుచుండెను. సైనికులు సురియలఁ గ్రుమ్ముచుండిరి; కత్తులఁ బొడుచుచుండిరి; శూలముల దుల్చు

చుండిరి; కుంతములఁ ద్రిప్పుచుండిరి. బిరుదముగలందఱు నెత్తుటఁ దోఁప్పఁదోఁగుచుండిరి. సైనికులెందఱో యమునింటికి మూటఁగట్టుచుండిరి. పీనుఁగులు కుప్పలుకుప్పలుగా రాలుచుండెను. మత్తేభముల శుండాదండముల విసరులకుఁ బడిన భటులు, ఘోటకముల ఖురపుటముల ద్రొక్కుడులకు నుగ్గునూచగుచుండిరి. పరుగెత్తుచుఁ బోరాడువాఁడు పరుగెత్తుచునే ప్రాణములఁ బాయుచుండెను. నిలిచి యుద్ధమాడువాఁడు నిలుపునఁ జచ్చుచుండెను. చంద్రహాసప్రహారములకుఁ దలలు పైకెగిరి వీరాలాపముల నింగి నించుచుండెను. ఎక్కడఁ జూచినను ఖండితశిరములు పడియుండెను. కొన్ని భీషణ భాషణము లాడునటు లుండెను. కొన్ని పకపక నవ్వున ట్లుండెను. కొన్ని బతిమాలున ట్లుండెను. కొన్ని కంట నీరుగార్చుచుండెను. కాని, నిష్ఠురం బగు నా రణభూమియందుఁ గరుణకుఁ దా వెక్కడిది! అట్టిసమయమున నా రణవీరులకు బిడ్డలు లేరు. భార్యలు లేరు. బాంధవులు లేరు. వారి హృదయములు శిలాకఠినములు.

శెల్యూకేశ్వరశిరశ్ఛేదకవ్యాపారతత్పరుఁడైన బిందుసారుఁడు ధవళాశ్వము నధిరోహించి, ప్రతాపతేజోమూర్తి రీత్యమూర్తియై యవనసారణసేయు యమునికైనడి, కదనరంగమంతయు వీరవిహార మొనర్చుచుండెను. ఆ వీరవరేణ్యుని ఖడ్గప్రచాలనమున కడ్డుతగిలినప్రాణి బ్రదుకుట లేదు. వైరులాతనికి నోడి, దెసలుపట్టుచుండిరి. సాదిప్రతిన మెఱిఁగినదో యన నతనివారువము, శెల్యూకేశ్వరుఁ డుండునెడకు నడిచెను. ఆతని నడ్డగించెడువారు తుత్తునియ లగుచుండిరి. ఆతని ప్రతా

పానలమును దరియు యవనసేలభటములు ప్రగ్గిపోవుచుండెను. బిందుసార శెల్యూకేశ్వరులు ముఖాముఖులైరి. తప్తతైలమున శీతలాంబుకణము పడినట్లుల బిందుసారుం డాతనిజూచుటతోడనే మండిపడెను. కాలఁద్రొక్కిన పన్నగము భంగి, గోఁజూచుఁ నుసుకొని గన్న సింగపుఁగొదమ కైవడి బిందుసారుం డాతనిపైకి నుఱికెను. ఇంతలోఁ జాత్రకులుఁడు శెల్యూకేశ్వరునకు దోసటగాఁ గొంతబలముతో వచ్చి యడ్డుపడెను. పాత్రకులుని గాంచినంతనే బిందుసారుఁడు ప్రళయకాలరుద్రావతారుఁడై ఖడ్గము నెత్తి "ఓహో! దొంగా! సరి యింతతో పోవని విసరెను. పాత్రకులుండా వ్రేటుఁ దప్పించుకొని గండము నుండి బయటఁబడెను. బిందుసారుని బలియిచ్చినఁగాని, జయలక్ష్మి యవనులకు వశవర్తిని గాదని నిశ్చయించి, శెల్యూకేశ్వరుం డాతని నెదిరించెను. ప్రాణములకుఁ దెగించి యిరువురుఁ దలపడిరి. అహోరాత్రమునందు బిందుసారునివాహనము ప్రాణములఁ గోల్పోయెను. తోడనే యాతఁడు నేల దూఁకెను. అతనిని యవనభటులు ముట్టడించిరి. పోరతిభయంకరమయ్యెను. బిందుసారుని జీవములఁ గొనుటయో లేక తామాతనికరవాలమున కెఱ యగుటయో యని యవనులు దృఢనిశ్చయులై యాతని గవయుచుండిరి. నలుప్రక్కలనుండి తనపైఁబడు నభియాతుల నతఁ డుక్కడంచుచు వారివ్రేటులఁ దప్పించుకొనుచుఁ గత్తిసామునందలి తన నేర్పఱితనము నాతఁడు మెఱయించుచుండెను. ఆ నాఁ డాతనియసిపుత్రిక యసంఖ్యాకము లగు యవనమస్తకములను బలిగొనినది. కడకొక దెబ్బతోఁ జాత్రకులుని యుత్తమాంగముకూడ నల్లంత

దూరమున మొండెమునుండి వేఱై పడెను. తుద నాతని మృత్యుదేవతమాత్రము కామించినది. సంతోషముచేతనో, మరణయాతనచేతనో యాతనిమొండె మించుకసేపు నృత్యముసల్పి క్రిందఁబడి రుధిరప్రవాహమునఁ బడిపోయెను. ఆ పాపిష్ఠునిజీవితమా విధమున నంతమొందెను. సైన్యాధ్యక్షుని పాతముచే సైన్యమునందు హాహాకార ముప్పతిల్లెను. భటులు ధైర్యకంచుకములు డించి యూడని బాఱసాగిరి. శెల్యూకేశ్వరుని రాజత్వము వారి నచట నిలుపఁజాలకుండెను. స్వప్రభు రక్షణము కంటె వారికి స్వప్రాణము లెక్కుడయ్యెను.

శెల్యూకేశ్వరుం డొంటరిగ బిందుసారుని దాఁకెను. బిందుసారుఁడు పెల్లుమీఱినకోపమునఁ దన ఖడ్గప్రహారముల నాతని నొప్పించుచుఁ దచ్ఛిరఃఖండనమునకై ప్రయత్నించుచుండెను. అపరనృసింహుఁడో యనఁ బ్రత్యక్షముగ నెదుట నిలిచియుండు బిందుసారునిధాటకు శెల్యూకేశ్వరుని ధైర్యంకంచుక మించుక సడలెను. ప్రతిజ్ఞాపాలనాతత్పరుఁడు యువరాజే మాత్రము వెనుదీయక విజృంభించుచుండెను. ఆ పోరాటమున శెల్యూకేశ్వరుఁడు డస్సెను. నాఁటితోఁ దనజీవితచారిత్రమునం దంత్యప్రకరణము పరిసమాప్తమైన దని యాతఁడు నిశ్చయించుకొనెను. బిందుసారుఁ డాతనిపైకి దూఁకెను. ఆ తాఁకుడునకు శెల్యూకేశ్వరుఁడు వెలికిలఁబడెను. బిందుసారుఁ డాతని వక్షఃపీఠిపైఁ గాలూని, నేత్రములనుండి యగ్నికణములు రాల "ఓరీ! విశ్వాసఘాతుకుఁడా! కృతఘ్నుఁడా! పరమానందసింధువున నోలలాడు మాభారతజనయిత్రిని బారతంత్ర్యకూపమునఁ ద్రోయఁబ్రయత్నించిన నీపాపఫలమును—

సంతతసంతోషాంబుధి నీఁదులాడు భారతీయులను సంతాప సాగరమునఁ ద్రోయఁ బ్రయత్నించిన నీపాపఫలమును— సాధుచరిత యని మది నెంచక, కన్నకూఁతును నీసౌఖ్యదేవతకు నాహుతిగా నొసంగ గమకించి, కారాఁ ద్రోసి, కాటియ నెట్టిన నీపాపఫలమును — మీఁదు మిక్కిలి మండెడు మంటలఁబడి మ్రగ్గుచున్న నిన్నుఁ జాలిఁగొని వెలువరింపవచ్చిన నుపకారి కపకారమొనరించిన నీపాపఫలమును — చండాలుఁడా — నీచుఁడా — యిదిగో గైకొ" మ్మని ప్రళయకాల పర్జన్యునిలీల గర్జించుచు, నాతనితలను నెగవేయుటకై కరవాలమును జేకొలఁది యెత్తి వ్రేటువేయ నుండునంతలోఁ బిచ్చివాఁ డచటఁ బ్రత్యక్షమై యెత్తినకత్తి నట్లే యాపెను. చిరపరిచితుఁడు వెఱ్ఱివానిసాహసము బిందుసారునకుఁ గోపము కలిగించెను. అతఁడు ఖడ్గమును వదలి, శూలమును గొని "ఛీ! దురాత్మా! పొమ్మవల" యని శల్యకేశ్వరుని బొడువ నుండ, నద్దానినిగూడ వెఱ్ఱివాఁడు పట్టుకొని వికట స్వరమున "మత్తేభమును మకరము మడియించుచున్నది. మహావిష్ణువు ప్రత్యక్షము కావలయును—

సిరికిం జెప్పఁడు, శంఖచక్రయుగముం జేదోయి సంధింపఁ, డే
పరివారంబును జీరఁ, డభ్రగపతిం బన్నింపఁ, డాకర్ణికాం
తరధమ్మిల్లముఁ జక్కనొత్తఁడు, వివాదప్రోత్థితశ్రీకుచో
పరిచేలాంచలమైన వీడఁడు గజప్రాణావనోత్సాహియై.

పొమ్ము! పొమ్ము! స్వార్థమున కిది తావుగాదు. స్వశ్లాఘమునకిది సమయము కాదు. పొమ్ము! పొ"మ్మని బిందుసారునకు

యుద్ధభూమియం దొకరంగమును జూపెను. యువరాజా వంక కనుసారించెను. అచట నొక గ్రీకువీరునితో సార్వభౌముఁడు ఖడ్గాఖడ్గిని బోరాడుచుండెను. నిజవరూధినీనివహమునుండి విడివడి, చక్రవర్తి యొంటిగా నాయవనవీరునితో యుద్ధముచేయుచుండెను. కాలాంతకునివలె సార్వభౌముఁ డాతని గవయుచుండెను. సార్వభౌముని బ్రాణములవిలువ నెఱింగిన గ్రీకులు పెక్కు రొక్కుమ్మడి నాతని జైకొనుచుండిరి. అచట సంకులసమర మతిభయంకరముగా నుండెను. శెల్యూకేశ్వర శిరఃఖండనమా, సార్వభౌమసంరక్షణమా! స్వప్రయోజనమా, స్వార్థత్యాగమా ? ప్రచండవాతాహతసముద్రమధ్యమున నుండు భారతభాగ్యనౌక మునుఁగ నుండ, నూరక చూచుచుండుటయా ? చేతనుండు పక్షిని - వలయందుఁ జిక్కియుండు సింహమును విడిచిపుచ్చుటయా?... బిందుసారున కిటికి.ర్తవ్యాంశము బోధపడియెను. శెల్యూకేశ్వరు నట్లే బంధితునిగావించి, స్వసైనికుల కొప్పగించి యొక్కగంతులో వాయువేగమున సార్వభౌమునికడకుఁ బోయెను. వెఱ్ఱివాఁడు బంధితుఁడు శెల్యూకేశ్వరునికడ గంతులిడుచు "దాసరిత్రిప్పలు పేరుమాళ్ళ కెఱుక. బానేఁడుపాలకు పరమాణు వంత పాషాణము చాలును. కొండంత ప్రతిక్రి కణీ కేఁడు నిప్పుచాలును. పారావారములో బడబానలము లేదా ? నీలలోహితునికంటఁ గాలానలము లేదా! మీకు నలుసైనది, మాకునగము. మీకు మశకమైనది, మాకు మత్తేభము. మీ రేమి రాజులు ? నేను రాజును. పాఁపరాజును. పక్షిరాజును. నాకు వేయితలలు. వేయి నాలుకలు. భూమండలమంతయు నానెత్తిపై నున్నది.

ఱెక్కలు లేకున్న నేమి? మనోవేగమునఁ బోఁగలను. నేను మహావిష్ణువునకు వాహనము. మాతృదాస్యశృంఖలావిమోచనమునకై అమృతము తేఁగలను. పాతాళలోకమునకు నేగఁగలను. స్వర్గలోకమునకు నెగఁగలను. ఈలోకమున నుండఁగలను. నాకేటివసాత్రి, వైకుంఠమే నాయాత్రి యని యఱచుచుండెను. ఉన్మత్తుని నేమి చేయుట లేదు.

ఇంతేమున్నది? చంద్రగుప్తుఁడు సెల్యూకేశ్వరునకు భారతీయులచేతఁ జిక్కెను. మ్లేచ్ఛచక్రవర్తి పట్టుపడెననియు, మ్లేచ్ఛసైన్యాధ్యక్షుఁడు [illegible] బడిపోయె ననియు, యుద్ధరంగమంతయు మాఱుమ్రోఁగెను. యవను లధైర్యముతో యథాయథలైరి. మార్తాండుఁడు నభోమండలమధ్యవర్తి యగుసరికి, విజయలక్ష్మి చంద్రగుప్తభూభాముని యంకతలము చేరెను. హేళినితో నదృష్టము యవనుల వీడి పోయెను. సెల్యూకేశ్వరునకుఁ బ్రపంచమంతయు శూన్యమై తోఁచెను.

స్వామిరక్షణకార్యము బిందుసారుని ప్రతిజ్ఞకు భంగము కలిగించెను. యవనరాజశిరంబునకు మాఱుగాఁ దనశిరంబు తలఁగుట నిశ్చయించుకొని యతఁడు ప్రతిజ్ఞాభంగమూలకమగు నవమానభరంబుననో యనఁ దలవంచుకొని, యడుగులో నడుగు వైచుచు, కదనోర్వి వదలి తనశిబిరమువైపు నడచుచుండెను. ఉన్మత్తుఁడే మేమియో మాటాడుచు వాని ననుగమించెను.

# ఇరువదియైదవ ప్రకరణము

## సంధి

నాఁటి ఘోరయుద్ధమున స్వకీయపౌరుషములఁ బ్రకటించి, వైరుల నుక్కడఁగించి, విజయలక్ష్మిఁ జూఱఁగొనిన సైనికోత్తములను, సైనికాధ్యక్షులను, దక్కుంగల రాజభక్తులను నుచితరీతి సత్కరించి, సార్వభౌముఁడు చీనాంబరాభరణాదులచే బహూకరించుచుఁ బేరోలగ ముండెను. రాజసేవకు లర్హాసనములం దుపవిష్టులై యుండిరి. కవిశిఖామణులును, బట్టులును సార్వభౌమచంద్రుని యశోగీతములను సభారంజకముగాఁ బాడుచుండిరి. "భాగురాయణా! రాక్షసామాత్యున కీ విజయోదంతము నెఱింగింపవలయును. ఈ క్షణమే నిపుణు లగు గూఢచారులను బాబిలానునగరమునకుఁ బంపవలయు" నని సార్వభౌముఁడు సేనానితో ననెను. అందుల కాతఁడు "సార్వభౌమా! పరాభూతులు గ్రీకులే యీ పని గావింతురు. అయినను దేవరవారియానతిమెయి, వేగుల నీ పనికై నియమించెద. రాక్షసామాత్యుఁ డిఁక స్వరాజ్యమునకుఁ దిరిగి రావచ్చు నని తలంచెద" నని విన్నవించెను.

ఇంతలో నచటికి బిందుసారుం డరుదెంచినిలువఁబడెను. నెత్తుట దోఁగినయుడుపు—రుధిరమయ మగు శరీరము—అరుణకాంతుల నీను శూలము—అన్నియు రణరంగమునం దుండి నటులే యుండెను. సార్వభౌముఁ డాతనితో "కుమారా! ఏల యింకను బీభత్సరూపముతోడ నున్నా" వని ప్రశ్నించెను.

బిందు:—ప్రతిజ్ఞ నెఱవేఱలేదు. శైల్యకేశ్వరుని శిరముఁ దేలేనైతి. రాజశాసన మింకను నన్ను బంధించియే యున్నది. నిరంకుశ మగు మీరాజనీతికి పక్షపాతభావ మెక్కడిది ?

సార్వ:—శైల్యకేశ్వరుని బంధించిన దెవరు ?

బిందు:—నేనే ! సార్వభౌమసంరక్షణముఁ జేసి, శైల్యకేశ్వరుని శిరమును ఖండించుటకు వీలులేకపోయినది.

సార్వ:—సార్వభౌముఁ డపాయస్థితియం దుండె నని నీ కెట్టుల దెలిసినది ?

బిందు:—శైల్యకేశ్వరుని కంఠమును నరకవేయుటకై యెత్తియుండిన నాచేతికత్తిని, శూలమును విచ్చినాఁడు పట్టుకొని, సార్వభౌమరక్షణార్థము పరుగెత్తి నన్నుఁ బురికొల్పెను. అందుచే శాత్రవుని బంధించి వదలి పోవలసివచ్చెను.

సార్వ:—కుమారా ! ఆ వెఱ్ఱివాఁ డాదరణీయుఁడు. విపదంబుధిఁ బడి మునిఁగిపోవనుండ సార్వభౌముని నీవు సంరక్షించితివి. ఇందు నీయాశయము ప్రశంసాపాత్రము. శైల్యకేశ్వరబంధనమును, సార్వభౌమసంరక్షణమును నీ నేరములకు నిష్కృతు లైనవి. పోయి మంగళవేషధారణ మొనరించుకొని రమ్ము.

బిందుసారుఁ డభివాదన మొనరించి వెడలిపోయెను. సార్వభౌముని యాశ్రితవత్సలత్వమునకు, న్యాయైకదీక్షకు సభ్యులు సంతసించిరి. స్వార్థత్యాగ మొనరించి సార్వభౌమప్రాణపరిత్రాణమునకై పరుగెత్తిన యువరాజకుమారుని మహాశయమును వారు కొనియాడుచుండిరి. ఇంచుక సేపటి

కంతయు నిరువురుపురుషు లా సభారంగమును బ్రవేశించిరి. వారు మలయకేతు భైరవనాయకులు. వా రతివినయమున సార్వభౌముని పాదరాజీవములకుఁ బ్రణమిల్లి, వెంటఁగొని వచ్చిన కాన్కల నాతనిపాదములకడ నిడి, యర్హాసనములం దాసీనులైరి. ఇదియంతయుఁ ద్రుటికాలములో జరిగెను. భైరవుని యాగమనముచే భారతీయులు సంశయాత్ములైరి. మహోగ్రవ్యాఘ్రము మార్జాల మైనందుకు వా రచ్చెరువందిరి. కాలాహి కుసుమదామ మైనందులకు వా రాశ్చర్యపడిరి. భైరవుఁడు నిలుచఁబడి, వినయస్వరమున "సార్వభౌమ శేఖరా! సభయ రిపు శరణుల రగు మీ రీ యధమాధముని చర్యల గమనింపక మన్నింపవలయును. దురాశాపాశబద్ధుఁడనై చెప్పరాని, వినరాని కార్యము లాచరించితిని. గర్వాంధకార బంధుర స్వాంతుఁడనై, మాతృదేవికి — సార్వభౌమ చంద్రునకు—సోదరవర్గమునకు—వింత కాలముగాఁ గృతఘ్నుఁడనై చరియించితిని. మీ కృపాకటాక్షదీప్తులచే నా గర్వధ్వాంతము పటాపంచలైనది. సార్వభౌమా! నా కీ నాఁటికిఁ దెలివి గలిగినది. నాదురాశాపాశములఁ ద్రెంచి వైచితిని. నాచేఁత లతినీచము లని నా కిపుడు బోధపడినది. ప్రభువరేణ్యా! మీ సేవకుని దోసఁగుల మన్నింపవలయు" నని ప్రార్థించెను. ప్రసన్నవదనుఁడై సార్వభౌముఁ డాతని కభయ మిచ్చెను. మలయకేతుమహారాజు లేచి "ఓ భారతసార్వభౌమచంద్రా! ఈ నాఁటితో భారతభాగ్యనౌక విపత్సాగరము నుత్తరింపఁ గలిగినది. అన్యాయపరు లగు యవనులు తగురీతి శిక్షింపఁబడిరి. మాతృదేశ దాస్యశృంఖలా ఖండన వ్యాపారమున—

మాతృదేశ భాగధేయ సంపాదక వ్యాపారమున—నాయట్టి వా రెందఱో కడలేనియిడుమలఁ బడవలయును. ఇట్టియుద్ధము లెన్నియో జరుగవలయును. ఇట్టి నెత్తుటేఱు లెన్నియో పాఱవలయును. త్యాగము లేక భోగము లేదు. భారతదేశ దౌర్భాగ్యకారణమున భైరవనాయకుఁడు మున్మున్ను గ్రీకులకుఁ జేయూఁత నొసంగ సమకట్టియుఁ, దగిన యదనునఁ దన దప్పిదమును దా నెఱింగెను. తుదకు ధర్మబుద్ధి వర్తించెను. పశ్చాత్తాపాగ్నిచేఁ బవిత్రుఁడైన భైరవనాయకుఁ డాదరణీయుఁడు. మేమును యవనుల నెదిరింప, సముచితసైన్యములతో నరుదెంచితిమి. కాని మాయాగమన మొకించుక యాలస్యమయ్యెను. ఎట్టులైననేమి, ధర్మము విజయమొందిన" దని కూర్చుండెను. ప్రముదితాస్యుండై సార్వభౌముఁడు "మలయకేతు మహారాజా! నీ పుణ్యచారిత్ర మత్యంత సంస్తుతి పాత్రము. నీ మాతృభక్తి యకళంకము. నీ సుగుణగణము లభ్యర్థనీయములు. నీయట్టి సత్పురుషశ్రేష్ఠులఁ గాఱియవెట్టిన పాపమునకు ఫలితముగ గ్రీకు లపజయమును బొందిరి. నీయట్టి భక్తశిఖామణుల శాపోదకములయందే గ్రీకులభాగ్యరేఖ యంతర్హితమైపోయిన" దని యాతని బ్రస్తుతించెను.

ఇంతలో సభారంగమున కొకయోగివరేణ్యుం డరుదెంచెను. దీప్తాగ్నియుఁబోలె నా మహాశయుఁడు తేజరిల్లుచుండెను. ఆతని సందర్శనముననే సభ్యులు మహాశ్చర్యాంబుధి నిమగ్నులైరి. సంతోషసంభ్రమములు వారిని బెనవైచుకొనెను. వారు నిశ్చేష్టులైరి. వారి కేమియుఁ దోఁచుట

లేదు. వారిమానసములు జడములై పోయెను. గ్రీకుల దుండగములకు బలియయ్యె నని విన్న చాణక్యాచార్యుడు, మఱల సజీవముగా వారియెదుటఁ గాన్పించుటఁ జూచి వారు భ్రమాన్వితులఁ జెందిరి. చాణక్యప్రతిభాతిశయము నెఱుంగుదురు కాని, యమ్మహాశయునిలీల లిట్టి వని వారికిఁ దెలియదు. చాణక్యుఁడో చాణక్యప్రేతమో వారు నిశ్చయింపలేకుండిరి. చచ్చినవాఁడు బ్రదుకుటదు స్తరము; కాని, కంటియెదుటఁ గానవచ్చుదాని నే మనవలయును? సభ్యు లిట్లు డోలాయమానమానసులై యుండ చందనదాసు సార్వభౌముని జూచి, కృతజ్ఞతాసూచకముగ నొకచిఱునవ్వు నవ్వెను. సభ్యు లద్దానిని గనునించిరో లేదో మేము చెప్పఁజాలము చాణక్యోపాధ్యాయుని యాననాబ్జము దివ్యతేజోవిలసితముగా నుండెను. సభ్యులును, సార్వభౌముఁడును గౌరవపురస్సరముగ నిలువఁబడిరి. అప్రయత్నముగ వారివక్త్రములనుండి సంతోషసూచకములగు జయజయనినాదములు వెలువడెను. సింహాపీఠి నవరోహించి, సార్వభౌముఁ డాతని కభివాదన మొనరించి నిల్చెను. చాణక్యుం డాతని నాశీర్వదించి, పవిత్రాసనము నలంకరించెను. సార్వభౌముఁడు మఱల సింహాపీఠి నధిష్ఠించెను.

సార్వ:—గురుశేఖరా! ఆసేతుహిమాచలస్థ సర్వరాజ్యాధికారసూచకముద్రికచేఁ దమపాదసరోజములకుఁ బూజ సల్పినను, మీఋణము తీరునా ?

చాణ:—నృపలా ! మాయట్టికర్మయోగులు స్తుత్యనర్హులు. క్షాత్రాధీశ్వరుల భుజబలములపైననేగదా, మావంటి

యోగుల తపోనియమాదు లాధారపడి యుండును. విపత్సాగరమునఁ బడియుండు మాతృదేవత నుద్ధరించుట యే యాశ్రమవాసికైనను ముఖ్యకర్తవ్యము. అన్యాయ మెన్నటికిఁగాని జయమును బడయఁజాలదు. ఇఁక శైల్యకేశ్వరుని సభకుఁ జెప్పింపుఁడు.

సార్వభౌము నానతిచే, భటు లిరువురు బంధితుఁ డగు శైల్యకేశ్వరుని సభకుఁ గొనివచ్చిరి. పేరోలగమునఁ జంద్రగుప్తసార్వభౌముని మలయకేతుమహారాజును జూచుట కాతనికిఁ దలకొట్టినటు లుండెను. భైరవుఁడు కంటఁబడినతోడనే యాజ్యాహుతులకుఁ బ్రజ్వరిల్లు వీతిహోత్రునివలె, నాతని హృదయము భగ్గని మండెను. ఆ కప్పకూఁతపామువలననే తన కిట్టిగతిపట్టిన దని యాతఁడు తలంచెను. మానముపోయిన ప్రాణ మెందుల కని యాతఁ డనుకొనెను. సార్వభౌముని యానతిమేఱకు భటు లాతనిబంధనములు వదలించి, సముచితాసనమునఁ గూర్చుండఁబెట్టిరి. అవమానభరముచే శైల్యకేశ్వరుఁడు వంచినతల నెత్తకుండెను. పరాభవానల మాతని హృదయోద్యానమును దహించివేయుచుండెను. కన్నెత్తి చూచునప్పటికిఁ బ్రక్కపీఠముపై మిహిరుం డాసీనుఁడై యుండెను. నిరుపమప్రతిభాసమన్వితుఁడు మిహిరుఁడు తన కా సమయమున బాసట యగునేమో యని యాతనిమది నించుక యాశ జనించెను కాని, పరాభవమునకు ఫలితముగ మిహిరుని వదనమున, వంతకుబదులు సంతసము చిందులు ద్రొక్కుచుండెను. ఆ విపరీతమున కాతనికిఁ గారణమువిదితము కాలేదు. ఆలోచన మొనరించుటకైన మానసమునఁ దా వుండునట్లు

లేదు. అల్లంతదూరమున నొకవాతాయనమునుండి పద్మాక్షు లిరువురు—హేళినీ తిలోత్తమలఁ బోలినవారు—ఆతని వైపుఁ జూచుచుండిరి. హృదయవిదారకములగు నిట్టిపరిస్థితులచే నాతనితల గింగురు మనుచుండెను. అతనిమానసాబ్ధి యందలి కల్లోలము నెఱింగి, సార్వభౌముఁడు "శెల్యూకేశ్వర రాజేంద్రా! కర్మఫలానుభవ మనుల్లంఘ్యము. రాజనీతి మిగుల కఠినమైనది. దీనికి, మీ రన్యథా తలంపవల"దని హెచ్చరించుకొనెను. శెల్యూకేశ్వరుం డందులకు గద్గదకంఠమున "భారతసార్వభౌమా! విజిగీష—భారతదేశదండయాత్రాలోచనము—స్వయముగ మాయందుఁ గల్గినవి కావు. దప్పిగొనినవానికి మృగతృష్ణంజూపిన యీ పాపిష్ఠభైరవుఁడే మా యాపదలకు మూల"మని రోషశోకాకులుఁడై పలికి భైరవుని జుఱచుచుఁ జూచుచుండెను.

సార్వ:—గతజల సేతుబంధనము నిరర్థకము. దుర్మదాంధుఁ డగు భైరవుఁ డిప్పటికి సన్మార్గుఁ డయ్యెను. కాలభిషగ్వరుఁడే మానవుల మనోమాలిన్యవ్యాధులఁ గుదుర్ప సమర్థుఁడు.

చాణ:—శెల్యూకేశ్వరా! కర్మానుభవముచే మానవజీవితములు గిఱ్ఱుమిఱ్ఱు లగుచుండును. గతమును దడవుటవలన నుపయోగము లేదు. ఏకోదరసజాతు లగు మానవు లనవతరము పరస్పరవినాశాయత్తచిత్తులై యుండినఁ బ్రపంచశాంతి చేకూరు టెన్నఁడు? నయమునఁ గాని కార్యము, భయమునఁ గాఁజాలదు. శాంతము లేక సౌఖ్యము లేదు. ఆశ

కంతము లేదు. జీవితము క్షణభంగురము. జన్మములన్నింటియందు మానవజన్మ ముత్తమోత్తమమైనది. మిగుల దుర్లభమైనది. అట్టిజన్మమునందిన మానవుఁడు శాంతిమార్గమునఁ జని, సౌఖ్యనిలయమునఁ జేరఁ బ్రయత్నింపవలయును. యవన హైందవు లునికింజేసి జాత్యంతరులై రేగాని, వేఱుగాదు. మానవ వర్గమునం దంతర్భేదములు దేశకాలాది కల్పితములు. దైవదృష్టి నెల్లరు సములు. యవన హైందవ సఖ్యముపై, శాంతిసౌధము చిరస్థాయిగా నిలిచియుండఁగలదు. ఇయ్యదియే నాయాశయము.

శెల్యూకేశ్వరుఁడు తరమియ్యనభిమానముచేఁ ద్రొక్కులాడుచుండెను. తన హీనస్థితి కాతఁడు లోలోనఁ గుమిలిపోవుచుండెను. ఆతనిహృదయాబ్ధి గంభీరమై యుండెను. ఇంతలో హేళినీ తిలోత్తములు సభారంగమునఁ బ్రవేశించిరి. హేళిని తండ్రికడ కేగి యాతనిపాదముల కెఱగి "తండ్రీ! మీ ప్రియతనూజాతను మన్నింపవలయును. నాసాహసకార్యము నకు వేఱురీతిఁ దలంపకుము. యవన హైందవ సమరముచే దేశములు ఘూర్ణిల్లుచున్నవి. ఎందఱో రణదేవతకు బలి యైరి. ఎందరో యువతు లనాథ లైరి. జనకా! చంద్రగుప్తసార్వభౌముని సఖ్యతరణిచే, మీ రీ [illegible]దుదధి గడవఁ గలరు" రని దీనముగాఁ బ్రార్థించెను. [illegible] సాహసమున కాతనిమేను కొయ్యబాఱెను. ఇట్టులుండ [illegible] మెగాస్తనీసు వచ్చి, చంద్రగుప్తుని జూచి వినయ[illegible] హైందవ సార్వభౌమా! మీ రాష్ట్రత్రాణపరాయణ[illegible] ప్రమాదము

లోకసహజము. ఆశలేనిప్రాణి లేదు. అందున, దురాశచే మారాజకంఠీరవుఁడు మీపైఁ గత్తిఁగట్టెను. తగిన ఫలము నందెను. దోషాకరుఁడును నమృతకరుఁడేకదా! కువలయాహ్లాదకరు లగు మీప్రాజ్యసామ్రాజ్యమున నసంతృప్తి, అన్యాయము, అపమృత్యువు అనుమాటలే వినరావు. పురాణవర్ణిత మగు రామరాజ్యమును బ్రత్యక్షముగఁ జూడఁగంటిమి. రాజపుంగవా! పరితాపవహ్నిఁ జిక్కియుండు మాపార్థివేంద్రుని సకలవిధముల సత్కరించుడు రని నాప్రార్థన. యవనహైందవసఖ్యమున కడియాలముగా నీ యుపాయనముల నంగీకరింపవలయు" నని యాతఁడు తోడఁదెచ్చిన మణిమయ భూషణాళుల సార్వభౌమునిపాదములకడ నిడెను.

సార్వ:— మెగాస్తనీసూ! కూర్చుండుము. నీవు చతురుపాయచతురుఁడవు. న్యాయప్రవర్తనుఁడవు. శాంతిప్రియుఁడవు. భారతీయులతో వైరము వినాశహేతువని, నీవు ముందే గ్రీకుల కుపదేశించితివికాని; వారి నలమియుండిన దురాశాపిశాచము వారిని నీహితము నాదరింపనీయలేదు. గ్రీకులతోడి నెయ్యము మాకుఁ బరమసమ్మతము.

మెగాస్తనీసు, శెల్యూకేశ్వరునితో "ఓ రాజేంద్రా! గ్రీకుపరాజయము [illegible]చ్ఛాంతివృక్షమునకు సలిలసేచనము వంటిది. బాబిలాను నగరమునందు అంతిగోనసుఁ డల్లకల్లోలములఁ గావించుచున్నాఁ డని నేటివార్తలు తెలుపుచున్నవి. యువరా[illegible]తియోరసుఁ డసహాయుఁడై, మనలఁ గుయ్యిడుచున్నాఁడు! స్వరాజ్యమునఁ గల్లోలములు; ఇచటఁ బరాభవము. [illegible]చట నున్నది? ఇట్టి విపరీతసమ

యమున, హైందవసఖ్యము గ్రీకుసామ్రాజ్యనౌకకుఁ గర్ణధారియై, యద్దానిని విపదంబుధి గట్టెక్కింపఁగలదు. హేళినీ చంద్రగుప్తుల వివాహము ప్రపంచకల్యాణప్రదము. శాంత్యుద్యానమున కంకురము. అఖిలక్షితివిభులకు మీకుఁ జెప్పెడి దేమి కలదు? నాయుపదేశము మన్నింపవలయు" నని యాతని కితవు గఱపెను. శెల్యూకేశ్వరుఁడు మెల్లగా "నీ యిష్ట" మనెను.

చాణ:—యవన హైందవ సార్వభౌములారా! ఈ దినమే పుణ్యాదినము. సమబలు లగు మీనేస్తముచేఁ బ్రపంచమున కనలేని శాంతి చేకూరినది. భూతగణము సంతృప్తిఁ జెందినది. దేవత లానందించిరి. చిరకాలమునుండి నా కామిత మిదియే. నాకామితమును బడయుటకై నే నొనర్చిన ప్రయత్నము లనేకములు. చాణక్యవధానంతరముగాని, మిహిరునకుఁ బ్రాతకులునికడ నిలువనీడ లేకుండుటచే నేను మిథ్యామరణమును వలచితిని. మోహపిశాచావేశుఁడై పౌర్వాపర్యములఁ బాటింపక, యవనస్కంధావారమునకుఁ బ్రియాంగనామణికై పరుగెత్తు భారతసార్వభౌముని గాపాడ, నున్మత్తుఁడనుగూడఁ గావలసివచ్చినది. అందుల కింకను గారణము లెన్నియో కలవు. గ్రీకురాజప్రాణపరిత్రాణమునకు—భారతసార్వభౌమప్రాణసంరక్షణమునకు—శాంతిసౌధస్థాపనమునకు—ఉన్మత్తుఁడే కారణము. మొదటనుండియు యుద్ధము నా కిష్టము లేదు. సంధి—శాంతి—సఖ్యము—సౌఖ్యము—ఆనందము—ప్రేమ—యివియే నాహృదయతలమునం దమరియున్నవి. ఉన్మత్తునిచేష్టలయందలి ప్రధానాశయము లివియే.

దుర్మదధ్వాంతపరీతస్వాంతుఁడై చెప్పరానికార్యము లొనరించు చుండిన భైరవుని, భేదోపాయసాయకప్రయోగమునఁ బశ్చాత్త ప్తునిగాఁ జేయుటలో నా ప్రధానాశయము లివియే. తు. చ. తప్పక నామాటల నాదరించి, తిలోత్తమయు, చందన దాసును నా కెంతయో యీ కార్యముల నుపకరించిరి. వా రతులిత దేశభక్తులు. అద్వితీయ స్వామిభక్తులుః. వారిసేవ యమూల్యము.

"నిజము, నిజ" మని సార్వభౌముఁ డప్రయత్నముగా ననెను. యవనహైందవ స్కంధావారములం దతిసాధారణ ముగా సంచరించుచుండిన వెఱ్ఱివాఁడు, చాణక్యుఁడే యని యెఱుంగుటతోడనే సభ్యు లచ్చెరువందిరి. చాణక్యప్రతిభావిశే షమునకు శెల్యూకేశ్వరాదులు ముక్కుపై వ్రేలిడుకొనిరి. అసా మాన్యప్రతిభాశాలియగు చాణక్యాచార్యునితోఁ గయ్యము నకుఁ గడంగుట కొఱవితోఁ దలగోకికొనుటవంటి దని సభ్యులు తలంచిరి.

అచటి కనతిదూరమున సఖీద్వితీయయై నిలిచియుండు తిలోత్తమ "ఆచార్యోత్తమా! భవదాశీర్వచనకరదీపికఁ గొని, నిర్ణీతమార్గమునందలి కంటకములఁ దొలఁగించి, భవదాజ్ఞా ర్థమును బడయఁగలిగితిని. ఇందీ దాసురాలు పేరునకుమాత్ర ముండినదిగాని వేఱుగా" దని బదులిడెను.

సార్వ:—తిలోత్తమ ! అబలవయ్యు, నీవు ప్రపంచ కల్యాణ మొనఁగూర్చితివి. నీవిశుద్ధచారిత్ర మాదర్శపాత్ర యము. హైందవనారీమణుల కభ్యర్థనీయము. అనుసరణ

యోగ్యము. జ్ఞాని జేరిన పామరుఁడు తరించునటుల, నిన్నుఁజేరిన రాజకుమారి ధన్యురాలైనది. నీపరిజ్ఞానకౌశలమునకుఁ కొఱవయే మున్నది ?

తిలో:—సార్వభౌమా ! సాధ్వు లగు తరుణులు సమయానుసారముగా దేశమున కుపకారిణులై తనరఁ గలరనియు, పతివ్రతయగు కాంతకు నలవిగానికార్యము లేదనియుఁ, బ్రపంచ మెఱుంగటయే నాసేవకు బహుమానము. అయినను, మహనీయులవాక్యములువమ్ము కారాదుకదా! నే నేదైన సేవఁజేసి యుండినఁ దత్ఫలితముగ, భైరవనాయకున కభయహస్త మిచ్చి కాపాడవలయునని నాప్రార్థన.

సార్వ:—(సంభ్రమముతో) తిలోత్తమా! ఆటవికుఁడగు భైరవనాయకునిపై నీకుఁ బామరత్వ మేల?

తిలో:—అయ్యో! సార్వభౌమా! ఆ మహామహుఁడు నాప్రియజనకుఁడు.

పాపము తిలోత్తమనేత్రగోళము లశ్రుధారాప్రపూర్ణము లయ్యెను. ఆమె నిట్టనిలువుగా భైరవనాయకుని పాదముల వ్రాలెను. భైరవనాయకుఁ డీ పరిస్థితులకు విస్మయపరీతచేతస్కుఁ డయ్యెను. పుత్రికావాత్సల్యమున నాతఁ డా తరుణీమణిని లేవఁదీసి, శిరము నక్కునఁ జేర్చెను. భైరవనాయకుని హృదయసీమ నెయ్యదియో విస్మృతచారిత్రము పొడఁగట్టుచుండెను. విభ్రమాశ్చర్యసంతోషములతో సభ్యు లొండొరులతో సంభాషించుచుండిరి.

సార్వ:—తిలోత్తమా! భైరవనాయకుఁడు నీజనకుఁ డెట్లగును? నీ చారిత్ర మెట్టిది?

ఆనందాశ్రునిరుద్ధకంఠమునఁ దిలోత్తమ యూనాఁడు తాను మలయకేతునకుఁ జెప్పిన, తనచారిత్రమును జెప్పి "సార్వభౌమా! ఈ మహామహుఁడే నాజనకుఁ" డని వచించెను. తిలోత్తమచరిత్రను విని, ప్రియపుత్రికాగాఢపరిష్వంగసౌఖ్య మనుభవించి, భైరవనాయకుఁడు పెన్నిధిఁగనిన పేదపగిది పరమానందసాగరమున నోలలాడెను.

సార్వ:—శెల్యూకేశ్వరగాజేంద్రా! యవనహైందవ సఖ్యమునకు ఫలితముగాఁ బ్రస్తుతము మీస్వాధీనముననుండు పరోపనిషదము (ఆఫ్ఘనిస్థానము), ఆరియా, అరకోషియా, గద్రోషియా (బెలూచిస్థానము) రాజ్యములను మా కొసంగవలయును. నేటినుండి యవన హైందవులు పరస్పర క్షేమకాంక్షులై, స్నేహబాంధవము మెలఁగవలయును.

చాణ:—మఱియు, శెల్యూకేశ్వరసార్వభౌమా! మీ రీ సంధి కొడంబడి స్నేహమును బాటింతురని మా యాశయము. ఒకమాట! యవనహైందవసఖ్య మనురాగబంధితమైయుండుటకుఁగాను, బరస్పరప్రేమైకచిత్తు లగు హేళినీ చంద్రగుప్తుల కల్యాణమునకు మీ రొడంబడవలయును. ఆ వివాహమహోత్సవము సుదిన మగు నేఁడే జరుగవలయును. ఆ వధూవరుల యనురాగవారిపూరముల శాంతికల్పకము నానాఁట దలిర్పఁగలదు.

శెల్యూ:—ఓ భారత పుణ్యపురుష వరేణ్యులారా! మీతోడి నెయ్యము మా కనంతానందకరము. విశ్వవిఖ్యాత భారత సామ్రాజ్యాధినాథుండగు చంద్రగుప్త సార్వభౌమ శేఖరుండు నాకు జామాత యగుటకంటె, మహాభాగ్య మేమి కలదు? పూర్వజన్మసుకృతాతిరేకమున నాకుమారీమణి కా పురుషోత్తముండు లభించెను. భారతసార్వభౌమా! వివాహ మహోత్సవకాలమున మీరు కోరిన రాజ్యములు మీ కరణముగ నే నొసంగుకొనను. అందులకు బదులు మీరు నా కైదు వందల గజరాజముల బహూకరింపవలయును. స్వరాజ్యమునం గలిగిన యల్లకల్లోలముల నణంచుటకు మీరు సాయ మరు దేరవలయును.

చాణ:—(చిఱునవ్వుతో) ఒక గజగమనకుమా తే నూరు గజరాజముల నిరభ్యంతరముగ నొసంగనగును. శ్వశురుండు కష్టముల నుండుతఱి జామాత యూరకుండఁగలఁడా? వేషాంతరనిగూఢుండై మారాక్షసామాత్యుఁడీ పాటికే మీ బాబిలానునగరమునం దున్నాఁడు. భాగురాయణుని శౌర్యానలము రాక్షసామాత్యుని ప్రతిభావాతూలమును సాయముఁ జేసికొని, మీవిరోధి వహూధినీవిటపి నడంపఁగలదు. ఇంకొక మాట. తిలోత్తమా మలయకేతువు లొండరులఁ బ్రేమించి యున్నారని నా యున్మత్తవేషముననే గ్రహించితిని. వారికిఁ గూడ వివాహము గావింపవలయును. భైరవనాయకా! నీ కిది సమ్మతమా?

శెల్యూకేశ్వర భైరవనాయకులు దమసమ్మతిని దెలియఁ బఱచిరి. ఆనందమలయానిలము శుభస్వరముగా నొక్కమాఱు

భారతశిబిరమున నీఁచెను. ఎల్లఱమోముదమ్ము లామోద వికసితము లయ్యెను. వివాహ మహోత్సవములకు సకల సంభారము లాయత్తము లయ్యెను. చాణక్యాచార్యు నానతిచే మంగళవాద్యములు మ్రోయసాగెను. సైనికు లమితోత్సాహమున జయజయధ్వానములు గావించుచుండిరి. శెల్యూకేశ్వరుం డానందోత్ఫుల్లలోచనుండై హేళినిపాణిపల్లవమును జంద్రగుప్త సార్వభౌమున కందించెను; యవనదత్త పాణిని సార్వభౌముఁడు సస్మితాననమునఁ గ్రహించెను. భైరవుఁడు ప్రియాతనూజాత యగు తిలోత్తమను మలయకేతుమహారాజున కర్పించెను. 'వధూవరులు సకలైశ్వర్య సంపన్ను లగుదురుగాక' యని చాణక్యోపాధ్యాయుఁ డాశీర్వదించెను. 'శాంతిసౌధము చిరస్థాయిగఁ బరిఢిల్లుఁగాక' 'ప్రపంచకల్యాణ మొనఁగూడుఁగాక' యని సైనికు లుత్సాహమునఁ బలికిరి.

స్వస్తి ప్రజాభ్యః పరిపాలయంతాం
న్యాయ్యేన మార్గేణ మహీం మహీశాః
గోబ్రాహ్మణేభ్య శ్శుభమస్తు నిత్యం
లోకా స్సమస్తా స్సుఖినో భవంతు.

అని విప్రవరులు మంగళవాక్యము లాడిరి.

మంగళం మంగళం మంగళం.

సమాప్తము.

—•••—